శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

శ్రీమద్రామాయణపఠనప్రారంభమునందుఁ జదువవలసిన

# ధ్యాన శ్లోకములు.

## దేవతాప్రార్థనము

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం। చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే.

## సరస్వతీప్రార్థనము

దోర్భిర్యుక్తా చతుర్భిః స్ఫటికమణిమయీమక్షమాలాం దధానా
హస్తేనైకేన పద్మం సిత మపి చ శుకం పుస్తకం చాపరేణ,
భాసా కుందేందుశంఖస్ఫటికమణినిభా భాసమానాఽసమానా
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా.

## వాల్మీకిప్రార్థనము

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.

కవిత్వమనెడు కొమ్మనెక్కి "రామ, రామ" యని మధురముగను, మధురము లగునక్షరములు గలుగునట్లును కూయుచుండు వాల్మీకిమహాముని యనెడు కోకిలమునకు నేను మ్రొక్కుచున్నాఁడను.

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.

కవిత్వమనెడి యరణ్యమునందుఁ దిరుగుచుండు వాల్మీకిమహాముని యనెడి సింహముయొక్క శ్రీరామకథ యనెడి గర్జనను విని యెవఁ డుత్తమగతిని బొందఁడు? అనఁగా వాల్మీకిచెప్పిన రామకథ విన్నంతనే యందఱు మోక్షము నొందుదురు.

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్త స్తం మునిం వన్దే ప్రాచేతసమకల్మషమ్.

ఎల్లప్పుడు శ్రీరాములవారి చరిత్రమనెడి యమృతసముద్రమును పానము చేయుచున్నను దనివినొందనట్టి, పాపరహితుఁడగు వాల్మీకిమహామునికి నమస్కరించెదను.

## ఆంజనేయ ప్రార్థనము

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశమక్షహన్తారం వందే లంకాభయంకరమ్.

సముద్రమును గోవు పాదము నంతగాఁ జేసినవాఁడును, రాక్షసుల నందఱను దోమలవలె నలక్ష్యము చేసినవాఁడును, రామాయణమను చంద్రహారమునకు నాయకమణి యైనవాఁడును, వాయుదేవుని పుత్త్రుఁడును, అంజనాదేవికి సంతస మొసఁగఁజేయువాఁడును, వీరుఁడును, సీత దుఃఖమును దొలఁగించినవాఁడును, అక్షయ కుమారుని జంపినవాఁడును, లంకకు వెఱపు పుట్టించినవాఁడును నైన కపిశ్రేష్ఠుఁడగు హనుమంతునికి నమస్కరించెదను.

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.

వాయువేగ మనోవేగములం బోలుగమనవేగము గలవాఁడును, ఇంద్రియములను జయించినవాఁడును, బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడును, వాయునందనుఁడును, వానరుల గుంపులకు మేటియును, శ్రీరాముని దూతయు నైన హనుమంతుని శిరస్సు వంచి మ్రొక్కెదను.

ఉల్లంఘ్య సింధోః స్సలిలం సలీలం
యః శోకవహ్నిం జనకాత్మజాయాః,
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.

సముద్రమును దాఁటి, జానకియొక్క దుఃఖ మనెడియగ్నిని గైకొని, యా యగ్నితోడనే లంకాపట్టణమును గాల్చిన యాంజనేయునికిఁ జేతులుజోడించి మ్రొక్కుచున్నాఁడను.

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్.

తెలుపు నెఱుపుఁగలిసిన వన్నెగల మోముగలవాఁడును, బంగరు కొండ వలెఁ బచ్చని డాలుగల యందమగు శరీరము గలవాఁడును, పారిజాతవృక్షము మొదట నుండువాఁడును నైన వాయుపుత్త్రుఁడగు హనుమంతుని మనంబున ధ్యానించుచున్నాను.

## శ్రీ రామాయణ ప్రార్థనము

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్సాక్షా ద్రామాయణాత్మనా.

వేదములచేఁ దెలియఁదగిన పరమపూరుషుఁడగు విష్ణుమూర్తి దశరథునికిఁ బుత్రుఁడుగ జన్మింపఁగా, వేదము వాల్మీకి మునీంద్రునివలన రామాయణరూపంబున నేర్పడెను.

యః కర్ణాంజలిసంపుటై రహరహః సమ్యక్పిబత్యాదరాత్
వాల్మీకేర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్త సోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్.

ఎవఁడు ప్రతిదినమును వాల్మీకిమహామునియొక్క ముఖ మనెడికమలము నుండి స్రవించిన రామాయణ మనెడునమృతమును తన చెవు లనెడుదోసిళ్లతో నాశదీఱఁ నాదరముతోఁ ద్రాగుచున్నాఁడో, అతఁడు పుట్టుక, రోగములు, ముసలితనము, ఆపదలు, చావు ననెడి యుపద్రవములతో నిండియున్న సంసారమును బాసి, శాశ్వతమయిన వైకుంఠము నొందుచున్నాఁడు.

వాల్మీకిగిరి సంభూతా రామసాగరగామినీ,
పునాతు భువనం పుణ్యా రామాయణమహానదీ.

వాల్మీకి యనెడిపర్వతమున జన్మించి, శ్రీరాముఁ డనెడి సముద్రమును జేరెడు రామాయణ మనెడుగొప్పనది లోకమునంతయుఁ బరిశుద్ధపఱచును గాక !

శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్,
కాండగ్రాహ మహామీనం వన్దే రామాయణార్ణవమ్.

శ్లోకము లనెడియుదకముతో నిండినదియు, సర్గము లనెడి గొప్ప యలలును, కాండము లనెడి మొసళ్లును, గొప్ప మత్స్యములును గలిగి వెలయుచుండు రామాయణమను సముద్రమును నమస్కరించుచున్నాఁడను.

## శ్రీ రా మ ధ్యా న ము

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్,
ఆజానుబాహు మరవిందదళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి,

సకల సంపదలచే వెలయుచుండు రఘువంశమున దశరథునికిఁ బుత్రుఁడుగ జనించినవాఁడును, సాటిలేని మహిమగలవాఁడును, సీతకుఁ బతియును, రఘువంశమునకు రత్నదీపమును, మోఁకాళ్ళవఱకు నుండు చేతులుగలవాఁడును, తామరఱేకులవలె విశాలములయిన కన్నులు గలవాఁడును, రాక్షసవినాశకరుండు నైన రాముని నమస్కరించుచున్నాను.

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,

అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాన్తం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్.

కల్పవృక్షము క్రిందను బంగారుమయ మయిన గొప్పమంటపమున పుష్పక విమానము మధ్యమున నవరత్నఖచితమునైన యాసనంబున వీరాసనము వేసికొని సీతాదేవితోఁగూడ సుఖముగఁ గూర్చుండి, ఎదుట వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు మునులకెల్లఁ పరతత్త్వము బోధించుచుండ, వారికి వివరించి చెప్పుచు, భరతుఁడు మొదలగువారిచేఁ బరివేష్టింపఁబడి నీలమేఘముం బోలు దేహచ్ఛాయగల శ్రీరాముని నమస్కరించుచున్నాను.

రామాయణపఠనసమాప్తియందుఁ జదువవలసిన శ్లోకములు.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః.
గో బ్రాహ్మణేభ్యః శుభ మస్తు నిత్యం
లోకాః సమస్తాః సుఖినో భవన్తు.

జనులకు క్షేమము గలుగునుగాక! రాజులు భూమిని న్యాయము దప్పక పరిపాలించెదరుగాక! గోవులకును, బ్రాహ్మణులకును నెల్లప్పుడు మేలు గలుగునుగాక! లోకము లన్నియు సౌఖ్యము గలిగియుండును గాక!

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాః సంతు నిర్భయాః.
అపుత్రాః పుత్రిణః సన్తు పుత్రిణః సంతు పౌత్రిణః,
అధనాః సధనాః సన్తు జీవన్తు శరదాం శతమ్.

దేవేంద్రుఁడు సకాలవర్షముఁ గురిపించును గాక! నేల పైరుపచ్చలతోఁ గూడి వెలయుచుండునుగాక. ఈ దేశమంతయు క్షామాది బాధలులేక నెమ్మదిగా నుండునుగాక. బ్రాహ్మణులు నిర్భయులయి యుందురుగాక! కొడుకులు లేనివార కొడుకులు గలవారుగను, కొడుకులు గలవారు మనుమలు గలవారుగను నగుదుర గాక! దరిద్రులు ధనవంతులగుదురుగాక! జనులందఱు నూఱేండ్లు బ్రతుకుదురుగాక

చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్,
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.

రాముని చరిత్రము కోట్లకొలఁది విస్తారముగలది. అందొకొక్కక్కయక్షరము మహాపాపములను దొలఁగించును.

శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా,
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా.

ఎవ్వఁడు రామాయణమున ఒకపాదమునయినను, తుదకొక పదమునైనను భక్తితో వినుచున్నాఁడో, వాఁడు బ్రహ్మలోకమును బొంది, బ్రహ్మచే నెల్లప్పుడు పూజింపఁబడుచుండును.

యన్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే,
వృత్రనాశే సమభవత్తత్తే భవతు మంగళమ్.

ఓ రామచంద్రా! వృత్రాసుర సంహారము నపుడు సకలదేవతలచేతను నమస్కరింపఁబడిన దేవేంద్రునకుఁ గలిగిన క్షేమము నీకును గలుగును గాక!

యన్మంగళం సుపర్ణస్య వినతాఽకల్పయత్పురా,
అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగళమ్.

ఓ రామచంద్రా! అమృతము దేఁ బోవునపుడు వినత తన పుత్రుఁడగు గరుడునికిఁ గలుగఁజేసిన మంగళము నీకును నగునుగాక!

అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్,
అదితిర్మంగళం ప్రాదాత్ తత్తే భవతు మంగళమ్.

అమృతము పుట్టించునప్పుడు రాక్షసుల నందఱను సంహరించిన వజ్రాయుధధారియగు దేవేంద్రునికి నదితి యొసంగిన మంగళము నీకుఁ గలుగునుగాక!

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాఽత్మనా వా ప్రకృతేః స్వభావాత్,
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి.

నేను మనోవాక్కాయముల చేతఁగాని, కన్నులు మొదలగు నింద్రియముల చేతఁగాని, బుద్ధి చేతఁగాని, ఆత్మ చేతఁగాని నాస్వభావసిద్ధముగాఁగాని చేయునన్ని క్రియలు భగవంతునికి సమర్పించుచున్నాము.

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

సీతా మనోవల్లభుఁడగు రామచంద్రునికి నమస్కారము.

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం తు యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తు తే.

ఇందు అక్షరలోపమేని, పదలోపమేని, మాత్రాలోపమేని కలిగినచో ఓ నారాయణమూర్తీ! నీవు అదియంతయు మన్నింతువు గాక!

ఓం తత్సత్; శ్రీకృష్ణార్పణమస్తు.

# విషయసూచిక

## బాలకాండము

---



శ్రీరామపట్టాభిషేకము. బా—1

శ్రీరస్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర

# వచనరామాయణము

## బాలకాండము

### 1-వ సర్గము.

#### కథాసంగ్రహము

అవతారిక: శ్రీవాల్మీకిమహాముని, తాను సర్వజ్ఞుఁడయినను, జనులందఱుఁ దనవలెనె గురూపదేశమువలనఁ దాపత్రయవిముక్తి నొందుదురుగాక యనితలంచి, నారదమహామునివలనఁ దాను బ్రహ్మస్వరూపము నెఱింగి, రామాయణమను మహాకావ్యంబునఁ దానెఱింగిన బ్రహ్మస్వరూపమును దెలుపఁగోరి, యది నిర్విఘ్న పరిసమాప్తి నొందుటకై, సంక్షేపరామాయణ మనఁబడు నీ మొదటిసర్గయందు నారదుని దాను బ్రహ్మస్వరూప మెట్టిదని యడుగుట, నారదుఁడు తనకు బ్రహ్మస్వరూపమును దెల్పుట యను కథారూపంబున నిష్టదేవతాస్మరణరూప మంగళముఁ జేయుచున్నాఁడు:

తపస్సంపన్నుఁడగు వాల్మీకి బ్రహ్మవిచారమునను, వేదాధ్యయనమునను మిక్కిలి యాసక్తిగలవాఁడును, జ్ఞానులలో నుత్తముఁడును, మునులలో మేటియునైన నారదుని జూచి "ఓ మునీంద్రా, యిక్కాలంబున నీభూలోకంబునందుఁ బరాక్రమశాలియు, గుణవంతుఁడును, ధర్మముల నెఱింగినవాఁడును, మేలు మఱువనివాఁడును, ఆడినమాట తప్పనివాఁడును, తలఁచినపని యీడేరువఱకు విడువని పట్టుదలగలవాఁడును, మంచి నడవడితోఁ గూడినవాఁడును, సర్వభూతములకు మేలు

గోరువాఁడును, మంచి చెడ్డ లెఱింగినవాఁడును, నేర్పరియు, సంతతము ప్రియమైన దర్శనముగలవాఁడును, ధైర్యవంతుఁడును, కోపము లేని వాఁడును, కాంతితోఁగూడినవాఁడును, నొరులపై నోర్వలేమి లేని వాఁడును, కోపముతో యుద్ధరంగమున దేవతలనైనను వెఱపించునట్టి వాఁడునునగు మహాపురుషుఁడెవ్వఁడు? అట్టివానిని మీవలన నేను విన వలయు నని మిక్కిలి మక్కువపడియున్నాను. మహామునీ, నీవట్టి పురు షోత్తము నెఱుంగఁజాలుదు" వని సవినయంబుగ నడిగెను.

ఇవ్విధమున వాల్మీకి యడిగినవాక్యంబు విని మూఁడులోకంబుల నెఱింగినవాఁడగు నారదుఁడు "ఓయి వాల్మీకీ, నీ వడిగిన ప్రశ్న కుత్తర మిచ్చెద. సావధానుండవై యాలకింపు" మని చెప్పి, మనంబున నుప్పొంగుచు నిట్లని చెప్పఁదొడఁగెను. "నీవు చెప్పినగుణంబు లెల్ల నొక్కపురుషునియం దుండుట మిక్కిలి యరుదు. అయినను నాదివ్య దృష్టిచే నట్టిమహాపురుషుని దెలిసికొని నీకుఁ జెప్పెదను వినుము. ఇక్ష్వాకువంశమందుఁ బుట్టిన శ్రీరాముఁడను నృపాలుఁ డొక్కరుఁడు గలఁడు. అతఁడు సుశిక్షితమైన మనస్సు, పరాక్రమము, కాంతి, ధైర్యము, ఇంద్రియజయము గలవాఁడు. బుద్ధిమంతుఁడు; నీతి నెఱింగిన వాఁడు ప్రవక్త సకలైశ్వర్యసంపన్నుఁడు శత్రువుల జంపువాఁడు ఎగుబుజములు గలవాఁడు గొప్పచేతులు గలవాఁడు శంఖమువంటి మెడ గలవాఁడు; గొప్ప దౌడలు గలవాఁడు; వెడల్పయిన ఱొమ్ముగల వాఁడు గొప్పవిల్లు గలవాఁడు బలిసి కాన్పింపని మూపుల సంధి యెముకలు గలవాఁడు; మోఁకాళ్ళదనుకనుండు నిడుదచేతులు గల వాఁడు; గుండ్రని తలగలవాఁడు; శుభలక్షణములతోఁ గూడిననొసలు గలవాఁడు; సొంపగు కాలినడక గలవాఁడు; మిక్కిలి పొడుగును మిక్కిలి పొట్టియుఁ గానియాకారమును నెచ్చుతక్కువలు లేక చక్కఁగఁదీరిన యంగములును గలవాఁడు; నున్నని శరీరకాంతియు నెక్కువ పరా క్రమంబును గలవాఁడు; బలిసినఱొమ్ము వెడఁదలైన కన్నులునుం గల వాఁడు; మంచి యవయవసౌభాగ్యసంపదతోఁ గూడినవాఁడు; సాముద్రికశాస్త్రమునందుఁ జెప్పఁబడిన శంఖచక్రాదిశుభరేఖలతోఁ గూడినవాఁడు. మఱియు నా పురుషశ్రేష్ఠుఁడు సకలధర్మముల నెఱిఁగిన

వాఁడు, సత్యము పలుకువాఁడు; జనులకు మేలొనర్చుటయందు మిక్కిలి శ్రద్ధగలవాఁడు; కీర్తిని గోరువాఁడు; జ్ఞానముతోఁ గూడినవాఁడు; పరిశుద్ధాత్ముఁడు పెద్దలకు లోఁబడియుండువాఁడు; తన్నాశ్రయించిన భక్తులను గాపాడుటయందు చింతగలవాఁడు; బ్రహ్మదేవునితో సాటి వచ్చువాఁడు; అఖండైశ్వర్యసంపన్నుఁడు; సకలజగత్పోషకుఁడు; దుష్టులను సంహారించువాఁడు; ముల్లోకంబులంగల జీవజంతువులనెల్లఁ బోషించువాఁడు; బ్రహ్మక్షత్రవైశ్యశూద్రులనెడి నాలుగు వర్ణములవారినిఁ దమతమ ధర్మముల నతిక్రమింప కుండులాగునఁ జూచువాఁడు; స్వధర్మములను దాఁటకుండువాఁడు; తనబంధువులఁ బోషించువాఁడు; వేదములయు వేదాంగములయుఁ దత్త్వమును జక్కఁగా నెఱింగినవాఁడు; విలువిద్దెయందు నేర్పుగలవాఁడు; తర్కవ్యాకరణమీమాంసాదిసకలశాస్త్రములయొక్క సిద్ధాంతముల నెఱింగినవాఁడు; ఒకతడవఁ జూచినవానినెప్పటికిని మఱవకుండు జ్ఞాపకశక్తియు, నెంతకఠినమైన విషయమునైనను గ్రహించు చుఱుకుఁదనమును గలవాఁడు; అన్నిలోకముల కొప్పిదమయినవాఁడు; అపకారులకైన నుపకారముఁ జేయువాఁడు; ఎట్టియాపదలందైనను వెనుకఁదీయని గంభీరస్వభావముగలవాఁడు; కాలోచితములైన లౌకికవైదికకార్యములయందు సమర్థుఁడు నైనవాఁడు; మఱియు నదులెల్లవచ్చి సముద్రమును జేరినట్లు, ఎల్లప్పుడు సజ్జనులందఱు వచ్చి సన్నిధిఁ జేరినవాఁడు. పూజ్యుఁడు, ఎల్లజీవజంతువులను బక్షపాతములేక చూచువాఁడు; సంతోషసమయంబుననైనను, కోపసమయంబుననైనను నొక్కతీరునఁజూపఱ కింపైన రూపము గలవాఁడు. ఇట్లాతఁడు సకలసుగుణంబులతో నిండినవాఁడు. ఆమహానుభావుఁడు దశరథునిబట్టంపుదేవియగు కౌసల్యకు నానందమును గలిగించు కుమారుఁడు. మఱియు నతఁడు సముద్రమువలె గంభీరమైనమనస్సుగలవాఁడు;హిమాలయంబుచందమున ధైర్యవంతుఁడు; పరాక్రమంబున విష్ణునిఁబోలినవాఁడు; చంద్రునివలె జనులకుఁ బ్రియముగ గనుపించువాఁడు; కోపంబునఁ బ్రలయకాలమునాఁటి యగ్నినిబోలినవాఁడు; ఓర్పునందుఁ బుడమిని బోలినవాఁడు; దానమునందుఁ గుబేరునిఁ బోలినవాఁడు; సత్యము పల్కుటయందు రెండవధర్మదేవతయనఁదగినవాఁడు.

ఒక దశరథమహారాజు తన ప్రజలకు మేలుసేయఁగోరి, కుమారులలోఁ బెద్దవాఁడును, సుగుణములతోఁ గూడినవాఁడును, జనులకు మేలగు కార్యంబులఁ జేసెడువాఁడునై యున్న తన ప్రియకుమారుఁడగు రాముని యువరాజును జేయనెంచి, దానికిఁ గావలయు ప్రయత్నములు చేయుచుండఁ జూచి కైకయను నతని చిన్నభార్య తనకు మున్ను దశరథుండొసఁగిన రెండువరంబుల జ్ఞప్తికిఁ దెచ్చుకొని, వానిలో నొక్కటి రామునికిఁ బదునాలుగేం డ్లరణ్యవాసంబుగను, మఱియొక్కటి తనపుత్త్రుఁడగు భరతునికిఁ బట్టాభిషేకంబుగను వరించెను. అప్పుడు మహారాజు వాగ్దత్తము తప్పనివాఁడగుటవలన ధర్మమను త్రాటిచేఁ గట్టఁబడినవాఁడయి తనకుఁ బ్రియకుమారుఁడైన రాము నడవికిఁ బొమ్మనెను. శ్రీరాముఁడు కైకయిష్టంబు తీరుటకును, దండ్రిమాట చెల్లుటకును దాను జేసిన ప్రతిజ్ఞను నెఱవేర్పఁగోరి యడవికిఁ బయనమయ్యెను. అతనికిఁ బ్రియుఁడును, దమ్ముఁడునునైన సుమిత్రకొడుకు లక్ష్మణుఁడు రామునందలి ప్రేమచే నతని నెడఁబాసి యుండఁజాలక జనులకుఁ దోఁబుట్టుఁదనమిట్టిదని తెలుపుచు నడఁకువతోఁ గూడి రాముని వెంబడించెను. అట్లే రామునికిఁ బ్రియురాలును, బ్రాణముతో సాటివచ్చునదియు, నెల్లప్పుడు భర్త మేలును గోరుచుండునదియు, రాక్షసుల మోహింపఁజేయునిమిత్తము నిర్మింపఁబడిన మోహినీదేవతయో యనఁదగినదియు, సకలశుభలక్షణంబులతోఁ గూడినదియు, స్త్రీలలో నుత్తమురాలును, జనకమహారాజుకూఁతురునునైన సీతాదేవియుఁ జంద్రుని రోహిణినక్షత్రంబువలె రాముని వెంబడించెను.

ఇట్లు రాముఁడు సీతాలక్ష్మణులతోఁ గూడినవాఁడై, రథంబెక్కి దశరథుఁడును, పౌరులును బరమప్రీతిచేఁ దన్ను వెంబడించి వచ్చుచుండఁ గొంతదవ్వేఁగి, వారిని మఱలించి, గంగానదీతీరంబున నున్న శృంగిబేరంబను పత్తనంబు చేరి, యచ్చట నున్న తనచెలికాఁడును బోయరాజునునగు గుహునిజూచి, తనరథసారథి నయోధ్యకు రథంబుఁ దోలుకొనిపొమ్మని యానతిచ్చి, గుహునిసాహాయ్యము వలన గంగానదిని దాఁటి, యొకవనమునుండి మఱియొకవనంబునకుఁ బోవుచు, దారిపొడుగున నున్న విస్తారజలంబుగల నదులను దాఁటుచుఁ బోయి, చిత్రకూట

పర్వతంబుఁ జేరి, యచ్చట జక్కని పర్ణశాలను నిర్మించుకొని యందు యమ్మహాత్ముని యానతిని భరద్వాజముని యాశ్రమంబుచొచ్చి, దేవ గంధర్వులమాడ్కి సుఖంబుగ నివసించుచుండిరి.

రాముఁడు చిత్రకూటము చేరఁగనే, అయోధ్యయందు దశరథుండు పుత్రు నెడఁబాసిన దుఃఖముచే మృతినొందెను. అంత భరతుండు తండ్రిమరణవార్తను దూతలవలన విని అయోధ్యకేతెంచి వసిష్ఠుండు మొదలగు బ్రాహ్మణులు రాజ్యంబుఁ గైకొనుమని చెప్పుచున్నను, వారి మాటలఁ జెడచెవింబెట్టి, రాజ్యంబేలుటకు మనంబులేనివాఁడై, తన యన్నను బ్రతిమాలఁగోరి, తాను సైన్యంబునకుం జని, చిత్రకూటంబు సొచ్చి, మంచిమనస్సు గలవాఁడును, సత్యపరాక్రముఁడునైన రాముని జూచి వినయముతోడ మ్రొక్కి, "అన్నా నీవు సకలధర్మముల నెఱింగిన వాఁడవు, నీవు పెద్దవాఁడవు; పెద్దవాఁడుండఁగఁ జిన్నవాఁడు రాజగుట ధర్మముగాదని నీవెఱింగియే యున్నాఁడవు. కావున నీవే రాజవు. మఱియెవ్వఁడును రాజు గానేరఁ"డని రామునితోఁ జెప్పెను. అట్లు భరతుండు తన్ను రాజ్యంబుగైకొనఁ బ్రార్థించినను, మిక్కిలి గొప్పమనసుగలవాఁడును, జనులకందఱికి సంతోషముఁ గల్గించు వాఁడును, విశేషబలము గలవాఁడును, యాచకులకుఁ గోరిక లొసంగుటచే సంతతఁ బర్వినకీర్తి గలవాఁడునగు, రాముఁడు తండ్రియానతిని మీఱి రాజ్యంబు గైకొననొల్లఁడయ్యెను. ఎట్టకేలకు భరతుని ప్రార్థనను ద్రోసివేయఁజాలక దనకుమాఱు తనపాదుకలఁబెట్టి రాజ్యమేలుమని చెప్పి, యతని నయోధ్యకుఁ బొమ్మని పలుమాఱు నిర్బంధింపఁగా, భరతుఁడు తనకోర్కి నెఱవేఱకయె మఱలివచ్చి, రామునిపాదుకలను సేవించుచు, రామునిరాక కెదురుచూచుచు నయోధ్యకు సమీపమున నుండు నందిగ్రామంబున నుండి రాజ్యకార్యములను నెఱవేర్చుచుండెను. భరతుండు చిత్రకూటంబునుండి మఱలఁగానే, ప్రశస్తకాంతిగల వాఁడును, నెవరెంత నిర్బంధించినను బ్రతిజ్ఞతప్పనివాఁడును, రాజ్య భోగములందపేక్ష లేనివాఁడును కమలములవంటి కన్నులు గలవాఁడును నగు రాముఁడు "మనమిచ్చట నున్నచో భరతునివలెనే పట్టణవాసులగు జను లప్పుడప్పుడు వచ్చుచుందురు. ఈ ప్రదేశము మనకుఁ దగినదికాదు,"

దని యెంచి, తండ్రి పనుపును జేయుటయందే తలంపుంచినవాఁడై దండ కారణ్యమును బ్రవేశించి, విరాధుండను రాక్షసునిఁ జంపి, శరభంగ మహామునిదర్శనం బొనర్చి, సుతీక్ష్ణ మహామునిని సేవించి, అగస్త్యా శ్రమమునకుఁ జని, యందగస్త్యమునిని, ఆతనిసోదరుని సందర్శించెను. అగస్త్యుఁడు తన కింద్రుఁడొసంగిన వింటిని, కత్తిని, యుద్ధములో నెంత కాలము ప్రయోగించినను దఱుగని బాణంబులుగల రెండమ్ములపొదు లను గైకొనుమని చెప్పఁగా వానినిఁ దీసికొని యచ్చట నివసించు చుండెను.

రాముఁ డచ్చట నివసించుచుండఁగ నచ్చటనున్న మును లందఱు తమకు బాధలు సల్పుచుండు రాక్షసులను వధింపుమని రాముని బ్రార్థించిరి. ఆతఁడును నగ్నిహోత్రునిమాడ్కిఁ బరిశుద్ధులును, జితేంద్రియులునునైన దండకారణ్య నివాసులగు ఋషులనిమిత్తమై యుద్ధమునందు రాక్షసులను, నసురులను దప్పక వధించెదనని ప్రతిజ్ఞ సేసి, అచ్చట నుండఁగాఁ, గోరినరూపంబు ధరింపఁగలదగు జనస్థానమం దుండు శూర్పణఖయను నొకరాక్షసాంగన వారికడకేఁగుదెంచిన, రాముఁడు దానిని వికృతరూపము నొందించెను. అంత శూర్పణఖ యవ మానము నొందినదై జనస్థానంబునకుఁ జని, ఖరదూషణత్రిశిరసులతోఁ దనభంగపాటుఁ దెలుపఁగాఁ గోపముతో యుద్ధమునకు వచ్చిన ఖర దూషణత్రిశిరసులను, వారివెంబడి వచ్చిన పదునాలుగువేలమంది రాక్ష సులను సంహరించెను. ఇట్లు జనస్థాననివాసులగు ఖరదూషణాదిరాక్ష సులు పదునాలుగువేవురు రామునిచేఁ జంపఁబడిరన్న దుఃఖకరవార్తను విని రావణుండు చాలఁ గోపమునొందినవాఁడై, సీత నపహరింపఁగోరి, అక్కార్యంబునందుఁ దనకుఁ దోడ్పడుటకై మారీచునిం గోరఁగా, నమ్మారీచుఁడు, "రావణా ! రాముఁడు బలవంతుఁడు. అతనితోడి వైరంబు దగ"దని పలుతెఱంగులఁ జెప్పినను వినక, యతఁడు మృత్యుదేవతచేఁ బ్రేరితుఁడై మారీచునితోడ రాముని ఆశ్రమముకడ కేతెంచి, మాయామృగరూపధారియైన మారీచునిమూలమున రామలక్ష్మణులను దూరమునకుఁ బోవున ట్లొనర్చి, సీతాదేవి నెత్తికొని పోవుచుండ నడ్డమువచ్చిన జటాయువును దెగటార్చి, లంకకుఁ బోయిచేరెను. పిదప

రాముఁడు వెనుకకు మరలివచ్చి సీతను గానక, రావణునిచే మోదఁబడి చావునకు సిద్ధమైయున్న జటాయువుం జూచి, యాతనివలన రావణుండు సీత నెత్తుకొనిపోయినసంగతి నెఱింగి, మిక్కిలి దుఃఖముచేఁ బరితపించుచుఁ గలఁతఁజెందిన యింద్రియములు గలవాఁడై, కొంతసేపు చింతించి, ఆ చింతతోడనే జటాయువునకు దహనాదికార్యంబులు నడపి, సీతను వెదకుచుఁ బోవుచు, మహాభయంకరరూపంబుతో నున్న కబంధుఁడను రాక్షసుని జంపి దహనంబుసేయఁగా నా కబంధుఁడు స్వర్గలోకంబునకుఁ జనియెను.

కబంధుఁడు స్వర్గమున కేఁగుచు, "ఓరామా! ఈవనంబున సకల ధర్మములనెఱింగి, వానిని నడుపుచు, సన్యాసాశ్రమమున నున్న శబరస్త్రీ యొక్కతె యున్నది. దానికడకుఁ బొమ్ము" అని చెప్పిన శత్రుసంహారి యగు రాముఁ డాశబరికడ కేఁగ నాశబరి రాముని నర్ఘ్యపాద్యాదిసత్కారంబులచేఁ బూజించెను. రాముఁడు శబరి భక్తితోఁ జేసిన పూజలఁ గైకొని లక్ష్మణునితోఁ గూడఁ బంపాసరస్తీరంబున సంచరించుచుండఁ, హనుమంతుఁడనువానరునిఁ గలిసికొని వాని మాటవెంట సుగ్రీవు కడకుఁ జని వానితోఁ జెలిమియొనర్చి, వానికిఁ దనవృత్తాంతమునంతయు, ముఖ్యముగా సీతవృత్తాంతమును సవిస్తరముగాఁ జెప్పెను. సుగ్రీవుఁడు రామునివృత్తాంతమునెల్ల నాలకించి, తనవలెనె దుఃఖితుఁడైయున్న మహాబలునితోఁ జెలిమిచేయుట తనకు మంచిదేయని తలఁచి యగ్నిసాక్షికంబుగా నతనితోఁ జెలిమియొనర్చి, యతనియందలి చెలిమిచేతను, మనంబున నణఁపరాని వ్యసనము చేతను దనకు వాలితోఁ గలిగిన వైరంబునకుఁ గారణము రాముఁ డడుగ నాసంగతియెల్ల నతనికిఁ దెలిపెను. రాముఁడు "నేను నీవిరోధియగు వాలిని సంహరించి నీకు రాజ్యం బిప్పించెద" నని ప్రతిజ్ఞ సేసెను. అయినను సుగ్రీవుఁడు రాముని పరాక్రమంబు దెలియక, యతనికి వాలియొక్క బలపరాక్రమముల వర్ణించి, యతనికి నమ్మకము గలుగుటకై, పూర్వము వాలిచే విసరివేయఁబడిన పర్వతాకారమైన దుందుభియను రక్కసుని కళేబరంబుఁజూపెను. బలవంతుఁడైన రాముఁడు ఇదెంతమాత్రమని చిఱునవ్వు నవ్వి, తనకాలి బొట్టనవ్రేలితో దానిని పదియామడలదూరము చిమ్మి యప్పటికినిఁ దన

యెడ సుగ్రీవునకు నమ్మకము లేకుండుటఁజూచి, యాతనికి నమ్మకము బుట్టునట్లుగ నేడు మద్దిచెట్లను, దాని చేరువనుండు నొక్క కొండను, రసాతలమును నొక్క బాణంబుచే భేదించెను. అప్పుడు సుగ్రీవుఁడు వాలిని రాముఁడు చంపఁగలఁడని నమ్మి, మిక్కిలి యుప్పొంగుచు రాముని వెంటఁబెట్టుకొని కిష్కింధాపట్టణంబు సమీపించి, సింహనాదంబు చేయఁగా, వాలి విని, తార వలదనుచున్నను వినక, సుగ్రీవునితోఁ గయ్యమునకు వచ్చెను. అంత రాముఁడు సుగ్రీవునికి సహాయుఁడుగా నుండి, వాలి నొక్క బాణంబుచేఁ బడగూల్చి, సుగ్రీవుని కిష్కింధాపురంబునఁ బట్టాభిషిక్తుఁజేసెను. అంత సుగ్రీవుఁడు తనమంత్రులగు హనుమదంగద ప్రభృతులగు వానరులఁ బిలిపించి, సీతను వెదకిరండని యన్ని దెసలకుఁ బంపెను. బలవంతుఁడగు హనుమంతుండు దక్షిణదిక్కునకుఁ బోవుచు, జటాయువున కన్నయగు సంపాతివలన రావణుండు సీతను లంకకుఁ గొనిపోయె నన్నవార్తను విని, నూఱుయోజనంబుల వెడల్పుగల యుప్పుసముద్రమును దాఁటి, రావణునిచేఁ బాలింపఁబడుచుండు లంకలోఁ జొచ్చి, యశోకవనంబున దుఃఖపడుచు రామునే తలంచుచున్న సీతను జూచెను. ఆమెకు రాముఁడొసఁగిన యుంగరము నిచ్చి, యామెవలన నన్నిసంగతులను విని గుఱుతుకై చూడారత్నమునుగొని, రాముఁడు శీఘ్రముగా వచ్చి నిన్నుఁ గొనిపోవనున్నాఁడని యామె నూఱడించి, యామెవలన సెలవువడసి, యంతటితోఁ జాలింపక యా యశోకవనముయొక్క వెలుపలిగోపురమును నుగ్గుచేయఁగా రావణుండు కోపముతోఁ గూడినవాఁడయి, హనుమంతునిఁజంపుడని యేవురు సేనానాయకులను, నేడ్వురు మంత్రిపుత్రులను, శూరుండగు నక్షయకుమారునిఁ బంపఁగా, వారినెల్ల సంహరించెను. అంత రావణుండు క్రోధమూర్ఛితుఁడై, యింద్రజిత్తును బంపఁగా వాఁడు బ్రహ్మాస్త్రంబుచే వాని బడనేయఁ దక్కిన రక్కసులందఱు వానిని త్రాళ్లతోఁగట్టి రావణునికడకుఁ దీసికొనిపోయిరి. అప్పుడు హనుమంతుఁడు దేవుని బ్రహ్మావరమువలన బ్రహ్మాస్త్రంబుచే విడువఁబడినను, రావణునితో సంభాషింపవలె నన్నతలంపుతో వారినేమియుఁజేయక యూరకుండి, రావణునితో మాటాడి, పిమ్మటఁ దన తోఁకకు వా రంటించిన యగ్ని నశోకవనంబును, విభీషణునినగరును

దక్కఁ దక్కిన లంకాపురంబు నెల్లఁ గాల్చి, రాముని కీసంతోషవార్తఁ దెలుపుటకై, మఱల సముద్రము దాఁటి రాముని సమీపమునకుఁ జేరి, మహాత్ముండగు రామునికిఁ బ్రదక్షిణంబు నేసి, లంకలో సీతను జూచితి నని చెప్పి, యచ్చటఁ దాను జేసిన కార్యముల నెల్ల విస్తరించి చెప్పెను.

అంత రాముఁడు సుగ్రీవునితోడ సముద్రతీరముఁ జేరి, యా సముద్రము దాఁటుట కలవి కాకుండుటఁ జూచి, యత్యంతకోపముతోఁ దీక్ష్ణములైన బాణంబుల నానిపైఁ బ్రయోగించెను. అంత సముద్రుఁడు రామునకు వెఱచి, యతనియెదుట నిలిచి తనరూపంబుఁ జూపి, నీలుఁ డను వానరునిచే సేతువును గట్టించి దాఁటుఁడని చెప్పిన నాతనిమాట ప్రకార మానీలునిచే సేతువుఁ గట్టించి సముద్రము దాఁటి, యుద్ధరంగ మున రావణుని, వానిబలగము నెల్లఁ జంపి, సీతనుజూచి, "పరగృహంబున నిన్ని దినములున్న భార్య నెట్లు మఱలఁ బొందవచ్చు"నని మిక్కిలి సిగ్గుపడి, వానరు లందఱు, తక్కిన జను లనేకులు వినుచుండ నామెను బోడుపుమాటలచే నొప్పించెను. అప్పుడు సీతాదేవి మహాపతివ్రత యగుటం జేసి, రాముఁ డన్నమాటల కోర్వలేక యగ్నిప్రవేశంబు సేయఁ గా, నగ్నిహోత్రుఁ డామెకుఁ జల్లనివాఁడై "యీమె పతివ్రత, యెట్టి పాపము నెఱుంగ"దని చెప్పెను. రాముఁడా వాక్యములను విని సీత నిర్దుష్టయని యెఱింగి, యామెను బ్రీతితోఁ గైకొని, సకలదేవతలును స్తోత్రములు చేయుచుండ దేదీప్యమానుండై యుండెను. అప్పుడు స్థావర జంగమాత్మకంబులైన త్రిలోకవాసులును, దేవతలు, ఋషులుమున్నగు వారును, మహాత్ముఁడైన రాముఁడు లోకకంటకుండయి యెవ్వరికిని జయింపనలవికాని రావణుని జంపినందుకై యానందము నొందిరి. అంత రాముఁడు రాక్షసేంద్రుండయిన విభీషణుని లంకాపురంబునకుఁ బట్టాభిషిక్తుం జేసి, తాను భూలోకంబున నవతరించిన కార్యం బెద్దియో దానిని సాధించుటం జేసి నిశ్చింతుఁడై మనంబున సుప్పొంగుచు దేవతల వలన వరంబులం బొంది, యుద్ధమునందుఁ జచ్చిన వానరులనందఱ నావర బలంబుచే బ్రతికించి, సుగ్రీవవిభీషణాదులగు చెలికాండ్రతోఁ గూడఁ బుష్పకవిమానం బెక్కి యయోధ్యకుఁ బయనమై, భరద్వాజునియాశ్ర

మంబును బొంది, యమ్ముని ప్రార్థనంబువలన నచ్చట నొకదినంబు గడపఁ దలఁచి, ముందుగాఁ దనరాకను భరతునికిఁ దెలుపుటకై హనుమంతుని బంపెను. పిమ్మట రాముఁ డచ్చట నొకదినంబుండి, మఱునాఁడు సుగ్రీవవిభీషణాదులతోఁ గూడఁ బుష్పకవిమానం బెక్కి, వారికిఁ బూర్వము జరిగిన కథలఁ జెప్పుచు నందిగ్రామమునకుఁ బోయి యచ్చటఁ దనజడలనెల్ల దీసి, మునివేషంబు విడిచి, తనతమ్ములు వెంబడించుచుండ సీతతోఁ గూడినవాఁడై యయోధ్యం జేరి పట్టాభిషిక్తుఁడై రాజ్యంబుఁ బాలించెను.

రాముఁడు రాజ్యముచేయునప్పుడు లోకమెల్ల సంతోషముతో నిండినదై, సకలసాపదలంబడసి యేమియుఁ గొఱతలేనిదై యుండెను. జనులు తమతమకులాచారధర్మంబులఁ దప్పక నడపుచు దానధర్మాదులఁ జేయుచుండిరి. వారికి వ్యాధిబాధలు నశించెను. క్షామము లేకుండెను. చోరాగ్నిదుష్టభీతిలేక జనులు నిర్భయులై యుండిరి. జనులు బుత్ర శోకము లేకుందురు. స్త్రీలెల్లప్పుడును వైధవ్యదుఃఖము నొందక మహాపతివ్రతలై యుందురు. జనులకగ్నిభయము, నీటిభయము, వాయుభయము, రోగభయము, ఆఁకలి, దొంగలభయమును నుండవు. పట్టణంబులును, దేశములును, ధనధాన్యసమృద్ధములయి యుండును. జనులందఱు కృతయుగంబునందువలెనే యెల్లప్పుడును సంతోషముతో నొప్పుచుందురు. శ్రీరాముఁడు లెక్కలేని యశ్వమేధయాగంబులను, బహుసువర్ణకములను యాగములను జేసి, దేవతలఁ దృప్తినొందించి బ్రాహ్మణులకుఁ బదివేలకోట్ల గోదానంబులును, విస్తారధనంబును నొసంగి మహాకీర్తి వడసి, శాశ్వతంబగు తనపదవి నొందఁగలఁడు. మఱియు రఘువంశోత్పన్నుఁడయిన రాముఁడు క్షత్రియవంశస్థులను నూఱింతలుగా వృద్ధి నొందించి, బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్రులను దమతమ వర్ణాశ్రమధర్మంబులందు నిల్పి, పదునొకండువేలయేండ్లు రాజ్యమును బాలించి వైకుంఠము నొందఁగలఁడు.

## ఫలశ్రుతి.

పావనమును, పాపములఁ బోఁగొట్టునదియుఁ, బుణ్యముల నొసఁగునదియు, దీర్ఘాయువు నిచ్చునదియుఁ నాలుగు వేదములతోఁ



వాల్మీకిమహాముని మగక్రౌంచపక్షినిజంపిన
బోయవానిని శపించుట. బా—10

దుల్యమయినదియు నగు శ్రీరాముని చరిత్రమును నియమముతోఁ బఠించు మానవుండు సకలపాపములచే విడువఁబడి, పుత్రపౌత్రాదులతోఁగూడి యీలోకంబుల సకలసౌఖ్యంబు లనుభవించి యంతమునందు స్వర్గ లోకంబును బొంది, దేవతలచేఁ బూజింపఁబడుచుండు. ఈ రామచరితం బును బ్రాహ్మణుండు పఠించునేని సకలవిద్యలలో నిపుణుఁడగును. క్షత్రియుఁడు పఠించునేని రాజ్యాధిపత్యంబు నొందును. వైశ్యుఁడు పఠించునేని వర్తకమువలని లాభంబులం బడయును. శూద్రుఁడు పఠించు నేని మహత్త్వమును బొందును.

## 2-వ సర్గము.

వాల్మీకిమహాముని మగక్రౌంచపక్షినిఁ జంపిన బోయవానిని శపించుట

వాక్యములయర్థము నెఱింగినవాఁడును, ధర్మమునం దాసక్తి గల వాఁడును నైన వాల్మీకిమహాముని నారదమునియొక్క యీవాక్యమును విని శిష్యులుం దానును దానింగొనియాడి, నారదమహామునిని శాస్త్రోక్త ప్రకారముగఁ బూజించెను. అమ్మునీంద్రుఁ డాపూజఁగొని వాల్మీకిమహా మునిని సంతోషపఱచి, యాతని యనుజ్ఞవడసి బ్రహ్మలోకమునకుఁ బోయెను.

నారదుఁడు బ్రహ్మలోకమునకుఁ జనినపిదప ముహూర్తమాత్ర కాలములోపల, వాల్మీకి మాధ్యాహ్నికస్నానమునకై గంగానదికి దాపున నుండు తమసానదీతీరంబునకుఁ బోయి, రొంపిలేక నిర్మలమైయున్న రేవును జూచి, వెంట వచ్చిన శిష్యునితో నిట్లనియె: "ఓ భరద్వాజా, యీ రేవును చూచితివా. ఇయ్యది సత్పురుషుని మనస్సువలె నిష్కల్మ షమైన నీటితో చూడ సొంపుమీఱి వెలయుచున్నది. కావున నాయనా, మనపాత్రంబుల నిచ్చటనుంచి, నాకు నారబట్ట నిమ్ము. నే నీ తమసానదియందు స్నానము జేసెదనని చెప్పఁగా, భరద్వాజుండు పరి శుద్ధుఁడై భక్తితోఁ దనగురువగు వాల్మీకిమహామునికి నారబట్టఁ దెచ్చి యిచ్చెను. అంత ఇంద్రియముల జయించిన వాల్మీకిమునీశ్వరుండు శిష్యుని చేతినుండి నారబట్టను గైకొని విశాలమైనవనమున సంచరించుచు, వా తమసానదీతీరసమీపంబున నొండొంటిబాయక తిరుగుచు శ్రావ్యముగాఁ గూయుచున్న క్రౌంచదంపతులను జూచెను.

అట్లాయన చూచుచుండఁగనే సమస్తజంతువులందును బుట్టినది మొదలు పగగలిగి, కటికిఁదనముఁజూపు నొక బోయవాఁడు వానిలో మగపక్షిని గూలనేసెను. అట్టిసమయంబున నాయాఁడుపక్షి తనకుఁ బెనిమిటిదయ్యె, తన్నెడఁబాయక గూడఁదిరుగుచు మదముచే నొప్పినదై, క్రిందఁబడి నెత్తుటఁదడసిన మేనితోఁ బుడమిపైఁ బొరలుచున్న మగక్రౌంచమును జూచి కనికరంబు పుట్టునట్లు లేడ్చెను. అట్లు బోయవానిచేఁ గొట్టఁబడి క్రిందఁబడి విలవిలఁ దన్నుకొనుచున్న పక్షిని జూచినంతనే ధర్మాత్ముఁడయిన వాల్మీకి మిక్కిలి జాలినొంది, దయాళువుగాన నతి కాలమునసున్న యట్టిపక్షిదంపతులఁ జంపుట యధర్మమని తలఁచి, విలపించుచున్న యాఁడుపక్షినిజూచి బోయవానితో నిట్లనియె.

"ఓరీ, పాపాత్ముఁడా, యీ క్రౌంచదంపతులలో రతిపరవశమై యున్న యొక మగపక్షిని జంపితివిగదా! నీవు చిరకాలము సౌఖ్యముతో నుండఁ జాల" వనిపలికెను. అని యిట్లు పలుకుచుఁ బక్షిదంపతులనుజూచుచున్న యాముని హృదయములో నొకచింత గలిగెను. ఈచనిపోయిన పక్షినిమిత్తమైన శోకముతో నార్తుఁడనై నేను బలికిన దిది యేమి అని చింతించుచు గొప్పబుద్ధిమంతుఁడును, పండితుఁడును నైన వాల్మీకిమహాముని యొకనిశ్చయంబు చేసికొని శిష్యునిఁబిలిచి, "ఓనాయనా, నేనిప్పుడు శోకముతోఁగూడఁ జెప్పినది నాల్గుపాదములు గలదియు, ఒక్కొక్క పాదమునను సమానమైన యక్షరములసంఖ్య గలదియు నై, వీణెయందుఁబాడఁదగిన లయతాళములతోఁ గూడిన శ్లోకమగును గాని మఱియొక్కటి గా" దని చెప్పిన, శిష్యుఁడగు భరద్వాజుఁడు గురువు చెప్పిన లోకోత్తరమైన వాక్యమును విని యాశ్లోకమును సంతసముతో నోటికి వచ్చునట్లు వల్లించెను. వాల్మీకియు మహాసంతుష్టుఁడై తమసానదియందు యథావిధిగ స్నానముచేసి మాధ్యాహ్నిక మొనర్చి తాను జెప్పిన శ్లోకార్థమునే చింతింపుచు నాశ్రమమునకుఁ దిరిగివచ్చెను. అంత వినయశీలుఁడును, శాస్త్రజ్ఞుఁడునునగు శిష్యుఁడైన భరద్వాజుఁడు జలకలశమును దీసికొని యాయనను వెంబడించెను. ధర్మముల నెఱిఁగినట్టి వాల్మీకిమునీంద్రుఁడు శిష్యునితోఁ గూడ నాశ్రమమునకు వచ్చి సుఖాసనాసీనుఁడై

ఆకస్మికముగాఁ దననోట వెలువడిన శ్లోకార్థమును గుఱించి ధ్యానించుచుఁ బురాణపారాయణాది కృత్యములను నిర్వర్తించెను.

బ్రహ్మ వాల్మీకిమహర్షిని రామాయణముచేయఁ బురికొల్పుట

అంత స్వాయంభువుఁడును, లోకకర్తయు, మహాతేజస్వియు,చతుర్ముఖుఁడునగు బ్రహ్మదేవుఁడావాల్మీకి మహామునిని జూడరాఁగా, వాల్మీకి మహాముని యద్దేవుని జూచి మిగులనాశ్చర్యముతో దిగ్గనలేచి, చేతులు జోడించుకొని ఉచితాసనంబుపయిఁ గూర్చుండఁబెట్టి, సాష్టాంగంబుగఁ బ్రణమిల్లి సేమం బడిగి, యర్ఘ్యపాద్యాదులచే శాస్త్రోక్తముగాఁ బూజించి, స్తోత్రము లొనరించి, పరిశుద్ధుఁడై, మౌనముతో నిలఁబడఁగా, బ్రహ్మదేవుఁ డాసనంబునఁ గూర్చుండి, వాల్మీకిమహాముని నాసనంబునఁ గూర్చుండ నియోగించెను. అట్లు సాక్షాల్లోకపితామహుఁడైన బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షముగా నెదుటఁగూర్చుండియున్నను, వాల్మీకి యాక్రౌంచపక్షిని జంపినవిషయమునే తలపోయుచున్న మనసుతో "ఆపాపాత్ముఁడు వైరబుద్ధితో నెంత క్రూరకర్మము నొనరించెను? ఇంపుగాఁగూయు నా క్రౌంచపక్షిని నిష్కారణముగాఁ జంపఁగల్గెఁగదా!" యని తదేకధ్యానములో మునిఁగి, వియోగము నొందియున్న యాఁడుపక్షిని గుఱించి మఱిమఱి శోకించుచు, తననోట వెలువడిన శ్లోకమును మాటిమాటికి హృదయమున స్మరించుచు శోకపరాయణుఁడై యుండెను.

అప్పుడు బ్రహ్మదేవుఁడు మునిశ్రేష్ఠుఁడగు వాల్మీకిని జూచినవ్వుచు, "ఓవాల్మీకీ, నీనోటినుండి వచ్చినది శ్లోకమే కాని మఱొక్కటికాదు. ఈ విషయమున నీకుఁ జింత వలదు. ఓబ్రహ్మస్వరూపుఁడా, నాయనుగ్రహంబునం జేసియే యీవాక్కు నీకు వచ్చినది. ఓఋషిశ్రేష్ఠుఁడా, రాముని చరితము నంతయు నీవు శ్లోకరూపంబున రచియింపుము. లోకమునందు ధర్మాత్ముఁడును, గుణవంతుడును నయి విలసిల్లెడు రామునిచరితమును నారదునివలన వినినతెఱంగున రచింపుము. బుద్ధిశాలియగు రాముని యొక్కయు, లక్ష్మణునియొక్కయు, సీతయొక్కయు, రక్కసులందఱియొక్కయు రహస్యముగాఁగాని, ప్రకాశముగాఁగాని నడచిన చరిత్రమెల్ల నిప్పుడు నీకుఁ దెలియకున్నను నీకవిూఁద స్పష్టముగాఁ దెలియఁగలదు. నీ వీకావ్యమునందుఁ జెప్పునది యొక్కటిగూడ నసత్యము గానే

రదు. నీవు మనోహరమును పుణ్యప్రదమును నైన యీ రామకథను శ్లోకరూపమున రచియింపుము. నీచే రచితమైన రామాయణకథ పర్వతములు, నదులు భూలోకమున నుండునంత దనుక శాశ్వతంబై మూఁడు లోకంబులందుఁ బ్రసిద్ధి కెక్కియుండును. నీవు రచించిన రామాయణకథ వ్యాపించియుండునంతవఱకును నీవు నాచే సృష్టింపఁబడినవయి పైనను క్రిందను నుండు లోకంబులలో స్వేచ్ఛమై సంచరించుచుండు" మని చెప్పి యచ్చటన యంతర్ధానంబు నొందెను.

వాల్మీకియు, నతనిశిష్యుఁడగు భరద్వాజుఁడును మిక్కిలి యచ్చెరువు నొందిరి. ఆ వెనుక వాల్మీకిమునిశిష్యు లందఱు మాటిమాటికి సంతోషాశ్చర్యములతోఁ గూడి యాశ్లోకమునే పాడిరి. ఇట్లు పలుమాఱు శిష్యులందఱచేతను సమానమైన యక్షరసంఖ్యగల నాలుగు పాదములతోఁగూడిన యాశ్లోకము మాటిమాటికిఁ బాడఁబడుటవలన "కీర్తింపఁబడునది" యని యర్థమునిచ్చు సార్థకమయిన శ్లోకమయ్యెను. అంత వాల్మీకిమునివర్యుండు పరమాత్మను మనంబున ధ్యానించినవాఁడై యిట్టి శ్లోకములచేతనే రామాయణమునంతయు రచియింపఁదలచి, లక్షణయుక్తములైన వృత్తములును, పదములును, అర్థములును గలవియు శ్రావ్యంబులును, సమానాక్షర సంఖ్యగల పాదములుగలవియునైన యనేకశ్లోకములచేఁ గీర్తిమంతుఁడయిన రామునిచరిత్రమును రచియించెను. సమాసములు, సంధులు, యౌగికపదములు గలవియు, రసపుష్టితోఁగూడిన యర్థవంతములగు వాక్యములతోఁగూడినవియునైన శ్లోకములచేఁ దనచేత రచియింపఁబడిన సీతారాముల చరిత్రము, రావణాసురునివధంబునుగూడిన రామాయణమును మీరు విందురుగాక!

## ౩-వ సర్గము.

### వాల్మీకి రామాయణమును రచియించుట

ధర్మాత్ముండైన వాల్మీకి నారదుండు చెప్పిన నీతియుక్తంబయిన రామునిచరితంబు నంతయు విని, యతండు చెప్పక విడిచినకథనంతయుఁ దెలియఁగోరి లెస్సగా నాచమనంబు సేసి, అంజలిబద్ధుఁడయి తూర్పుకొనలుగాఁ బఱచిన దర్భపయిఁ గూరుచుండి నియమముతో రామునిచరిత్రరీతినంతయు నాలోచింప, నప్పు డావాల్మీకిముని యోగదృష్టి వడసి,

బ్రహ్మానుగ్రహంబునంజేసి దశరథమహారాజు అతని పత్నులు కౌసల్యాదులు, రామలక్ష్మణులు, సీతాదేవి తక్కిన పురజను లయోధ్యయందేమి పొందినదియు, నవ్వినదియు, మాటలాడినదియు, నడచినదియు, చేసినదియు, ప్రతినతప్పనివాఁ డయిన రాముఁ డడవియందు సీతతోను, లక్ష్మణునితోను గూడి తిరుగునప్పుడేమేమి తటస్థించినదియు, మఱియు రాముఁడు మొదలగువారియం దేమేమి నడచెనో యదియెల్లను నఱచేతిలోని యుసిరికకాయనుబోలెఁ దేట తెల్లముగా నెఱింగెను. విశేషమైన బ్రహ్మతేజంబుగల వాల్మీకి బ్రహ్మదేవుని యనుగ్రహంబునంజేసి,యా చరిత్రమునంతయు నున్నది యున్నట్లుగా నెఱింగి, ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములచే విస్తరించి, రత్నములచే నిండిన సముద్రమును బోలినదై, యందఱ చెవులకింపు గులుకుచు సకలగుణములచే నొప్పియున్న రఘువంశప్రదీపుఁడైన రామునిచరిత్రమును తొల్లి నారదమునీంద్రుండు చెప్పినచొప్పున శ్లోకరూపంబున రచించెను.

శ్రీరామాయణకథాక్రమము:—బాలకాండమున రామునియొక్క జననము, పరాక్రమము, సర్వానుకూలత్వము, ఓర్పు, లోకప్రియత్వము, సొంపు, సత్యనిరతి, విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులఁ దోడ్కొనిపోవుచు ననేకచిత్రకథలఁ జెప్పుట, శివునివిల్లు విఱుచుట, సీతావివాహము, పరశురాముల వివాదము. అయోధ్యాకాండమున - రామునిగుణముల వర్ణనము, రాముని పట్టాభిషేకప్రయత్నము, కైకేయిచెడుతలంపు, పట్టాభిషేకమునకు విఘాతంబు, రాము నడవికిఁబంపుట, దశరథుఁడు పుత్రశోకముతోఁ గృశించి స్వర్గలోకమున కేఁగుట, పురజనులు వ్యసనపడుట, వారు రాముని వెంబడించిపోఁగా నతఁడు జనులను నివారించి బోయలతేఁడగు గుహునిదగ్గఱఁ జేరి సారథిని మఱలించుట, గంగానదిని దాఁటుట, భరద్వాజుని జూచుట. భరద్వాజమహాముని ప్రేరణచేఁ జిత్రకూటమునఁ జేరుట, అచ్చటఁ బర్ణశాల నిర్మించి యందు రాముఁ డుండఁగా భరతుఁ డేతెంచుట, రాము నయోధ్యకు రమ్మని బ్రతిమాలుట, తండ్రి కుత్తరక్రియలు చేయుట, భరతుం డయోధ్యకు మఱలివచ్చుట, పాదుకలకుఁ బట్టాభిషేకంబు చేయుట, నందిగ్రామమున భరతుం డుండుట, రాముఁడు చిత్రకూటమునుండి దండకారణ్యమున కేఁగుట;

ఆరణ్యకాండమున - విరాధవధము, శరభంగసుతీక్ష్ణులదర్శనము, అనసూయ సీతాదేవికి నంగరాగములిచ్చుట, అగస్త్యదర్శనము, జటాయువుతోఁ గూడుట, పంచవటికిఁ బోవుట, శూర్పణఖను జూచుట, శూర్పణఖతోడి వివాదము, దాని విరూపిణిగాఁ జేయుట, ఖరత్రిశిరసులవధంబు, రావణుఁడు లంకనుండి వచ్చుట, మారీచవధము, రావణుండు సీత నెత్తికొనిపోవుట, రాముఁడు సీతను గానక విలపించుట, రావణుఁడు జటాయువును బరిమార్చుట, కబంధదర్శనము కిష్కింధాకాండమున - పంపానది శబరీదర్శనము, హనుమంతునిదర్శనము, ఋశ్యమూకమునకేఁగుట, సుగ్రీవునితోఁగలియుట, వారిచెలిమి నమ్మికపుట్టించుట, వాలిసుగ్రీవుల కలహకారణము, వాలిం జంపుట, సుగ్రీవపట్టాభిషేకము, వాలివధంబునకై తార విలపించుట, రామసుగ్రీవుల సంకేతము, వర్షర్తువు గడపుట, రాముఁడు సుగ్రీవునిపైఁ గోపపడుట, సైన్యములఁ జేర్చుట, సీతను వెదకుటకై వానరులను దిక్కుదిక్కునకుఁ బంపుట, భూమిరెయొక్క (దేశములయొక్క) స్థితిని దెలుపుట, హనుమంతునిచేతికి నుంగర మిచ్చుట, ఋక్షబిలముఁ జూచుట, వానరుల ప్రాయోపవేశము, సంపాతినిఁ జూచుట, మహేంద్రపర్వతము నెక్కుట. సుందరకాండమున—హనుమంతుఁడు సముద్రమును దాఁటుట, దాఁటునప్పుడు సముద్రునిమాటవలనఁ బైకి వచ్చిన మైనాకముపై విడియుట, సింహికావధము, లంకామలయపర్వతదర్శనము, రాత్రియందు లంకలోఁ బ్రవేశించుట, హనుమంతుఁ డొంటరిగాఁ జింతించుట, హనుమంతుఁడు రావణునిఁ జూచుట, పుష్పకవిమానంబుఁ జూచుట, మద్యపానంబు చేయుచోటికి బోవుట, యంతిపురముఁజొచ్చుట, యశోకవనంబు వెదకఁ బోవుట, సీతాదర్శనము, ఉంగరము నొసంగుట, రావణునిఁ జూచుట, సీతను రాక్షసాంగనలు బెదరించుట, త్రిజట కలగనుట, సీతవలనఁ జూడామణిం గైకొనుట, అశోకవనంబు పాడుచేయుట, రాక్షసస్త్రీలు వెఱచి పరుగెత్తుట, రావణకింకరులఁ జంపుట, హనుమంతుఁడు పడుట, లంకాదహనము, రాక్షసులు మొఱలిడుట, హనుమంతుఁడు మఱల సముద్రమును దాఁటుట, వానరులందఱు సుగ్రీవునిమధువనంబుఁ జొచ్చి మద్యముఁ గ్రోలుట, రాము నోదార్చుట, శిరోరత్నము నొసంగుట,

యుద్ధకాండమున—రాముఁడు వానరవీరులతో సముద్రముకడ కేఁగుట, నలుఁడను కపీశుండు సేతువు గట్టుట, సముద్రము దాఁటుట, రాత్రి యందు లంకను ముట్టడించుట, విభీషణునితోఁ గలియుట, రావణవధో పాయంబు విభీషణుండు దెల్పుట, కుంభకర్ణేంద్రజిత్తులవధము, రావణ వధము, శత్రుపురంబున సీతను మఱలఁ బొందుట, విభీషణపట్టాభిషేకము, పుష్పకవిమానముఁ జూచుట, యయోధ్యాపురి కేతెంచుట, భరతునిఁ జూచుట, రామునిపట్టాభిషేకమహోత్సవము, వానరవీరుల నెల్ల వారి వారినునికిపట్టులకుఁ బంపుట. ఉత్తరకాండమున నామీఁదట నడువఁ బోవు రాముని చరిత్రములోని వృత్తాంతములు అనునవి.

## 4-వ స ర్గ ము

### కుశలవులు రామాయణము గానముచేయుట

మహాత్ముఁడును, బుద్ధిశాలియు, స్వతంత్రుఁడును, గొప్పపండి తుఁడునైన వాల్మీకిమహాముని రాముఁడు రాజ్యపరిపాలనము సేయుఁ చుండఁగా రామాయణమును వింతలైన పదములతోఁ గూర్చి యిరు వదినాలుగువేల శ్లోకములును నేనూఱుసర్గములును గల యాఱుకాండ ములను, జరుగఁబోవు సంగతులను దెలుపు నుత్తరకాండమును రచి యించి, "యెవ్వఁడీ రామాయణమును బఠించి లోకమునఁ బ్రచారము నకుఁదేఁగలఁ"డని యాలోచించుచుండఁగా సకలనీతుల నెఱింగిన వారును, వాసి కెక్కినవారును, దివ్యశరీరము గలవారును, శుభలక్ష ణములతోఁ గూడినవారును స్వరజ్ఞానము గలవారును, గంధర్వుల మాడ్కి రూపవంతులును, శ్రావ్యమయిన కంఠముతో మాటలాడు వారును, బింబమునుండి యెత్తఁబడిన ప్రతిబింబములో యనునట్లు రాముని దేహమునుండి యెత్తిన రెండు రామావతారములో యనఁదగువారును, సోదరులును, రాజపుత్రులునునగు కుశలవు లేతెంచి, వాల్మీకికి నమస్కరింపఁగా, నపుడు వాల్మీకిమహాముని "యీరాజపుత్రులు మిక్కిలి సూక్ష్మబుద్ధిగలవారు; వేదములఁ జదివినవారు; వీరిమూలమున నా రచించిన రామాయణము ప్రఖ్యాతిఁజెందఁగల"దనితలఁచి వేదార్థము లను వెల్లడిచేయు నుద్దేశముతో నా కుశలవులకు రామునిచరిత్రము,

సీతాదేవిచరిత్రము, రావణవధము ననువీనిని ముఖ్యముగాఁ దెల్పు రామాయణ మంతయుఁ జెప్పి, వారిచేఁ బాడించెను.

పిమ్మట సకలశుభలక్షణములతోఁ గూడినవారును, గానవిద్య యందుఁ బండితులునునైన కుశలవులు తమకు వాల్మీకి యుపదేశించిన రామాయణంబు నోటికి వచ్చునట్లు వల్లించి, తపోవనంబులందుండు ఋషులు, వానప్రస్థులు, సాధువు లొక్కచోటఁ గూడి పరమాత్మవిచారముఁ జేయుసభాస్థలములయందు వారిదాపులందు నిలిచి, చదువుటకును, బాడుటకు నింపయినదియు, శృంగార, వీర, కరుణ, హాస్య, భయానక, రౌద్రాదులగు తొమ్మిదిరసములతోఁ గూడినదియునైన శ్రీమద్రామాయణమును ద్రుత, విలంబిత, మధ్యములనెడి తాళములతోఁ గూడునట్లును, స రి గ మ ప ధ ని స లనుసప్తస్వరములతోఁ బొసఁగునట్లును, తంబురు, వీణె మొదలగు వాద్యములకు ముక్తాయింపు గలుగునట్లును వాల్మీకి యుపదేశించినతీరునఁ బలుమఱుఁ బాడుచుండఁగా, ముని లందఱు విని, కన్నులనీరు జలజలరాల్చి, సంతోషభరితులై "యాహా! యీపాటల సొంపేమి! విశేషముగా శ్లోకముల యింపు చెప్పఁదరముగాదు. ఈచరిత్ర చిరకాలమునకుముందు నడచినను బ్రత్యక్షముగనడచుచున్నట్లు చూపఁ బడినది." యని కుశలవులను, వారిగానమహిమను బొగడుచు, "వాల్మీకి మునిప్రణీతమైన యీ రామాయణమహాకావ్యము వినవిన వింతఁ గొల్పుచుఁ దరువాతికవులకు దారిచూపునదిగాను, వరుసతప్పక ముగిసినదిగాను యున్నది. ఇట్టి రామాయణంబును గానవిద్యానిపుణులగు కుశలవులు పాడుట పసిఁడికిఁ దావియబ్బినట్లున్నది" యని యాంవాల్మీకిని, వాల్మీకిముని రచించిన రామాయణమును గొనియాడిరి. తమసంతోషమునకు సూచనముగా వారికి నొక్కముని కలశంబును, మఱొక్కఁడు నారబట్టలను నొసంగిరి.

ఇట్లు గానవిద్యావిశారదులగు కుశలవులు సకలజనులపొగడ్తలకుం బాత్రులై, విస్మయకరమును, కవులకెల్ల మార్గదర్శకమును, ఆయుస్సు, పుష్టి, ఆనందము నొసంగునదియునైన యీరామాయణమును నయోధ్యాపురమునందలి వీథులందును, రచ్చచావిళ్ళయందును గొంతెత్తి సర్వజనశ్రావ్యముగాఁ బాడుచుండఁగా విని, శత్రుసంహారియగు

రాముఁడా యన్నదమ్ములైనకుశలవులను దనయశ్వమేధశాలకు రప్పించి, యాసనములఁ గూర్చుండఁ బనిచి మర్యాదకుఁ దగినవార లగుటచే వారికిఁ దగుమర్యాదలు సల్పి, దాను వారికిఁ జేరువను దమ్ములతోడను, మంత్రి పురోహితాదులతోడను గూర్చుండి, లక్ష్మణభరతశత్రుఘ్నులం జూచి, ఋషివేషములఁ దాల్చియున్న, రాజచిహ్నములతోఁ గూడిన దివ్యతేజస్సుగలవారును, గొప్పతాపసులునగు నీ బాలురు మిక్కిలి యింపయిన శారీరముతో రాగతాళములకు జతపడునట్లును స్పష్టమైన యర్థము గలుగునట్లును, జనులందఱ చెవుల కింపుగను బాడినరామాయణము జనులందఱ సకలాంగములకును, మనస్సులకును, మనస్సుల కధిష్ఠానములైన హృదయములకును గగుర్పాటొదవుచున్నది. ఈ పుణ్య చరితంబు వినిన నాకును మీకును మేలయ్యెడు. సావధానంబుగ నాల కింపుఁ డనిచెప్పి యాకుశలవులను బాడుటకుఁ బ్రేరేపింపఁగా, వారును రాముని వాక్యములచే గానభేదమగు మార్గవిధానముతోఁ బాడుచుండ రాముఁడును కడునాసక్తితో నాలకించుచుండెను.

## ౕ-వ సర్గము

## అయోధ్యాపురవర్ణనము

ఈసమస్తమైన భూమండలము పూర్వమున వైవస్వతమనువు మొదలుకొని జయశాలులగు నేరాజులయధీనములోనుండి యితరుల కలభ్యముగా నుండెనో, యేవంశీయులైనరాజులలో సగరుఁ డను రాజొండి తనపేర సాగరమును ద్రవ్వించి, దండయాత్రాదులయం దఱు వది వేలమందిపుత్రులతోఁ బరివేష్టితుఁడై వెడలుచుండెను. అట్టిమహాత్ము లగు నిక్ష్వాకువంశపురాజులయొక్క వంశమునందు రామాయణ మను పూజ్యమయిన సుప్రసిద్ధకథాప్రబంధ ముత్పన్న మాయెను. అట్టి యీ చరిత్రము నేను మొదటినుండి రచియింపఁబోవుచున్నాను. ధర్మార్థకామ మోక్షములనెడి చతుర్విధపురుషార్థముల నొసంగునట్టి యీ రామాయణము నసూయ మాని మీరందఱు వినవలయును అని వాల్మీకి చెప్పి గ్రంథము నారంభించెను.

సరయూనదీతీరంబునఁ గోసలమను దేశం బొకండు గలదు. ఆ దేశము ధనధాన్యసమృద్ధిగలదై, విశాలమయియుండు. ఆదేశంబున

నుండు జనులెల్లప్పుడు సంతోషభరితులై యుందురు. ఆదేశమున నయోధ్యయను నగరము లోకప్రసిద్ధమైయుండెను. దానిని వైవస్వత మనువు స్వయముగ నిర్మించెను. అయ్యది పండ్రెండామడల నిడివియు మూఁడామడల వెడల్పును గలిగి, చక్కఁగాఁదీర్చిన గొప్పవీథులుగలదై, యెక్కువకాంతితో వెలయుచు, మఱియు నంతట నిరంతరము జల్లఁబడిన పువ్వులతోఁగూడినదై, దుమ్ము రేఁగకుండునట్లు నీటిచేఁ దడుపఁబడిన యొక చక్కని రాజవీథిచే నొప్పుచునుండు. ఆపట్టణోత్తమము గొప్ప వెలుపటి తలుపులు దారుబంధములు గలదియు, వరుసగా నేర్పఱుపఁబడిన లోపలి యంగళ్ళవరుసలుగలదియు, ననేకయంత్రములతోను నాయుధములతోను గూడినదియు, అన్ని చేతిపనులు చేయుశిల్పులతోఁ గూడినదియు, సూత మాగధులచే నిండినదియు, సకలసంపదలతో నొప్పునదియు, సాటిలేని కాంతిగలదియు, నెత్తైనకోటబురుజులు టెక్కెములును గలదియు, ఒక్క పెట్టున నేనూర్వురం జంపఁగల యినుపగుదియలతో నిండినదియు, నంతటను స్త్రీలయు నటులయు గుంపులతోఁ గూడినదియు, నుద్యానములతోడను మామిడితోటలతోడను నిండినదియుఁ, బ్రాకారమను మొలనూలు గల దియు, విశాలమైనదియు, దాఁటనలవిగాని యంత లోతైనయగడ్తతోఁ గూడినదియుఁ, బ్రవేశింప నలవికానిదియు, నితరులచే నాక్రమింపరాని దియు, ఏనుఁగులు, గుఱ్ఱములు, గోవులు, ఒంటెలు, గాడిదెలు దండిగాఁగల దియుఁ, గప్పముగట్టుచుండు చుట్టుపట్ల రాజులచేఁ జుట్టఁబడినదియు, సకల దేశంబులనుండివచ్చియున్న వర్తకులచే నొప్పారుచున్నదియు, రత్న మయములైనమేడలతోను, పర్వతములతోడను, మేడలమీఁది మేడల తోను విరాజిల్లుచు నింద్రునియమరావతీనగరిని బోలినదియుఁ, జిత్రా కారముగలదియు, బంగారువన్నె గలదియు, సుందరాంగులగు స్త్రీగణంబు లతోఁ గూడినదియు, నంతటను నవరత్నములతో విరాజిల్లునదియు, గొప్ప రాజభవనములతోఁ గూడినదియుఁ, జదరపునేలగట్టఁబడినదియు, నిండ్లచేఁ గ్రిక్కిరిసినదియు, సన్నవరిధాన్యములతో నిండినదియుఁ, జెఱకుపాల వంటి తియ్యని నీరుగలదియు, భేరీమృదంగవీణాపటహాము లనెడి వాద్య ములు ఎల్లప్పుడు మ్రోగుచుండునదియుఁ, బత్తనములలో నెల్ల మేలయి నదియు, తపోబలంబువలన సంపాదింపఁబడిన స్వర్గమందలిసిద్ధుల

విమానమో యనున ట్లుండునదియు, జక్కఁగా నేర్పఱుపఁబడిన గృహ ములప్రదేశములు గలదియు, ఉత్తములయిన పురుషులతో నిండినదియు, నొంటరి మనుష్యుని, ముందు వెనుక లేనివానిని, జప్పుడుచేఁ జంపఁదగిన వానిని, బరుగెత్తినవానిని బాణములతోఁ గొట్టనివారును, చులకనైన చేవడిగలవారును, వనంబులందు గర్జించుచుండు మదించిన సింహవ్యాఘ్రవరాహములను, గఱకుటమ్ములతోను, బలిమిగల హస్తములతోను మోదువారునైన మహారథులగు యుద్ధవీరు లనేకులతో నిండినదియు, అనేకయాగములఁ జేసినవారును, సుగుణములతో నిండినవారును, వేదములను, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము నను నాఱు వేదాంగములను జదివినవారును, వేలువేలుగ నిచ్చువారును, సత్యమునందు శ్రద్ధగలవారును, మహర్షులతో సమానులు నైన బ్రాహ్మణశ్రేష్ఠులచేతను, ఋషిమాత్రులచేతను నిండిన యా యయోధ్యాపట్టణమున దశరథమహారాజు స్వర్గమున నింద్రునివలె వాసముచేయుచుండెను.

## 6-వ సర్గము

### రా జ్య వ ర్ణ న ము

నాలుగు వేదముల నెఱింగినవాఁడును, వైద్యులు, పండితులు, జ్యోతిష్కులు మొదలగువారిని దగ్గఱఁజేర్చుకొనువాఁడును, వీఁడఁ జేయఁబోవు పనినిగూర్చి ముందుగ దీర్ఘాలోచన చేయువాఁడును, నెక్కువ ప్రతాపముగలవాఁడును, బత్తనములందును బల్లెలందును నుండుజనులయెడఁ బ్రీతిగలవాఁడును, నిక్ష్వాకువంశపు రాజులలో నెల్ల నతిరథుఁడును, యాగము లొనర్చువాఁడును, మహర్షితో సాటియైనవాఁడును, రాజర్షియు, మూఁడులోకంబులందును వన్నెకెక్కిన వాఁడును, విశేషబలము గలవాఁడును, శత్రువులను నాశముచేసిన వాఁడును, ఇంద్రియములను జయించినవాఁడును, మిత్రులుగల వాఁడును, ధనము, ధాన్యము మొదలగు సకలైశ్వర్యములం దింద్ర కుబేరులతో సమానుఁడును, పరాక్రమశాలియు, సత్యసంధుఁడును, ధర్మార్థకామముల నాయా సమయములందు నడుపువాఁడును, మను చక్రవర్తివలె న్యాయముతో జనులను బాలించువాఁడును నైన దశ

రథుం డట్టి యయోధ్యాపురంబు దేవేంద్రుఁ డమరావతింబోలెఁ బాలించుచుండెను.

ఆనగరంబునందలి జనులు సంతసముగలవారును, బుణ్యస్వభావముతోఁ గూడినవారును, ననేకశాస్త్రములఁ జదివినవారును, తమకున్న వానితోఁ దనివినొందినవారును, ఇతరుల వస్తువులను గొంచెముకూడ నాసింపనివారును, సత్యము దప్పనివారునునై యుండిరి. ఆపట్టణంబునందు దరిద్రుఁడును, కోరినకోర్కు లొందనివాఁడును, గోవులు గుఱ్ఱములు ధనములులేక గొప్ప కుటుంబముగలవాఁ డొక్కఁడైనను లేఁడు. సర్వదా స్త్రీలోలుఁడును, పిసినిగొట్టును, క్రూరుండును, జదువురానివాఁడును, ఈశ్వరుఁడు లేఁడని వాదించువాఁడును నా యయోధ్యాపత్తనమునందుఁ జూచుటకైన దొరకఁడు. అచ్చట నాఁడువాండ్రును మగవారును బుణ్యకార్యము లాచరించు స్వభావముగలవారై, యింద్రియముల జయించి మంచి యాచారములతోను, మంచి నడతలతోను గూడినవారలగుచు నిర్మలహృదయులయియుండిరి. అచ్చటిజనులలోఁ గుండలములు, కిరీటము, చేతికడియములు, పతకము, కంకణము మొదలగు భూషణములు దాల్పనివారు లేరు. అచ్చటిజనులు శుభ్రముగా స్నానముచేసి, పరిశుద్ధులై పూలదండలఁ దాల్చి, సువాసనగల గంధమును మేని కలఁది సౌఖ్యమునకుఁ గొఱఁతలేక యుందురు.

అప్పురంబునఁ గడుపునిండఁ దిననివాఁడును, యాచకుఁ డడిగిన లేదనిచెప్పువాఁడును, సోమరియు మందునకైనను గానరాఁడు. అచ్చట ధార్యాగ్ని లేనివాఁడును, యాగము చేయనివాఁడును లేఁడు. నీచుఁడును, దొంగయుఁ గంటికగపడరు. జాతిభ్రష్టుఁ డాపత్తనంబున దొరకఁడు. బ్రాహ్మణు లందఱు దమకర్మలందు శ్రద్ధగలవారై, యింద్రియముల గెల్చి, వేదములఁ బఠనముచేయుచు, శక్తికొలఁదిని దానము చేయుచుఁ బ్రతిగ్రహము మానియుందురు. దేవుఁడే లేఁడని వాదించు నాస్తికుఁడును, నసత్యము పలుకువాఁడును, విశేషశాస్త్రములఁ జదువనివాఁడును, ఒరులకలిమి కోర్వనివాఁడును, బలములేనివాఁడును, పండితుఁడు గానివాఁడును నాపత్తనంబున లేఁడు. అచ్చట శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము ననెడి యాఱు

వేదాంగములను జదువనివాఁడును, కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతము జేయనివాఁడును, యాచకులకు వేలకొలఁది నియ్యనివాఁడును, దీనుఁడును కలఁతఁజెందిన మనంబుగలవాఁడును, రోగియును లేఁడు. మఱియు నందలి స్త్రీలును, బురుషులును రూపసౌందర్యములుగలిగి, రాజభక్తిగల వారై యుండిరి. మొదటి నాలుగువర్ణములవారును దేవతలను, నతిథులను బూజించుచు, నుపకారము మఱువనివారలై, శక్తికొలఁది వారును దానము చేయుచు, మిక్కిలి పరాక్రమముగల శూరులునునయి, చిరకాలము జీవించువారై, ధర్మమును, సత్యమును నాశ్రయించి, యెల్లప్పుడు భార్యలు, కొడుకులు, కూఁతుండ్రు, మనుమలు మొదలగు వారితోఁ గూడి సుఖించుచుండిరి.

మఱియు నచ్చట క్షత్రియులు బ్రాహ్మణులను, వైశ్యులు క్షత్రియులను అనుసరించి వర్తించుచుండిరి. శూద్రులు పై మూఁడు వర్ణములవారిని నుపచరించుచు స్వధర్మనిరతులై యుండిరి. అట్టి యయోధ్యాపత్తనమును దశరథుఁడు తొల్లి ధీమంతుఁడైన మనుచక్రవర్తి పాలించిన తెఱఁగునఁ జక్కఁగఁ బాలించుచుండెను. అట్టి యయోధ్యయందు విలువిద్యనేర్చి, శౌర్యమునం దగ్నిహోత్రమును బోలి, కపటములేక, శత్రులపైఁ బగ చూపువారలై సింగములంబోలిన యుద్ధభటు లుండిరి. కాంభోజ, బాహ్లిక, వనాయుజ, సింధుదేశములం బుట్టినవియు, నుచ్చైశ్శ్రవమువలె నుత్తమములైన గుఱ్ఱము లపరిమితముగా నుండినవి. మఱియు వింధ్యపర్వతమునందుఁ బుట్టిన మదించిన యేనుఁగులతోను, హిమవత్పర్వతంబునఁ బుట్టినవియు, బలముగలవియు, మదించినవియుఁ బర్వతమువలె నెత్తయినవియు నైన యేనుఁగులతోను, ఐరావతము, మహాపద్మము, కుముదము, వామనమునను గజముల కులములందు జన్మించిన మదించిన యేనుఁగులతోను, భద్రజాతియందుఁ బుట్టిన యేనుఁగులతోను, మంద్రజాతియం దుత్పన్నములైన యేనుఁగులతోను, మృగజాతిసంభూతములగు నేనుఁగులతోను, భద్రమంద్ర మృగములను మూఁడు జాతులు గలిసిన జాతులం దుత్పన్నములైన గజములతోను, భద్రమంద్రలక్షణములు గలిసిన యేనుఁగులతోను, భద్రమృగలక్షణములు మృగమంద్రలక్షణములు గలిసిన జాతులందుఁ

బుట్టిన సంతతమత్తములై, పర్వతములంబోలిన యేనుఁగులతోను నిండి యుండెను. ఆపత్తనమును దశరథుఁడు పాలించుటంజేసి యది చుట్టుపట్టుల రెండుయోజనములదూరము శత్రువుల కలవిగాక "అయోధ్య" యనుసార్థకనామము గలదై వెలుఁగుచుండెను. అట్టి యథార్థనామము గలదియు, గట్టిదైన గవనివాఁకిటిగడియ ద్వారములతోఁ గూడినదియు, వింతలైన గృహములతోఁ శోభిల్లుచుండునదియు, వేలకొలఁది జనులతోఁ గ్రిక్కిరిసియుండునదియు నైన యా యయోధ్యాపత్తనమును దేవేంద్రునితో సాటియగు దశరథనృపాలుఁడు శత్రువుల నెల్లఁ బరిమార్చి చంద్రుఁడు నక్షత్రములంబోలెఁ బాలించుచుండెను.

## 7-వ సర్గము

### మంత్రుల వర్ణనము

దశరథమహారాజున కెనమండ్రు ప్రధానమంత్రు లుండిరి. వారాలోచనచేయు నంశములలో మిక్కిలి యోచనగలవారు. ఊహించి కార్యములను నడపువారు. మిక్కిలి యాచారసంపన్నులు. విశేషమైన ప్రభువిశ్వాసముగలవారు. ఎల్లప్పుడు రాచకార్యములందె దృష్టిగలవారు. వారు దృష్టి, జయంతుఁడు, విజయుఁడు, సిద్ధార్థుఁడు, అర్థసాధకుఁడు, అశోకుఁడు, మంత్రపాలుఁడు, సుమంత్రుఁడుననునామధేయములు గలవారు. వారు గాక వారి కులగురువగు వసిష్ఠమహామునియు, వామదేవమహామునియు నని మిక్కిలి ప్రేముడిగల యిరువురు పురోహితులు గలరు. ఆమంత్రు లందఱు విద్యలయందు మిక్కిలి పరిశ్రమచేసినవారు. బహుమర్యాదగలవారు. సామర్థ్యము గలవారు. విషయాశల నణఁచినవారు. సకలసంపదలతో నిండినవారు. సద్గుణంబులును సత్స్వభావము గలవారు. శాస్త్రము లన్నింటిని బాగుగ నెఱింగినవారు. అత్యంతబలశాలులు; మిక్కుటమైన యశముగలవారు. తాము చెప్పినమాటప్రకారము నడచుకొనువారు. పరాక్రమమునందును ఓర్పునందును పేరు వడసినవారు. చిఱునవ్వుమోముననె గదుర మాటలాడువారు. కామముచేఁగాని, కోపముచేఁగాని, లోభముచేఁగాని యెప్పుడును నసత్యంబు పలుకనివారు. తమరాజ్యమందుఁగాని యితరరాజ్యములందుగాని జరిగినదిగాని, జరుగుచున్నదికాని, జరుపఁగోరఁబడునదికాని వేగులవారలమూలమున

వా రెఱుఁగనిది లేదు. వారు రాజకీయవ్యవహారములను దీర్చుటయందు సమర్థులు. మొదట శోధించి తెలిసికొని, పిదపఁ బ్రాణములకు సాటివచ్చు మంత్రు లని యొప్పుకొనఁబడినవారు; తప్పులుచేసినవారు తమకుమారులైనను, వారిని బక్షపాతంబు లేక తగినట్లు దండించువారు. బొక్కసముఁ బెంపు నొందించుటయందును, సేనలను సేకరించుటయందును నెల్లప్పుడు తలంపుగలవారు. తమ శత్రువులనైనను దప్పిదము సేయనివారిని నొప్పింపరు. వీరులు; విడువని పూనికిగలవారు; రాజనీతిని జక్కఁగా నెఱిఁగినవారు; తమదేశములందుండు సాధుజనుల నెల్లప్పుడుఁ గాపాడువారు. వారు బ్రాహ్మణక్షత్రియులజోలికిఁ బోక, బొక్కసముఁ బెంచువారు, పురుషుని బలాబలములను బరీక్షించి, బలముగలవానికి గొప్పశిక్షయు, బలములేనివానికిఁ దక్కువదండనముఁ జేయువారు. సదాచార సంపన్నులై యొక్కటె బుద్ధిగలవా రగుచు నా మంత్రు లందఱు రాజ్యమందలి పనులను విచారింపుచుండఁగా, నయోధ్యాపట్టణంబు నందును, రాజ్యమం దెల్లయెడలను బొంకులాడు మనుష్యుఁ డొక్కఁ డైనను లేకుండెను. ఆరాజ్యమందుఁ జెడుపనులుసేయువాఁడును బరసతులఁ గామించువాఁడును నొక్కఁడును లేఁడు. కావునఁ బురశ్రేష్ఠమైన యయోధ్యయు, దేశమెల్లను నెమ్మదిగా నుండెను. మఱియు వారెల్లప్పుడు సొగసయినబట్టలను చక్కఁగా నలంకరించుకొనువారు; మంచి యాచారములు గలవారు, ఏమఱుపాటులేక యెల్లప్పుడు రాజునకు మేలగుపనులఁ జూచువారు; తల్లిదండ్రులు గురువులు మొదలగు పెద్దలయందుఁగల దోషములఁ బాటింపక గుణములనే కైకొనువారు; పరాక్రమమునందుఁ బ్రసిద్ధికెక్కినవారు; పరదేశములందుఁ బ్రసిద్ధులు; ఎప్పుడు నెవనితో సంధిచేయవలెనో, ఎప్పు డెవనితో యుద్ధము సేయవలెనో యది యెఱింగినవారు; మంచి స్వభావముతోను, కలిమితోను గూడినవారు; ఆలోచనను బయలుపఱుపకుండుటకును, సూక్ష్మవిషయములను దెలియుటకును నేర్పరులు; రాజనీతిప్రకారము దండనలందలి భేదముల నెఱింగినవారు; ప్రియముగ మాటాడువారు.

ఇట్టి సకలగుణగణములతో నొప్పారు మంత్రులతోఁ గూడి దశరథమహారాజు వేఁగులనెడికన్నులచే రాజ్యము నెల్లఁ జూచుచుఁ బ్రజ

లను న్యాయముతోఁ బాలించుచు, అధర్మములయిన కార్యముల విడుచుచు, మూఁడులోకములందు దాతయనియు, సత్యముఁ దప్పనివాఁడనియు వాసి కెక్కి, చెలికాండ్రతోఁ గూడి, చుట్టుపట్టుల రాజులందఱు లొంగి తన్నుం గొల్చుచుండఁ, దనప్రతాపము చేతనే క్షుద్ర రాజులఁ బాఱఁదోలుచుఁ, దన కెక్కువయైనవాఁడుగాని, సాటియైన వాఁడుగాని శత్రువును దలచూపనీయక దేవేంద్రుఁడు స్వర్గమునుబోలె నయోధ్యఁ బాలించుచు, మెఱసెడు కిరణములతో నుదయించిన సూర్యునివలె విరాజిల్లుచుండెను.

8-వ సర్గము

దశరథుఁ డశ్వమేధంబు సేయఁ దలంచుట

మహానుభావుఁడగు దశరథమహారాజట్టి పేర్మిగలవాఁడై సకల ధర్మముల నెఱింగి రాజ్యము పాలింపుచు సంతతిలేమికై వగచుచున్నను, సంతతిగలుగక పోవుటంజేసి, "యశ్వమేధయాగము చేసినఁ బుత్త్రులు గలుగుదురు. నేనేల యట్టి యశ్వమేధమును దేవతలఁ దృప్తిపఱుపకున్నాఁడ? ఇప్పుడైనను దానినిఁ జేయవలసిన"దని తలంచి, బుద్ధిశాలులగు మంత్రులందఱతో నాలోచించి మంత్రిశ్రేష్ఠుఁడయిన సుమంత్రునితోఁ బురోహితుని, శ్రేష్ఠులైన మాగురువుల నందఱను వెంటనే పిలుచుకొనిరమ్మని చెప్పెను.

దశరథమహారాజునోటినుండి మాట వచ్చియు రాకమునుపే, సుమంత్రుఁడు వేగముగఁ జని, సుయజ్ఞుని, జాబాలిని, వామదేవుని, కాశ్యపుని మొదలగువారిని, పురోహితుఁడయిన వసిష్ఠుని వేదవేదాంగములను బూర్తిగాఁ జదివిన తక్కిన బ్రాహ్మణశ్రేష్ఠుల నందఱను బిలుచుకొనివచ్చెను. ధర్మాత్ముఁడయిన దశరథమహారాజు వచ్చిన బ్రాహ్మణశ్రేష్ఠులను, మహామునులను జూచి, వినయముతో ధర్మార్థయుక్తముగా నిట్లనెను.

"ద్విజోత్తములారా, నేను సకలసంపదలుగల్గియున్నను సంతతికై వగచుచుండుటంజేసి, నాకు సౌఖ్యములేదు. నే నశ్వమేధయాగము చేయఁగోరియున్నాను. అటుకాకున్న నాకోరిక నెఱవేర్చునట్టి యాగంబుఁ దెల్పిన, దానిని శాస్త్రవిధిప్రకారముఁ జేసెదను. మీరాలోచించి నా

కానతీయవలయు" నని దశరథుఁడు ప్రార్థించిన, వసిష్ఠుఁడు మొదలగు బ్రాహ్మణోత్తము లందఱు నతని మాటను బాగున్న దని శ్లాఘించి, మిక్కిలి సంతస మొందినవారలై యతనితో నిట్లనిరి.

నృపాలా, పుత్రులనిమిత్తము నీ కిట్టి ధర్మబుద్ధి గలిగెనుగాన, నీవు తప్పక కొడుకులను, కోర్కెల నన్నింటిని బడయుదు వని చెప్పఁగా, దశరథుఁ డా బ్రాహ్మణులు సెప్పినమాటలు విని సంతసంపుఁ గన్నీటితోఁ గూడి, మంత్రులఁ జూచి, "మీరు మాగురువులు చెప్పినచొప్పున నన్ని సామగ్రులను సమకూర్చి, మొనగాండ్ర కాఁపుదలయందుంచి యుపాధ్యాయులు వెంబడింప నొకగుఱ్ఱమును విడువవలయు. సరయూనది యుత్తరపుగట్టున యజ్ఞశాల గట్టించి, సకలశాంతులు కల్పములందుఁ జెప్పినట్లు యథావిధిగా నడిపింపుఁడు. యాగములలోనెల్ల నుత్తమంబగు నీయజ్ఞంబునం దేమియుఁ గొఱఁత జరుగకున్నయెడల, రాజు లందఱు నీయశ్వమేధంబు చేయఁగలుగుదురు. ఇట మంత్రలోప క్రియాలోపాద్యపచారములు సంభవించినచో యాజకులైన బ్రాహ్మణులు, బ్రహ్మరాక్షసులు యజ్ఞధ్వంసమునకు వెదకుచుందురు. యజ్ఞము చెడిపోయినచో యజమానునికిఁ జేటు వాసఁగును. కావున నీయజ్ఞమునం దేమియు లోపంబు వాటిల్లకుండు తెఱఁగున నేర్పాట్లు చేయుఁడు. మీ రన్ని పనులను జరిపింపఁజాలుదు" రని చెప్పిన, మంత్రు లందఱు దశరథమహారాజువాక్యమునువిని, "మహారాజా, తమయాజ్ఞానుసారమే జరిపెద" మని మనవిచేసిరి.

ధర్మజ్ఞులైన మహాము లందఱు దశరథుని దీవించుచు రాజానుమతి వడసి తమతమయాశ్రమంబులకుఁ జనిరి. దశరథుఁడు నాబ్రాహ్మణులను బంపించి మంత్రులం బిలిచి "ఋత్విక్కులు చెప్పిన తెఱఁగున యాగోపకరంబుల నన్నిటిని దెప్పింపుఁ" డని యానతి యొసర్చి, దగ్గఱనున్న మంత్రుల నందఱను వారివారి యునికిపట్టులకుఁ బంపి, తన యంతిపురంబు సొచ్చి, ప్రియభార్యలం జూచి "యేను పుత్రోత్పత్తి నిమిత్తమై జన్నంబు సేయనున్నాను. మీరును నియమంబుఁ బూనుఁ" డని చెప్పఁగా, నాదశరథుని ప్రియకాంతలముఖములు మంచువోయిన తర్వాతఁ బూఁచిన కమలములువోలె వెలుఁగుచుండినవి.

## 9-వ సర్గము

### పుత్రకామేష్టియాగమునకు సంబంధించిన సుమంత్రుని వాక్యము

అశ్వమేధమును గూర్చి జరగిన ప్రస్తావమునెల్ల వినిన తర్వాత సుమంత్రుఁ డనుసారథి యేకతంబున దశరథునిఁ జూచి యిట్లనియె. ఓమహారాజా, వసిష్ఠాదిమహర్షులు చెప్పిన యీ చెప్పఁబోవు నితిహాస మును నేను వింటిని. తొల్లి భూతభవిష్యద్వర్తమానముల నెఱింగిన సనత్కుమారుఁడు ఋషులసమక్షమున నీపుత్రోత్పత్తినిగూర్చి యొకకథఁ జెప్పెనఁట. అ దెట్లనిన,

కాశ్యపమహామునికి విభండకుం డను మహాప్రసిద్ధుఁడయిన పుత్రుఁడు గలఁడు. ఆమహామునికి ఋశ్యశృంగుఁ డని వన్నె కెక్కిన యొక్కపుత్రుఁడు పుట్టఁగలఁడు. అతఁడు సదా వనముననే పెరుఁగుచు, వనంబునఁ దిరుగుచు నెల్లప్పుడు తండ్రిమాట ననుసరించుటంజేసి, యొరుల నెఱుఁగఁడు. ఆఋశ్యశృంగుఁడు లోకప్రసిద్ధమై, బ్రాహ్మణులచేఁ గొని యాడఁబడు *వ్రతిత్వము, ప్రాజాపత్యము నను రెండుతెఱఁగులగు బ్రహ్మచర్యము ననుష్ఠింపఁగలఁడు. ఆఋశ్యశృంగమహాముని గీర్తిమంతుఁ డయిన తండ్రికి శుశ్రూష యొనరించుచు, నగ్నిహోత్రంబు సల్పుచు, వ్రతిత్వ మనెడు బ్రహ్మచర్యముతోఁ గొంతకాలము గడుపఁగలఁడు. ఆకాలముననే యంగదేశమునందుఁ బ్రతాపశాలి, బలిష్ఠుఁడని ప్రసిద్ధి కెక్కిన రోమపాదుండను మహారాజు రాజ్యం బేలఁగలఁడు. అతని యన్యాయపరిపాలనంబుచే నతనిదేశమునందు జీవజంతువులనెల్ల దిగు లొందించు భయంకరమయిన యొకవఱపు సంభవింపఁగలదు. అప్పుడు రోమపాదుండు చింతతోఁగూడి, శాస్త్రజ్ఞులయిన పెద్దలగు బ్రాహ్మణులను బిలిపించి, “ఓద్విజోత్తములారా, మీరు ధర్మముల నెఱింగినవారలు. లోకవృత్తాంతముల నెఱుఁగజాలుదురు. కావున నీయనావృష్టిదోషంబు దొలఁగుటకు శాంతి నుపదేశింపుఁ” డని యడుగఁగలఁడు. అప్పుడు వేద

* బ్రహ్మచర్యము వ్రతిత్వము, ప్రాజాపత్యము నని రెండు విధములు. భిక్షా టనము, గురుశుశ్రూషచేయుచు వేదాధ్యయనము చేయువాఁడు వ్రతియనియు, వివాహముచేసికొని, పరభార్యలఁగోరక, శాస్త్రమునందుఁ జెప్పిన ఋతుకాలములందు మాత్రము భార్యను బొందువాఁడు ప్రాజాపత్యుఁ డనియుఁ జెప్పఁబడును.

ములఁ దుదముట్టఁ జదివిన విప్రులందఱు రాజున కిట్లని పలుకుదురు. "ఓమహారాజా, విభండకముని కొమారుఁడగు ఋశ్యశృంగుని నెట్లయిన నిచ్చటికి రప్పించి యాతనికి మర్యాదలు సల్పి మనఃపూర్తితో నీకూఁతు రగు శాంత నిచ్చి యథావిధిగాఁ బెండిలిసేయుము.

అట్లయిన నీవఱపు దొలఁగు" నని బ్రాహ్మణులు చెప్పిన, రోమపాదుండు వారిమాటల విని, యే యుపాయముచే నతనిని రప్పింపఁగల నని కొంతసేపు చింతించి, పిమ్మట ధైర్యముఁ బూని, మంత్రులతో నొక తీరున నిశ్చయించికొని, తనపురోహితుని, మంత్రులను గౌరవించి యా ఋశ్యశృంగమహామునిని దోడ్కొని ర మ్మని వారింబంపఁగలఁడు. అప్పుడు పురోహితుఁడు, మంత్రులు రాజు నానతి విని, దిగులొంది తలలు వాల్చి, ఋశ్యశృంగమహాముని శాప మిచ్చు నని వెఱచి, "మహారాజా, మేము పోఁజాల మని యారోమపాదుని బ్రతిమాలుకొని, యా ఋశ్యశృంగుని దోడ్కొని రాఁదగిన యుపాయంబులను మేము చెప్పెదము. దానిచే దోషంబు నివృత్తి యగు నని చెప్పుదురు. అప్పుడు రోమపాదుండు దానే వేశ్యలం బంపి యాతనిని రప్పింపఁగా, నామహాముని రాకవలన వర్షముఁగురియును. అప్పుడు రోమపాదుఁడు తనకూఁతుఁ రగు శాంతను ఋశ్యశృంగున కిచ్చి పెండ్లిచేయును. అప్పుడు రోమపాదునియల్లుండైన ఋశ్యశృంగమహాముని నీకుఁ బుత్రులఁగలిగించునని సనత్కుమారుండు ఋషులు వినుచుండఁగాఁ జెప్పె నని వసిష్ఠాదులగు మహామునులు చెప్పఁగా నేను వింటి" నని సుమంత్రుఁడు దశరథునితో జెప్పఁగా, దశరథుఁడు సంతసించి, "రోమపాదుండు ఋశ్యశృంగు నెట్లు దనరాజ్యమునకుఁ బిలిచికొనివచ్చెను? విస్తరించి చెప్పు"మని సుమంత్రు నడిగెను.

## 10-వ స ర్గ ము

### రోమపాదుండు ఋశ్యశృంగుని బిలిపించుట

దశరథుఁ డిట్లు ఋశ్యశృంగునిఁ బిలుచుకొనివచ్చిన తెఱఁ గెఱుఁగఁజెప్పుమని యడుగఁగా సుమంత్రుఁడు దశరథుం జూచి, "మహారాజా, మంత్రు లా ఋశ్యశృంగునిఁ దోడితెచ్చిన తెఱంగు వినిపించెద నాలకింపుము. ఆరోమపాదునిపురోహితుఁడు మంత్రులఁ దోడ్కొని

రోమపాదునికడ కేఁగి, మహారాజా నిరపాయమగు నొక యుపాయముఁ బన్నితిమి. అదేది యనఁగా ఋశ్యశృంగుఁ డడవులలోనే సంచరించుచుఁ దపస్సునందును, వేదాధ్యయనమునందును ఆసక్తిగలిగి, స్త్రీలను, నింద్రియ సుఖంబులను నెఱుఁగఁడు. కావునఁ బురుషమనస్సులను లోఁగఁజేయు నిష్టములైన గంధపుష్పాదులచేతను, సుందరాంగనలచేతను నతని మనంబు వంచించి యమ్మహామునిం దోడ్కొని వచ్చెదము. వేగ దానికిఁ దగు ప్రయత్నము సమకూర్పుము. వెలలేని మేలిమితొడవులం దాల్చిన సొగసుకత్తెలగు కొందఱు వెలయాండ్ర నిప్పు డచ్చటికిఁ బంపుము. విచిత్రాంబరాభరణాన్నపానాదులచే సత్కరింపఁబడిన యవ్వేశ్యలు నానావిధోపాయములచేత నతనిని భ్రమయించి తోడితేఁగల" రని చెప్పఁగా రోమపాదుండు వారిమాటల కొప్పుకొని, కొందఱ వేశ్యలఁ బంపఁగా వా రాఋశ్యశృంగునియాశ్రమునకు దాపున నుండి, విషయ సుఖములకు లోఁబడనిదిట్టలై యెల్లప్పుడు తపోవనంబున నుండు ఋశ్యశృంగునిదర్శనమునకై వేచియుండిరి.

ఆఋశ్యశృంగుఁ డన్ననో తండ్రికి శుశ్రూషలు చేసికొనుచు నిరంతర మాశ్రమంబు విడిచి బయట రాకుండెను. ఆఋశ్యశృంగుఁ డడవిలోనే పుట్టినదిమొదలు తపస్సు చేయువాఁడు గాన, పట్టణములోనివారైనను, పల్లెలలోనివారైనను నాఁడుదిగాని, మగవాఁడుగాని, యాతనికంటఁ బడినది లేదు. అట్లుండఁగా నొక్కదినంబున దైవవశంబున నాఋశ్యశృంగుఁ డారూపసులగు వారకాంత లున్నచోటికే తెంచి, వారింజూచెను. బాగుగా నలంకరించియున్న యాజవ్వనులు తమ శ్రావ్యమైన కంఠ మెత్తి పాడుచు నామునిని డాసి, "ఓ బ్రాహ్మణుఁడా, నీ వెవ్వఁడవు? నీ వేల యీ ఘోరాటవియం దొంటరిగఁ గ్రుమ్మఱుచున్నాఁడవు? మా కెఱిఁగింపు" మని యమ్మహాముని నడుగఁగా, నాఋశ్యశృంగుఁ డింతకు మున్నెట్టి కోరఁదగిన రూపుగల కాంతలఁ జూడనివాఁ డగుటంజేసి, వారియందు మోహము గలవాఁడై, తన తండ్రిని దెలుపఁ గోరి, యావేశ్యలం జూచి, "మాతండ్రి విభండక మహాముని. నే నాతని కౌరసపుత్త్రుఁడను. నా పేరు ఋశ్యశృంగుఁ డందురు. ఓ శుభదర్శనులారా, ఇదిగో యిచ్చటికి దాపుననే మా

యాశ్రమము. మీయందఱకును విధ్యుక్తప్రకారము పూజచేయుదును. రండు." అని ఋశ్యశృంగమహాముని పిలువఁగా, నావేశ్య లందఱా తపోవనంబుఁ జూడఁగోరి యమ్మహామునివెంబడిఁ బోయిరి. అతం డా యాటచేడియలకు నర్ఘ్యపాద్యముల నిచ్చి, గడ్డలు, కాయలు, పండ్లు వారికిఁ దిన నిచ్చెను. వా రాఋశ్యశృంగునిపూజఁ బడసి, యింకఁ గొంతకాల మున్న, ఋషి యేమి శపించునో యని వెఱచి, పయనమై, యమ్మహామునికిఁ గొన్ని పండ్లు, భక్ష్యము లీయఁగోరి, "మోా బ్రాహ్మణోత్తమా, యివి మేము దెచ్చినపండ్లు. ఇవి బాగైనవి. వీనింగైకొని తినుము. జాగు సేయకు" మని చెప్పి, మక్కువతో నాతనినిఁ గౌఁగిటఁ జేర్చికొని, యతనికి నానావిధంబులైన యనేక భక్ష్యముల నొసఁగఁగా, నాతఁ డడవిలో నింతవఱకు మునులు భక్షింపని యాభక్ష్యములఁ దిని, యవి పండ్లనియే తలంచుచుండెను. అంత నాయాటకత్తియ లుత్సాహవతులై ఋశ్యశృంగుని తండ్రిశాపంబునకు వెఱచి ఋశ్యశృంగుని వీడ్కొని, యనుష్ఠానములు సలుపఁబోయెద మను నెపము పన్ని యాశ్రమమునుండి వెడలిపోయిరి.

ఆ యాటచేడియ లంపఱు వెళ్ళఁగానే, విభండకునిసుతుండగు ఋశ్యశృంగుఁడు స్వస్థచిత్తము లేనివాఁడై, యా కాంతలమీఁది విచారముతో వెఱ్ఱివానివలెఁ దిరుగుచుండి, మఱునాఁడు, "నిన్న వచ్చినచోటికిఁ బోయిన నమ్మునులు వత్తురేమో, వారి నచ్చటఁ జూడ వచ్చు" నని యెంచినవాఁడై, రూపవతులును, నలంకారములఁ దాల్చిన వారు నైన యా యతివ లెచ్చటఁ గనబడిరో యచటి కేతెంచెను. అప్పు డావారాంగనలును వచ్చుచుండు నమ్మహామునినిఁ జూచినంతనే, మన సులం దుప్పొంగుచు దాపున కేతెంచి, "ఓ సౌమ్యుఁడా, మాయాశ్రమంబునకు రావలయును. అది మాకు స్వదేశమగుటంజేసి, మీకు విశేషముగా సన్మానంబు సేయఁగల" మని చెప్పఁగా, ఋశ్యశృంగుఁడు వారివెంబడిఁ బోవుటకు సమ్మతించెను. వేశ్యలును నతనిని దోడ్కొని పోయిరి. మహాత్ముఁడయిన యాఋశ్యశృంగుని వారు పిలుచుకొనివచ్చు చుండఁగనే లోకమున కంతయును సంతసం బొదవునట్లుగా వర్షంబు గురిసెను. అప్పుడు రోమపాదుండు వర్షముతోఁగూడనే తనదేశమునకు

వచ్చుచున్న ఋశ్యశృంగమహామునిని నెదుర్కొని, వినయనమ్రుండై నేలపై సాగిలఁబడి మ్రొక్కి, మిమ్ము వంచించి యిక్కడికిఁ బిలుచుకొని వచ్చినందులకై, మీతండ్రిగారికిఁగాని, మీకుఁగాని కోపము గలుగ కుండుఁగాక యని వేడఁగా, నా ఋశ్యశృంగుఁ డతని వేఁడికోలు నంగీకరించి, యతఁడు తన్ను వంచనచే నచ్చటికిఁ బిలుచుకొనివచ్చినందులకై కోపగింపక మన్నించెను. అంతట రోమపాదుం డంతిపురంబునకుఁ జని, తనకూఁతురగు శాంతను దెచ్చి యిమ్మహామునికి యథావిధిగా నొసంగి, నెమ్మదితో సంతసము నొందెను. ఇట్లు ఋశ్యశృంగుండు రోమపాదుని పుత్రికయగు శాంతను బెండ్లాడి, కోరికలన్నియుఁదీర నచ్చట శాంతతోఁ గూడి సకలసుఖంబు లనుభవించుచుండెను.

## 11-వ సర్గము

దశరథుఁడు ఋశ్యశృంగుని నయోధ్యాపురంబునకుఁ దోడ్కొనివచ్చుట

సుమంత్రుఁ డిట్లు రోమపాదుఁడు ఋశ్యశృంగమహామునిని దన పురంబునకుఁ బిల్చుకొనివచ్చిన తెఱంగు తెలియఁజెప్పి, "రాజేంద్రా, దేవతలలో శ్రేష్ఠుఁడగు సనత్కుమారుఁడు మీ మేలుకై కథతోఁ గథగా నింకను జెప్పినసంగతిని వినిపించెదను. ఆలకింపుము. ఇక్ష్వాకువంశము నందును ప్రతిజ్ఞ తప్పనివాఁడును ధర్మాత్ముఁడునైన దశరథుండనఁ బ్రసిద్ధి కెక్కిన నృపాలుఁడొక్కఁడు జన్మింపఁగలఁడు. ఆతని కంగరాజుతోడి చెలిమి యొనఁగూడఁగలదు. ఆ యంగరాజునకు రోమపాదుండను నొక పుత్రుఁడు పుట్టఁగలఁడు. ఆ రోమపాదునకు శాంత యను నొకకూఁతురు జన్మించును. విశేషమగు కీర్తివడసిన దశరథుఁ డా రోమపాదునికడ కేఁగి, ధర్మాత్ముఁడా, నాకుఁ బుత్రులు లేరు. నేను పుత్రోత్పత్తింగోరి యాగంబు చేయ నున్నాఁడను. నీ వనుజ్ఞ యొసంగినయెడల, శాంత మగఁడగు ఋశ్యశృంగమునీంద్రుఁడు వచ్చి నాకు సంతతి గలుగుటకును, కులాభివృద్ధి యగుటకును నేఁజేయు యాగంబు నెఱవేర్పఁగల"డని ప్రార్థించును. అప్పుడు వివేకశాలియైన రోమపాదుండు దశరథనృపాలునివాక్యము విని మనసునఁ గొంతసేపు చింతించి, పుత్రవంతుఁడగు శాంత పెనిమిటిని ఋశ్యశృంగుని బిలుచుకొనిపొమ్మని యనుజ్ఞ యొసంగును. అంత దశరథుండు మనంబునఁ గల చింతఁ బాసి యత్యంత

సంతోషముతోఁగూడి, ఋశ్యశృంగమహామునిని దోడ్కొని చని యశ్వమేధయాగంబుఁ జేయఁ బూనఁగలఁడు. అప్పుడు దశరథనరేశ్వరుఁడు కీర్తిని గోరువాఁడు గావున దోసిలిగట్టుకొని, యజ్ఞము నడుపుటకొఱకును, సంతతికొఱకును, స్వర్గముకొఱకును ఋశ్యశృంగుని యజమానునిగా వరించును. అన్నృపాలుఁడా మునివరునివలన నాకోర్కిని బొందఁగలఁడు. ఆదశరథనృపాలునకు విస్తారమైన పరాక్రమముగలవారును, వంశోద్ధారకులును, సకలలోకంబులందుఁ బ్రసిద్ధి కెక్కినవారునైన నల్వురు కొడుకులు పుట్టగలరు" అని ఇవ్విధంబున నాసనత్కుమారుఁడు తొల్లి కృతయుగంబున ఋషులతోఁ జెప్పెనఁట. కావున "పురుష శ్రేష్ఠుఁడవైన దశరథమహారాజా, నీవే చతురంగబలముతో నారోమపాదునికడఁ కేఁగి యాతనియానతిఁ గొని, యా ఋశ్యశృంగమహామునిని గారవించి తోడ్కొనిరమ్ము" అని సుమంత్రుఁడు చెప్పెను.

అంత దశరథుఁడు సుమంత్రుని మాటలను విని, తన కులగురు వగు వసిష్ఠమహామునికి నావిషయమెల్ల నెఱుఁగఁజెప్పి, వారివలన సెలవుఁ దీసికొని, తనపత్నులతోడను, మంత్రులతోడను వనంబులను, నదులను మెల్ల గాదాఁటి, యమ్మునిపుంగవుఁడుండు నంగదేశంబునకుఁ జేరి, రోమపాదుని చేరువ నగ్నిహోత్రునిచందంబున వెలుఁగుచున్న ఋషికుమారుఁడగు ఋశ్యశృంగమహామునినిఁ జూచెను. ఆ రోమపాదుఁడు తనకు దశరథుఁడు చెలికాఁడగుటచేత నమ్మహారాజు రాకకు మనంబున నుప్పొంగి యా దశరథునికి శాస్త్రసమ్మతంబుగఁ బూజజేసెను. అట్లు దశరథునకు గారవంబు చేసినపిదపఁ దమకును దశరథునకును గల చెలిమిని, చుట్టఱికంబును ఋశ్యశృంగునకుఁ దెలియఁబఱుపఁగా నమ్మహామునియు దశరథుని మర్యాద సేసెను. ఇట్లు దశరథుఁడు తనకు రోమపాదుండు చేసిన మర్యాదకు సంతసిల్లుచు నతనితోడ నేడెనిమిదిదినంబులు గడపి, "నీకూఁతురగు శాంతను పెనిమిటితోఁగూడ మా పత్తనంబునకుఁ బంపుము. నే నొక్క గొప్పపనిని దలపెట్టితి" నని రోమపాదు నడిగెను. రోమపాదుండును "నట్లే" యని ఋశ్యశృంగుని బంపుటకు సమ్మతించి, "మునీంద్రా, నీవు భార్యాసమేతుండవై యయోధ్యకుఁ బోయిర"మ్మని చెప్పెను. ఋశ్యశృంగుఁడును నందుకు సమ్మతించి రోమపాదునియనుజ్ఞ

వడసి, శాంతతోఁగూడ దశరథుని వెంటఁ బయనమాయెను. అప్పుడు దశరథుఁడును వీర్యవంతుఁడగు రోమపాదుండును వొండొరులు గాఢాలింగన మాచరించి మిక్కిలి యానందము నొందిరి. అంత దశరథుఁడు రోమపాదుని వీడ్కొని, ఋశ్యశృంగుని వెంటఁ దోడ్కొనివచ్చుచు "పురమంతయుఁ గలయంపిచల్లి, వీథులెల్లఁజక్కఁగా నూడ్చి, శుభ్రపఱచి, తోరణములు, టెక్కెములు గట్టించి, చక్కఁగా నలంకరింపుఁ డని పురజనులకుఁ జెప్పుఁ" డని ముందుగా దూతలఁ బంపఁగా, వారు మహారా జానతిచ్చినచొప్పునఁ బురజనులకుఁ దెలిపిరి. పురజను లందఱు వెంటనే రాజానానతిచొప్పునఁ బురం బెల్ల నలంకరించిరి. దశరథనృపాలుఁడు శంఖదుందుభివాద్యములు ముందు మ్రోగుచుండ మునిశ్రేష్ఠుఁడగు ఋశ్యశృంగునితోడ నలంకృతంబై యున్న పురవరంబుఁ బ్రవేశించెను. అప్పుడు దశరథుండు మర్యాదలు సల్పి తోడ్కొనివచ్చుచుండు ఋశ్యశృంగమహామునిని జూచి పురవాసులగు జను లందఱు కడుమోదమందిరి. దశరథుఁడును ఋశ్యశృంగమునీంద్రుని బత్నీసమేతముగ నంతిపురము ప్రవేశపెట్టి, యథావిధిఁ బూజ లొనరించి, యా ఋశ్యశృంగునిఁ దోడితెచ్చుటవలనఁ దనకోర్కెలెల్ల నెరవేఱినట్లు తలంచెను. అంతఃపురాంగన లెల్లరు భర్తతోఁగూడ నేతెంచిన శాంతను జూచి, మర్యాదలు సల్పి సంతసము నొందిరి. అవ్విధంబున నంతఃపురాంగనలును విశేషముగ దశరథనృపాలుండును చేయుపూజలను గైకొనుచు, శాంత మగనితోఁ గూడి కొంతకాలము సుఖముగా నుండెను.

## 12-వ సర్గము

### దశరథుఁ డశ్వమేధయాగము సేయ నిశ్చయించుట

అనంతరము కొన్ని దినములు గడచినపిదప మనోహరమైన వసంతర్తువు వచ్చెను. అపుడు దశరథునకుఁ దన సంకల్పించిన యాగము చేయవలె నని మనసు గలిగెను. అంతట నాదశరథుండు కాంతియందు దేవతలంబోలిన ఋశ్యశృంగమహామునికి నమస్కరించి, తమకుఁ బుత్రభాగ్యము లేకుండుటయను కొఱఁతఁదీర్చుటకొఱకు యాగమునారంభించి నడిపింపవలయునని యాతని వేడుకొనెను. అమ్మహామునియు, "అట్లే కానిమ్మని యొప్పుకొని, యాగమునకుఁ గావలసిన సామగ్రులను సేక

రించునట్లును, రమణీయప్రదేశమున యజ్ఞశాల నిర్మించునట్లును, అశ్వము గాఁపుఁదలతో విడుచునట్లును నాజ్ఞచేయవచ్చు"నని చెప్పెను.

అంత దశరథనృపాలుండు మంత్రులలో శ్రేష్ఠుఁడైన సుమంత్రుని బిలిచి, "యోసుమంత్రా, యజ్ఞములఁ జేయించువారును, వేదములఁ జదువువారును నైన సుయజ్ఞ, వామదేవ, జాబాలి, కాశ్యపు లను మహామునులను, బురోహితులగు వసిష్ఠులవారిని, నింక నితరులైన బ్రాహ్మణశ్రేష్ఠుల నందఱను వేగముగఁ దోడ్కొని ర"మ్మని యాన తిచ్చెను. సుమంత్రుండును వెంటనేపోయి, వేదములఁ బూర్తిగా నధ్యయనంబు నేసిన యా బ్రాహ్మణోత్తముల నందఱను బిలుచుకొనివచ్చెను. వారందఱు రాఁగానే, ధర్మాత్ముఁడైన దశరథుఁడు వారిని బూజించి, ధర్మార్థయుక్తంబుగాఁ దిన్నని పలుకుల నిట్లనియె: "ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా, నేను బుత్రసంతతిఁగోరి, బహుకాలముగఁ జింతపడుచున్నందున, నాకుఁ గొంచెమయినను సౌఖ్యము లేకున్నది. పుత్రసంతతిఁ బడయుటకై యశ్వమేధయాగము చేయవలె నను తలంపు పుట్టెను. ఆ యాగమును శాస్త్రోక్తవిధానమున నడిపించి, యీ ఋశ్యశృంగమహాముని యనుగ్రహంబువలన నేను నాకోర్కులను బొందవలయును" అని రాజు చెప్పఁగా, వసిష్ఠాదులగు బ్రాహ్మణు లందఱు రాజుమాటను విని, యది బాగున్నదని శ్లాఘించిరి. అంతట ఋశ్యశృంగాది బ్రాహ్మణోత్తము లందఱు రాజును జూచి, "మహారాజా! యజ్ఞమునకు గావలసిన సామగ్రులఁ దెప్పింపుఁడు. అశ్వమును విడిపింపుఁడు. పుత్రసంతతికై తమ కిట్టి ధార్మికబుద్ధి గలిగెను గావునఁ దప్పక తమ కమితబలశాలులగు కొడుకులు నల్వురు పుట్టఁగల"రని చెప్పిరి.

అప్పుడు రాజును, బ్రాహ్మణులు చెప్పిన వాక్యమును విని యానందమునొంది, మంత్రులను బిలిచి యిట్లు చెప్పెను: "ఓమంత్రులారా, వసిష్ఠులు మొదలగు పెద్దలు చెప్పినచొప్పున సకలవస్తువులఁ దెప్పింపుఁడు. నేర్పరియైనవానివశంబున నప్పగించి, గుఱ్ఱమును విడిపింపుఁడు. సరయూనది కుత్తరపుగట్టున యజ్ఞశాల నేర్పఱిచి కల్పోక్తప్రకారం బుగ విధిఁ దప్పక శాంతులను నడపింపుఁడు. ఈ యశ్వమేధయాగంబున నపాయకరంబగు ప్రత్యవాయంబు సంభవింపదేని యీ యాగంబు

నందఱు రాజులు చేయఁగలరు. ఈయశ్వమేధయాగంబునందు విద్వాంసులు బ్రహ్మరాక్షసు లెక్కడ సందువోరకునా యని వెదకుచుందురు. అట్టిలోపంబులు వాటిల్లిన, యాగంబుచేసిన యజయానుఁడు వెంటనే నశించును. కావున నీయాగంబు యథావిధిగ నెట్లు ముగియునో, ఓ కార్యసమర్థులారా, యట్టిప్రయత్నము చేయవలయు"నని మంత్రుల కాజ్ఞ యొసంగెను. అక్పుడు మంత్రులందఱును నాపార్థివేంద్రుఁడగు దశరథునివాక్యమును శిరసావహించి, యాప్రకారంబుగ సర్వము సిద్ధపఱచిరి. ఆటుపిమ్మట విప్రులందఱు పార్థివశ్రేష్ఠుఁడగు దశరథునిబొగడి, సెలవుఁ దీసికొని, తమతమయాశ్రమంబులకుఁ బయనమైరి.

అట్లు బ్రాహ్మణోత్తము లందఱు తమతమనెలవులకుఁ బోవఁగనే, దశరథనృపాలుండు మంత్రుల నందఱ వారివారి గృహములకుఁ బంపి, మిక్కిలి కాంతితోఁ గూడినవాఁడై, నిజాంతఃపురముఁ బ్రవేశించెను.

## 13-వ సర్గము

### దశరథుఁడు యాగంబు సేయ నారంభించుట

మఱల వసంతఋతువు వచ్చునప్పటికి నశ్వంబు విడిచి యొకసంవత్సరము నిండెను. వెంటనే వీర్యవంతుఁడైన దశరథుఁడు సంతతికై యశ్వమేధయాగంబు సేయఁబూని ద్విజశ్రేష్ఠుఁడగు వసిష్ఠుని నమస్కరించి, యథావిధిగఁ బూజించి, సంతతినిమిత్తమై యడఁకువతో "మునిశ్రేష్ఠుఁడవగు ఓమహాత్మా, శాస్త్రోక్తంబుగ యజ్ఞముఁ దామము నడిపింపవలయును. యజ్ఞసామగ్రులయందుఁ గొఱఁత గలుగకయుండులాగున నన్నింటిని జేర్పవలయు. తాము నాకుఁ బరమాప్తులు, మంచి మనస్సు గలవారలు, పరమగురులరు. కావునఁ దాము పూనికతో నాయజ్ఞభారము నిర్వహింపవలయును" అనెను.

అట్లు దశరథుఁడు ప్రార్థింపఁగా, ద్విజశ్రేష్ఠుఁడగు వసిష్ఠుఁడును "మహారాజా, తమరు తలంచిన కార్యము సంతయు నెఱవేర్తు"నని చెప్పి, యాగకార్యములందు నియమింపఁబడిన వృద్ధబ్రాహ్మణులను, మిక్కిలి ధర్మాత్ములగు పెద్దలను నాయాపదార్థములను దెచ్చియిచ్చుటలో నియమింపఁబడినవారిని, వడ్రంగులను, బేలుదారీలను, చిత్రములువ్రాయు

వారలను, లేకరులను, రసములను భావమును నభినయింపఁగల నర్తకులను, శాస్త్రముల నెఱిఁగినయనుభవశాలులగు నాచారవంతులయిన పురుషులను బిలిచి, "మీరందఱు ప్రభువునాజ్ఞప్రకారము యజ్ఞకార్యములఁ జేయవలయు. వేగిరంబుగ వేలకొలఁది నిటికలు మఱియు యాగమునకు వచ్చెడురాజు లుండఁదగిన మేడలఁగట్టింపుఁడు. బ్రాహ్మణుల కనుకూలములైన పందిళ్లు విశేషముగ వేయింపుఁడు. ఆపందిళ్లను గట్టిగాఁ గట్టించి, యన్నపానాదులకు విశేషముగా నమరిక చేయవలయును. ఇంతియకాక, యజ్ఞముఁ జూడవచ్చిన పురజనుల కందఱకు సకలసామగ్రులతోడను భక్ష్యములతోడను నిండిన విశాలములగు పందిళ్లు వేయింపవలయును. అంతియకాక యజ్ఞముఁ జూడవచ్చిన రాజ్యమునందలి పల్లెలవారికెల్లను ననాదరంబుతోఁగాక, శ్రద్ధతో మర్యాదలు సల్పి, యన్నపానంబు లొసఁగవలయును. సకలవర్ణములవారికిఁ గొఱఁత లేకుండునట్లుగ మర్యాదలు సలుపవలయును. కోపముచేఁగాని, కామముచేఁగాని వారి కనాదరంబు సేయరాదు. యాగకార్యములందే తలం పుంచి పనిచేయు సేవకులకును పనివారికిని వరుసఁ దప్పక మీరు మిక్కిలి మర్యాద చేయవలయును. వారికందఱకు విస్తారముగా ధనమొసఁగి, భోజనము పెట్టినచో, వారలు మిక్కిలి ప్రీతినొందుదురు. ఎట్లు సేసినఁ గించిత్తయినను లోపములేక యంతయు నెఱవేరునో, అట్లు మీ రందఱు పనుల నుత్సాహయుక్తమైన మనస్సుతోఁ జేయవలయును" అని పలుకఁగా నప్పుడు వార లందఱు "మహాత్మా, మీరు చెప్పినచొప్పున నడపించిన నేలోపంబునుం గలుగదు. మీయనుజ్ఞచొప్పున నొక్కటియు విడువక చేయుదు"మని పలికిరి.

అంత వసిష్ఠమునీంద్రుఁడు సుమంత్రుని బిలిపించి యిట్లనియె. "ఓమంత్రిశ్రేష్ఠుఁడా, భూమండలంబునం గల ధర్మాసక్తులయిన రాజుల నందఱఁ బిలిపింపుము. సకలదేశంబులందుండు వేలకొలఁది బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లనెడి నాలుగువర్ణములవారిని మర్యాదలతోఁ బిలిపింపుము. మఱియు మిథిలకు రాజును, సత్యపరాక్రమవంతుఁడును, వేదములందును శాస్త్రములందును బ్రజ్ఞగలవాఁడును, సంపదగలవాఁడునైన జనకమహారాజును, బహుకాలపుఁ జుట్టఱికంబునుబట్టి నీవె పిలిచి

రమ్ము. అట్లే, యెల్లప్పుడు వేడుకఁగ మాటాడువాఁడు మనరాజునకుఁ బ్రియస్నేహితుఁడునగు కాశీరాజును, మనమహారాజునకు మామగారైన పరమధార్మికుఁడగు కేకయరాజును, వానికుమారులను, మఱియు, మనరాజేంద్రునికి సరియీడువాఁడగు భాగ్యశాలియైన యంగదేశపురాజగు రోమపాదుని నీవె స్వయముగాఁ బోయి పిలిచికొనిరమ్ము. మఱియుఁ దూర్పుదేశపురాజులను, సింధుసౌవీరము లనెడి పశ్చిమదేశపు రాజులను, దక్షిణదేశముల నేలు నృపాలురను రప్పింపుము. మఱియు భూమండలంబున నుండు మనరాజుగారి చెలికాండ్రగురాజుల నందఱను బంధుపరివారసమేతంబుగ రమ్మని పిల్చుటకు వేగ దూతలఁ బంపుము."

అని వసిష్ఠుఁడు చెప్పఁగా విని, సుమంత్రుఁ డతనియాజ్ఞచొప్పున రాజులఁ బిలుచుటకై వెంటనే మంచిగుణములుగల్గి నేర్పుకాండ్రయిన దూతల నాజ్ఞాపించెను. ధర్మాత్ముఁడగు సుమంత్రుఁడు వసిష్ఠమహాముని యానతిప్రకారంబుగఁ గొందఱ రాజులఁ దానే పిలిచికొనివచ్చెను. పని వారందఱు యాగశాలయందుఁ గావలసిన పనుల నన్నింటినిఁ జేసి, యంతయు జ్ఞానవంతుఁడయిన వసిష్ఠమహామునికిఁ దెల్పిరి. అప్పుడు వసిష్ఠుఁడు వారిపనులను జూచి, తృప్తి నొంది, "ఓభృత్యులాలా, మీ రెవ్వరికేని తిరస్కారభావముతోఁగాని, అశ్రద్ధతోఁగాని యేమియు నీయఁదగదు. అట్లొసఁగఁబడినదానము దాతకుఁ జేటు దెచ్చును. దీనికి సంశయంబు లేదు" అని చెప్పిపంపెను.

పిమ్మటఁ గొన్నిదినంబులలోపలనే పిలిచిన రాజులందఱు కానుకలకై యనేకరత్నములఁ దీసికొని యేతెంచిరి. అంతట వసిష్ఠమహాముని దశరథనృపాలునికడ కేఁగి, "మహారాజా, మీయాజ్ఞచొప్పున నుత్తమ రాజు లందఱు యజ్ఞమునకు విచ్చేసిరి. వారి కందఱకు బసలేర్పఱచి తగు మర్యాదల సల్పితిమి. పనివా రందఱు మిక్కిలి జాగ్రత్తతోఁ జెప్పిన యజ్ఞసంబంధమగు కార్యములఁ జేసిరి. యజ్ఞశాల కోరిన సకల సామగ్రులతో నిండి, మనస్సుతోఁ జేయఁబడినదానివలె నిర్మింపఁబడియున్నది. రాజేంద్రా, ప్రభు వచ్చుటికి విజయముచేసి యజ్ఞశాల నంతయుఁ దిలకింపవలయు." అని చెప్పగా విని, దశరథుఁడు శుభదినంబునందు శుభ ముహూర్తంబున యజ్ఞశాలకు వెడలెను. అంత వసిష్ఠప్రముఖులైన

బ్రాహ్మణశ్రేష్ఠు లందఱు యజ్ఞశాలలోఁ బ్రవేశించి, ఋశ్యశృంగుని ముం దుంచుకొని శాస్త్రోక్తవిధుల నతిక్రమింపక, యజ్ఞకర్మంబులఁ జేయఁ దొడఁగిరి.

## 14-వ స ర్గ ము

### అశ్వమేధయాగవర్ణనము

యాగాశ్వమును విడిచినతర్వాత నేఁడాది నిండి, గుఱ్ఱము వచ్చి చేరఁగనే దశరథుఁడు సరయూనది యుత్తరపుగట్టున జన్నంబు సేయఁ దొడఁగెను. అప్పుడు వేదపారగులగు ద్విజోత్తము లందఱు ఋశ్యశృంగుని ముందుఁ బెట్టుకొని, గొప్పమనంబుగల దశరథునియశ్వమేధ యాగంబు నారంభించి, పూర్వమీమాంసాది శ్రౌతగ్రంథములందుఁ జెప్పిన తెఱఁగునఁ గార్యములనడపుచు యథాన్యాయంబుగను, యథా విధిగను యజ్ఞశాలయంతయుఁ దిరుగుచుండిరి. ఆసమయంబున బ్రాహ్మణులు ప్రవర్గ్యము, ఉపసదము అనెడి యజ్ఞాంగములగు కార్యంబులను మొదట యథావిధిగఁ జేసి పిదప సకలకర్మలను శాస్త్రోక్తమార్గమున లోపంబు వాటిల్లకుండులాగునఁ జేసి మునిశ్రేష్ఠులందఱు సంతోషభరితు లయి ప్రాతస్సవనము మున్నగాఁగల కార్యముల నడపిరి. వెంటనే బ్రాహ్మణశ్రేష్ఠులు రాజుచే నింద్రునికి మొదట హవిర్భాగము నిప్పించి సోమలతను బ్రార్థింపించిరి. ఆ పిదప బ్రాహ్మణపుంగవులు మాధ్యందిన సవనమును తృతీయసవనమును శాస్త్రోక్తముగ జరిపిరి. ఆ యాగంబున మంత్రోక్తంబుగ హోమములఁ జేసిరి. ఎట్టిలోపములును లేక యాగంబు చక్కఁగా జరిగెను. ఎల్లరు క్షేమంబుగ నుండునట్లు ఋత్విజులు యాగంబు విధియుక్తముగ జరిపిరి.

ఆ యాగదినంబులందు డస్సినవాఁడుగాని, ఆఁకలిఁగొన్న వాఁడు గాని లేఁడు. పండితుఁడుగానట్టి బ్రాహ్మణుఁ డచ్చటఁ గానఁబడ లేదు. నూఱుగురు పనివారు లేనివాఁడొక్కఁడు నాయజ్ఞశాలకు రాలేదు. బ్రాహ్మణులును శూద్రులు మొదలగు పనివారును, తాపసులును, భిక్షుకులును నెల్లప్పుడు దనివిగా భోజనంబు లొనరించిరి. ముసలివారు, రోగపీడితులు, స్త్రీలు, బాలురు సర్వదా భుజియించుచున్నను దనివి నొందకయుండిరి. బహుజనంబులు భోజనంబులు సల్పుచున్నను, దశరథ

మహారాజు దనివినొందక, యింకను జనంబులు సమృద్ధిగాఁ దినవలెనని కోఱుతపడుచుండెను. రాజు, "వచ్చినవారికిఁ దృప్తిగా నన్నము పెట్టి, వివిధవస్త్రముల నిం"డని యాజ్ఞ చేయుటచేత రాజభటులును జేతికి వచ్చినట్లుగా నిచ్చుచుండిరి. ఆ యాగశాలయం దన్నము కొండల వలె రాసులుగాఁ బోయబడియుండెను. ఆ యాగమునకు వచ్చినస్త్రీపురుషు లందఱు రాజభటులు పెట్టెడు మధురాన్నంబులచే సంతుష్టినొందుచు, "ఓ నృపాలా, పదార్థములు బహురుచ్యములుగ నున్నవి. మే మీ యాగమున సమృద్ధిగా నిష్టాన్నములు గుడిచి సంతృప్తినొందితిమి. నీవు తలంచిన కార్యంబు తప్పక నెఱవేఱెడు"నని నుడివిరి. ఆమాటలను దశరథనృపాలుఁ డాలకించి, మనంబున నానందంబుఁ బొందుచుండెను. రాజపురుషులు పరిశుద్ధవేషములఁ దాల్చి ద్విజోత్తములకు వడ్డనలు సేయుచుండిరి. మఱికొందఱు కెంపుల యంటుజోళ్లు మొదలగు తొడవులఁ దాల్చి యా వడ్డించువారికిఁ దోడుగాఁ బైపనులొనర్చుచుఁ దిరుగుచుండిరి. యుక్తియుక్తంబుగ మాటాడనేర్చిన పండితు లందఱొండొరుల గెల్వఁగోరి, కర్మలను నడపుచు నడుమనడుమ వాదములు సేయుచుండిరి. ఆ యాగశాలయందు శ్రౌతవిధానంబుఁ జక్కగాఁ నెఱింగిన ఋత్విక్కు లందఱు పెద్దలుసెప్పిన పద్ధతిని నడచుచు శాస్త్రరీతిని సర్వకర్మలను నడపుచుండిరి. వేదాంగము లెఱుఁగనివాఁడును, బ్రహ్మచర్యాది నియమంబులు లేనివాఁడును, వాదనచేయుశక్తి లేనివాఁడును, ఆ యాగశాలలో లేకుండిరి.

ఆయాగమున యూపస్తంభస్థాపనవేళ రాఁగానే యాఱు మారేడువియు, నాఱు చండ్రవియు, మారేడువానికిఁ బ్రక్కననే యన్ని మోదుగువియు, నొక విరుగుడిదియు, దేవదారువియు నైన యూపస్తంభములు బారెడు బారెడు దూరమున కొక్కటొక్కటివంతున నాఁటిరి. ఆయూపము లన్నియు యజ్ఞకర్మములను జక్కఁగ నెఱింగిన శాస్త్రజ్ఞులైన ద్విజులచే యాగశాల కలంకారంబుగ నుండునట్లు బంగారుచే నలంకరింపఁ బడినవి. ఆ యిరువదియొక్క యూపస్తంభములు చిటికెనవ్రేలు చాఁచిన పిడికిళ్లతో నుండు నిరువది మూరల పొడవుగలవై, ప్రతియొక్కటియు నిరువదియొక వస్త్రంబులచే నలంకరింపఁబడి యుండి

నవి. ఆయూపములన్నియు నెనిమిది మూలలుగలవై, నున్ననిరూపుతోఁ గూడి దృఢము లయినవియై శిల్పులచే బాగుగాఁ బనితీర్పఁబడియుండినవి. ఆ యూపస్తంభములు వస్త్రములచేతను, పుష్పములచేతను, సుగంధద్రవ్యములచేతను నలంకరింపఁబడి, యాకాశమున వెలుఁగు సప్తర్షులవలెఁ బ్రకాశించుచు విరాజిల్లుచుండినవి. శాస్త్రప్రకారము గొలఁతతప్పకుండ నిటికరాళ్ళను చేయించి, శుల్బమను యాగకర్మయందు సమర్థులయిన బ్రాహ్మణులు వేదికలఁ గట్టిరి. సమర్థులగు నాదశరథుని ఋత్విజులు కట్టఁదగిన ప్రదేశమును బంగారు తెక్కలుగల్గి, ప్రతిప్రస్తారమందును మూఁడేసి యిటికరాళ్లుండునట్లుం జేసి యాఱు ప్రస్తారములందును బదునెనిమిది యిటికరాళ్లుగలదై గరుడపక్షిరూపమైన వేదికను జక్కఁగాఁ గట్టిరి. శాస్త్రవిధానంబుచొప్పున నాయా దేవతల నుద్దేశించి, పశుబంధము చేయునపుడు మాత్ర మా ఋత్విజులు పశువులను, సర్పములను, పక్షులను, గుఱ్ఱములను, జలచరములను యూపస్తంభములందుఁ గట్టిరి. ఆ యశ్వమేధయాగంబునందు మూఁడునూఱుల పశువులును, దశరథమహారాజు నుత్తమాశ్వంబును నాయూపస్తంభములకుఁ గట్టఁబడినవి. అంతటఁ గౌసల్యాదేవి యాహయంబునకుఁ బ్రదక్షిణంబు నేసి, యెక్కువ సంతసంబుతోఁ గూడినదై మూఁడు బంగారుసూదులతో నాయశ్వమునకుఁ గత్తివాట్లు వేసెను. అప్పుడు కౌసల్య ధర్మమునం దపేక్షతోను, దిట్టమగు మనంబుతోను గూడి యొక రాత్రియంతయు నా గుఱ్ఱముతోఁగూడ నుండెను. ఆ యజ్ఞమునందు దశరథమహారాజీయఁగా, హోత, అధ్వర్యుఁడు, ఉద్గాత, బ్రహ్మ యీ నలువురును *మహిషిని, బరివృత్తిని, వావాతను, పాలాకలిని గ్రమంబుగఁ బరిగ్రహించిరి. అటుపిమ్మట నింద్రియనిగ్రహముగలవాఁడును, సకల సంపదలతో నిండినవాఁడునైన యధ్వర్యుఁ డాయశ్వముయొక్కవపను దీసి శాస్త్రోక్తప్రకారము వపాహోమము చేసెను. అప్పుడు దశరథనరేంద్రుండు దనపాపంబును బోఁగొట్టుకొనుటకై కాలంబు దప్పక శాస్త్రప్రకారంబున వపయొక్క సువాసనగలపొగ నాఘ్రాణించెను. మంత్రవేత్తలగు పదు

---

* మహిషి=పట్టంపుభార్య; పరివృత్తి=ఉపేక్షిత; వావాత=భోగవతి; పాలాకలి=క్షాత్రప్రద.

నాలుగురు ఋత్విక్కులు మంత్రములఁ బఠించుచు నాగుఱ్ఱముయొక్క యన్నియంగములను నగ్నియందు శాస్త్రవిధానంబుఁ దప్పక వేల్చిరి. ఇతరయాగంబులం దన్నింటియందు హవిస్సు జువ్వికొమ్మలందుఁ దీయఁ బడుచున్నది. అశ్వమేధంబునందు హవిస్సు ప్రబ్బలితీఁగెలందుఁ దీయఁబడు చున్నది. అశ్వమేధంబు మూఁడుదినములయాగం బని కల్పసూత్రంబునఁ జెప్పినట్లు వేదములు చెప్పుచున్నవి. ఆ యశ్వమేధంబుయొక్క మొదటి దినము చతుష్టోమ మనియు, రెండవది ఉక్థ్య మనియు, మూఁడవది అతిరాత్ర మనియుఁ జెప్పఁబడుచున్నది. ఆ యశ్వమేధంబునందు శాస్త్ర ప్రమాణమువలన ననేకయాగంబులు ఋత్విక్కులు చేయించిరి. ఆ యాగంబు లేవి యనిన, జ్యోతిష్టోమం బొక్కటియు, ఆయుర్యాగం బొక్కటియు, రెండతిరాత్రములును, అభిజి త్తొక్కటియు, విశ్వజి త్తొక్కటియు, అప్తోర్యామ మను మహాయాగం బొక్కటియు.

స్వకులమును వృద్ధి నొందింపఁ గోరినట్టి దశరథమహారాజీ ప్రకారముగ నశ్వమేధయాగంబుఁ బూర్తిచేసి, హోతకుఁ దూర్పుదిక్కును, అధ్వర్యునకుఁ బశ్చిమదిక్కును, బ్రహ్మకు దక్షిణదిక్కును, ఉద్గాతకు నుత్తరపుదిక్కును దక్షిణగా నొసంగెను. పూర్వము బ్రహ్మచే నశ్వమేధమహాయాగంబున కీ దక్షిణ యేర్పఱుపఁబడినది. మఱియుఁ బురుషశ్రేష్ఠుఁ డయిన దశరథనృపాలుం డివ్విధంబున నశ్వమేధము పరిసమాప్తి గావించి, యాగఫలము పూర్తిగఁ గలుగుటకై ఋత్విక్కులకు భూమండలమెల్ల దక్షిణగా నొసంగెను. అప్పుడు బ్రాహ్మణు లందఱు పాపరహితుఁ డైన నృపాలుని జూచి, "భూమిపాలా, మా కీ భూమండలంబుతో నేమి యుపయోగము? మేము రాజ్యపరిపాలనము సేయ నోపము. మేము సర్వదా వేదాధ్యయనంబు సేయుచుండువారము. మాకు రాజ్యపరి పాలనంబున శక్తి లేనిసంగతి మీకుఁ దెలియదా? మీరు రాజ్యముఁ గైకొని, దానికి బదులుగాఁ దమకుఁ దోఁచినంత మణులను, బంగారమును, గోవులను; లేక యేది సిద్ధముగ నున్నదో దానిని నిప్పింపుము. మాకు రాజ్యంబుతో నక్కఱ లే దని చెప్పిరి. అట్లు వేదములఁ దుద ముట్టఁ జదివిన బ్రాహ్మణులు పలుకఁగా, దశరథనృపాలుండు పదిలక్షల గోవులను, నూఱుకోట్ల బంగారమును, నన్నూఱుకోట్ల వెండిని నా బ్రాహ్మ

ణుల కొసఁగెను. అంతట ఋత్విజులందఱు గూడి తమకు నరేంద్రుఁ డొసఁగిన ధనమునెల్లను యోగ్యుఁడయిన ఋశ్యశృంగమహామునికిని, వసిష్ఠమహామునికి సమర్పించిరి. అంత నావసిష్ఠాదులగు బ్రాహ్మణోత్తము లందఱు దమకు దొరకిన ధనంబు నంతయు వంతులప్రకారము న్యాయ ముగాఁ బంచుకొని, మనంబున సుప్రీతులై, యెండొరులు స్తోత్రములు సల్పుకొనిరి. అంత దశరథుఁ డభ్యాగతులుగ వచ్చిన బ్రాహ్మణుల కెల్లఁ గోట్లకొలఁదిగ బంగా రొసంగెను. అప్పుడు దరిద్రుఁడయిన యొక బ్రాహ్మ ణుఁడు వచ్చి యాచింపఁగా నతనికి దశరథనరపాలుఁడు తనచేతికడియము నిచ్చెను. బ్రాహ్మణులందఱు నృపాలుఁడొసఁగిన ధనంబుఁ గైకొని సంత సంబు నొందిరి. బ్రాహ్మణప్రియుఁడయిన దశరథనృపాలుఁ డానందబాష్ప ములు విడుచుచు వారికిఁ బ్రణామంబు సల్పెను. అప్పుడు బ్రాహ్మణు లందఱు దశరథనరేంద్రునకు దీవన లొసఁగిరి.

అంత దశరథుండు వారియాశీర్వాదంబులు వడసి, పాపంబులఁ బోఁగొట్టునదియు, స్వర్గలోకంబు నొందించునదియు, నందఱు రాజులకుఁ జేయ నలవికానిదియునైన యశ్వమేధంబు పరిసమాప్తి నొందించి, ఋశ్యశృంగమునీంద్రుని జూచి, "నియమవంతుఁడవగు మునీంద్రా, కుల మును వృద్ధినొందించు కర్మంబు సేయవలయు" నని ప్రార్థింపఁగా, ఋశ్య శృంగమునీంద్రుఁడును "అలాగే చేసెదను. నీకు వంశోద్ధారకులైన పుత్రులు నల్వురు పుట్టఁగల"రని దశరథునితోఁ జెప్పెను.

## 15-వ సర్గము

### ఋశ్యశృంగమహాముని పుత్రకామేష్టి చేయించుట

అంత మేధావియు, వేదార్థములఁ జక్కఁగా నెఱింగినవాఁడును నైన యా ఋశ్యశృంగుఁడు కొంతతడ వాలోచించి, యిటుపిమ్మట జ్ఞప్తికిఁ దెచ్చుకొన్నవాఁడై, దశరథనృపాలునితో నిట్లనెను. "ఓ నరేంద్రా, నీకుఁ బుత్రులు గలుగుటకై యథర్వశిరంబునందుఁ జెప్పఁబడిన మంత్రములచే శాస్త్రసిద్ధంబయిన పుత్రోత్పత్తిని గల్గించు యాగంబుఁ జేయించెదను." అని బ్రహ్మతేజస్సుగల ఋశ్యశృంగ మునీశ్వరుండు దశరథుని పుత్రసంతతికై పుత్రకామేష్టి నారంభించి, మంత్రములందుఁ

చెప్పఁబడినతెఱఁగున నగ్నియందు వేల్మి వేల్చెను. అంతట సిద్ధ, గంధర్వ, దేవ, మహర్షులందఱు హవిర్భాగంబులఁ గైకొనుటకై యిచ్చటికి వచ్చి చేరిరి. అప్పుడు దేవతలందఱు తమతమ మర్యాదలఁబొప్పునఁ గూర్చుండి, లోకములకెల్ల సృష్టికర్త యగు బ్రహ్మనుజూచి గొప్పమాట చెప్పిరి.

"ఓభగవంతుఁడా, నీయనుగ్రహబలమున రావణుఁడను రాక్షసుఁడు మమ్మునందఱను బీడించుచున్నాఁడు. మేము మాబలముచే వానిని శిక్షింపఁజాలకున్నాము. తొల్లి తా మాయసురుని తపంబునకు మెచ్చి కోరినవరం బొసంగితిరి. ఆ వరంబును గౌరవించి, మే మాతని తప్పిదము లన్నింటిని నోర్చియున్నాము. అహంకారము గల యా రావణుఁడు ముల్లోకంబుల వెఱపించుచున్నాఁడు. గొప్పవారగు లోకపాలురతోఁ బగగొనియున్నాఁడు. దేవతలకెల్ల ఱేఁడగు దేవేంద్రుని దిరస్కరింపఁ గోరుచున్నాఁడు. మఱియు నతఁడు తా నొసంగిన వరముచే గర్వించి, గంధర్వులను, యక్షులను, అసురులను, బ్రాహ్మణులను, మహర్షులను సరకుసేయకున్నాఁడు. సూర్యుఁ డితనిపై నెండఁగాయఁడు. వాయువు ప్రక్కలనైనను వీవఁడు. ఆ రావణునిఁ జూచినఁ గదలుచున్న యలలతో నొప్పెడు సముద్రుఁడు సైతము మెదలకుండును. కావున వికృతరూపము గల యా రావణాసురునివలన మాకు గొప్ప వెఱపు పుట్టియున్నది. ఓ భగవంతుఁడా, యతనివధంబునకు నొక యుపాయంబు చింతింపవలయును."

అని దేవత లందఱు ప్రార్థింప నా బ్రహ్మదేవుఁ డాలోచించి దేవతలతో నిట్లనెను:—"దురాత్ముఁడైన యారావణుని వధోపాయంబు నెఱింగితిని. ఇఁక మీకు సంతోషము కలుగును. ఆరావణుఁడు, తాను దేవ దానవ గంధర్వ యక్ష రాక్షసులచేఁ దాను వధ్యుఁడు కాకుండ వరమడిగెను. నేనట్లే యగునుగాక!" యని యంటిని. "అయినను, అయ్యసురుఁడు అలక్ష్యము లేక మనుష్యులవలనఁ జావులేకుండ వరమడుగఁడయ్యె. కావున నతండు నరునిచేతనే చావఁదగినవాఁడు గాని యితరులవలన నతనికి మరణంబు సంభవింప నోపదు." అని బ్రహ్మదేవుఁడు చెప్ప నా

ప్రియవాక్యమును విని, దేవతలు మహర్షులందఱును కడుమోదము నందిరి.

ఇంతలో నమితకాంతిగలవాఁడును, జగన్నాథుఁడును, పీతాంబరధారియు నైన విష్ణుమూర్తి శంఖచక్రగదాధరుఁడై, యచ్చటికి వచ్చి బ్రహ్మను గలిసికొని యిఁకముందు చేయవలసియున్న కార్యమునం దేకాగ్రచిత్తుఁడై యుండెను. అప్పుడు వేల్పు లందఱు నాదేవుని విశేషముగ స్తుతియించి, వినయముతో నిట్లనిరి: "ఓ విష్ణుమూర్తీ, సకల లోకముల మేలు గోరి నిన్నొక కార్యమునఁ బ్రేరేచెదము. అయోధ్యకు రాజును, ధర్మజ్ఞుఁడును, దానశీలుఁడును, మహర్షులంబోలు తేజముగలవాఁడును నైన దశరథునకు నీవు నాలుగంశములయి, హ్రీ, శ్రీ, కీర్తులంబోలిన యా దశరథుని పత్నులయందుఁ బుత్త్రుఁడవుగ జన్మింపుము. ఓ విష్ణుమూర్తీ, వారియందు నీవు మానుషరూపంబుతో జన్మించి, వరబలంబునఁ జెలరేఁగి, లోకముల కెల్ల శత్త్రువయి, దేవతలకైనను జయింప నలవికాకున్న రావణుని సంహరింపుము. ఈ మూఢుఁడయిన రావణుఁడు పరాక్రమాతిశయంబుచే గర్వించి దేవగంధర్వసిద్ధ మహర్షులను బాధించుచున్నాఁడు. అతఁడు వనమున దపము లొనర్చు మునులను, నందనవనమున విహరించు గంధర్వాప్సరసలను హింసించుచుండును. సిద్ధ, గంధర్వ, యక్ష, పన్నగ, గరుడాదులగు మే మందఱము సకల మునిగణములతోఁ గూడ నిన్ను శరణుసొచ్చితిమి. శత్త్రుసంహారకా, మాకందఱకు నీవేగతి. కావున శత్త్రువధంబునకై భూలోకమున నవతరింప నిచ్ఛగింపుము."

అని దేవత లందఱు ప్రార్థింపఁగా, సర్వలోకములచేతను నమస్కరింపఁబడు దేవదేవుఁడయిన విష్ణుమూర్తి ధర్మచింతతోఁ గూడియున్న సభలోని బ్రహ్మ మొదలగు దేవతలను జూచి యిట్లనియె. "ఓ దేవతలారా, మీరు భయపడవలదు. మీకు మేలయ్యెడు. మునులకును దేవతలకును భయముఁ గల్గించువాఁడును, దుష్టుఁడును, క్రూరుఁడునైన రావణునిఁ బుత్త్ర మిత్త్ర బంధు మంత్త్రి వర్గములతోఁ గూడ యుద్ధరంగమున సంహరించి పదునొకండువేలయేండ్లు భూపాలనము చేయుచు భూలోకంబున నుండఁగలను." అని దేవతలతోఁ జెప్పి ధైర్యవంతుఁడును, కమలములంబోలు కన్నులవాఁడును నైన విష్ణుమూర్తి "భూలోకంబున నెచ్చట నవ

తరింతునా?" యని యించుక యాలోచించి, తనయంశమును నాలుగుగ విభజించికొని దశరథమహారాజునకుఁ బుత్రుఁడుగ జనింపఁదలఁచెను.

అప్పుడు దేవత లందఱు గంధర్వాప్సరో యక్ష రుద్రగణములతోఁగూడి, మధుసూదనుని దివ్యములయిన స్తుతులతోఁ గొనియాడి, ఓ జగద్రక్షకా, భయంకర ప్రతాపముతోఁ గూడి, మీఱిన గర్వంబు గలవాఁడై, వేల్పులతోఁ బగగొని, లోకముల నెల్ల నేడ్పించుచుఁ దాపసులకు భీతిఁ గొల్పుచుండు నా రావణాసురునిఁ జంపి, వానిబలంబులను, బంధు మిత్ర పుత్రామాత్య గణంబులను రూపు మాపి, చింతఁ బాపిన వాఁడవై, శత్రుబాధ దొలఁగి క్షేమముతోఁ గూడి, దేవేంద్రునిచేఁ బాలింపఁబడెడు నీ లోకమునకు వచ్చి చేరు"మని శ్రీమహావిష్ణువును బలు తెఱఁగుల స్తుతియించిరి.

## 16-వ సర్గము

### పాయసోత్పత్తి

అనంతరము శ్రీమన్నారాయణుఁడు దేవతల ప్రార్థనంబు నియ్యకొని, తా నెల్ల నెఱిఁగినవాఁడయ్యు, దేవతలఁ జూచి, "ఓ దేవతలారా! మీ రా దుష్టుఁడును సాధుజనహింసకుఁడునైన రావణునిఁ జంప గోరితిరి. దానికిఁ దగునుపాయంబును జెప్పుఁ" డని యడుగఁ నా దేవతలు నాశరహితుఁడైన విష్ణుమూర్తిని జూచి యిట్లనిరి. "శత్రుసంహారకా! నీవు నరరూపం బెత్తి యుద్ధరంగమున నా రావణుని వధింపుము. తొల్లి యా రావణాసురుఁడు పెక్కేండ్లు బ్రహ్మను గూర్చి తపమొనరించెను. ఆతపమునకు బ్రహ్మదేవుఁడు మెచ్చుకొని, "ఓ రావణాసురుఁడా! నేను నీ తపమునకు మెచ్చితిని. నీకుఁ గావలసిన వరము వేఁడు మనెను. అంత రావణుఁడు "మనుష్యులు తప్పఁ దక్కిన యేభూతముల వలనను దనకుఁ జావు లేకుండునట్లు వరం బి"మ్మని యడిగెను. ఆ రావణుండు "మనుష్యు లెంతటివారలు! వారివలన నేమి కాఁగల"దని వారిని దిరస్కరించి యిట్లడిగెను. అందులకు బ్రహ్మదేవుం "డట్లు కాని"మ్మని వర మొసంగెను. ఇట్లు రావణుం డా బ్రహ్మదేవునివలన వరముపొంది, గర్వించినవాఁడై మూఁడులోకంబులను బాధించుచు, స్త్రీలను భంగపఱచుచు నున్నవాఁడు. కావున నతని చావు మనుష్యులవలననే కావలసి

యున్నది." అని దేవతలు చెప్పఁగా, విష్ణుమూర్తి దశరథుని దనతండ్రినిగా నిశ్చయించెను. ఆసమయమున దశరథుఁడును బుత్రులఁగోరి పుత్రకామేష్టిని జేసియుండెను. ఆశ్రీమహావిష్ణు వి త్తెఱంగున మనంబున నిశ్చయించుకొని బ్రహ్మదేవుని వీడ్కొని, దేవతలును, మహర్షులును స్తోత్రములు చేయుచుండ నంతర్ధానము నొందెను.

అనంతరము దశరథునిహోమకుండమునుండి యమితవీర్యము గలదియు, బలముతోఁ గూడినదియు, నెఱుపు నలుపు గలిగిన వస్త్రంబు గట్టినదియు, నెఱ్ఱనిమోముగలదియు, భేరీనాదముఁబోలు కంఠధ్వనితోఁ గూడినదియు, సింగమునకువలె యొడలివెండ్రుకలును, మీసములును, తలవెండ్రుకలును గలదియు, సౌందర్యలక్షణములతోఁ గూడినదియు, మేలితొడవులం దాల్చినదియుఁ, బర్వతశిఖరంబుమాడ్కి నెత్తయినదియు, గర్వించిన పెద్దపులిపరాక్రమమువంటి పరాక్రమముగలదియును సూర్యునితో సమానమయిన యాకారము గలదియును, నగ్నిజ్వాలమాడ్కి వెలుఁగునదియు నైన యొకమహాభూతము పుటము వేయఁబడిన బంగారుతోఁ జేయఁబడినదియు, వెండి మైమూఁత గలదియునై, దివ్యపాయసముతో నిండి, మాయామయమో యని యెన్నఁదగియున్న పూర్ణకలశమును బ్రియకాంతనుంబోలె గట్టిగా రెండు చేతులతోఁ బట్టుకొని, పైకివచ్చి, దశరథనృపాలుం జూచి, "ఓ నృపాలా, నన్నుఁ బ్రజాపతి సన్నిధినుండి యిచటికి వచ్చిన వానినిగాఁ దెలియు" మని చెప్పఁగానే దశరథనృపాలుఁడును దిగ్గన లేచి చేతులుమోడ్చి, "మహాత్మా, నీకిదే స్వాగతము. నన్నేమి చేయుమందువు సెలవిమ్ము." అని యడుగ నాప్రాజాపత్యపురుషుఁడు, "నరపాలా, నీవు దేవతలఁ బూజించితివి కావున వారు సంతసించి యీపాయసము నీకుఁ బంపిరి. ఓ పుడమిఱేఁడా, దీనిని గైకొనుము. ఇది యమరులచేఁ బక్వము చేయఁబడినది. దీనిని భుజించిన, సంతతియు నారోగ్యమునుం గల్గును. ఇది కోరిన కోర్కుల నొసంగును. నీవు సంతతిఁగోరి యీ యాగం బొనరించితివిగదా. ఈ పాయసంబు నీ భార్యల కిమ్ము. వారియందుఁ బుత్రులు జనింపఁ గల"రని పలుకఁగా, దశరథ నృపపుంగవుండు మిక్కిలి యుప్పొంగి, దేవత లిచ్చి పంపిన దివ్యపరమాన్నంబుతోఁ గూడిన యాబంగరుపాత్రమును గైకొని, చూపర

కింపు గుల్కుచుండు నా దివ్యపురుషునికి మీఱిన ముదముతోఁ బ్రదక్షిణనమస్కారంబు లొనరించి, పెన్నిధిగన్న పేదవోలెఁ బరమానందము నొందెను. దివ్యతేజముతో వెలుఁగుచున్న యా ప్రాజాపత్యపురుషుఁ డా పాయసం బిచ్చి యచ్చటనే యంతర్ధానము నొందెను.

ఆ దశరథునియంతఃపురంబెల్ల ఆనందజ్యోతిచే వ్యాపించినదై, శరత్కాలచంద్రునికిరణములచేఁ బర్వఁబడియున్న యాకసంబుమాడ్కి వెలుంగుచుండెను. అంతఃపురాంగన లంగలు తమకుఁ బుత్రోత్పాదన సమర్థమైన పాయసము దొరకె నన్న సంతసంబుతోఁ గూడియుండిరి. దశరథుఁ డంతఃపురంబు ప్రవేశించి, కౌసల్యం జూచి, "దేవీ, యిది దివ్య పాయసము. ఇది మనకుఁ బుత్రోత్పత్తిని గల్గించునది. కావున మీరు దీనిం బుచ్చుకొం"డని చెప్పి యీ క్రిందివిధంబున వారికిఁ బంచిపెట్టెను. ఆపాయసములో సగము కౌసల్య కొసంగెను. ఆ మిగిలిన సగములో సగమును (నాలవభాగమును) సుమిత్ర కొసంగెను. మిగిలినదానిలో సగమును (ఎనిమిదవ భాగమును) కైకేయి కొసంగెను. ఆపిదప, సుమిత్ర కైకేయికంటె నెక్కువగ భుజింపఁదగినదని యెంచి కైకేయి కిచ్చినసగము పోఁగాఁ దక్కిన సగమును (ఎనిమిదవపాలును) మఱల సుమిత్రకే యొసంగెను. ఆ దశరథుని పత్నులందఱు నీపాయసముఁ బుచ్చుకొని సంతసము నొందినవారలై, మహారాజు తమకుఁ బాయసంబు నొసంగుట యొక్క బహుమతిగాఁ దలఁచిరి. అట్లు దశరథుని యుత్తమకాంతలు మువ్వురు వెవ్వేఱుగ నాపాయాసంబుఁ ద్రావి, కొన్ని దినములకు సూర్యుని వలెను, నగ్నిహోత్రునిమాడ్కియుఁ బ్రజ్వరిల్లుచుండునట్టి గర్భంబులఁ దాల్చిరి. అప్పుడు దశరథమహారాజును గర్భము ధరించిన తనపత్నులం జూచి, మనము నుప్పొంగినవాఁడై, రాజర్షులచేతను, సిద్ధగంధర్వ యక్ష కిన్నరాదులచేతను మునిబృందములచేతను గారవింపఁబడుచుండు దేవేంద్రుని మాడ్కి వెలుఁగుచుండెను.

## 17-వ సర్గము

**వానరులను బుట్టింపుడని దేవతలతో బ్రహ్మ చెప్పుట**

భగవంతుఁడగు విష్ణువు మహాత్ముఁడగు దశరథునికిఁ బుత్రుఁడుగఁ బుట్టునట్లు చెప్పి యంతర్ధాన మొందఁగా, బ్రహ్మదేవుఁడు దేవతల నందఱఁ

జూచి, "దేవతలారా! సత్యసంధుఁడును, మహావీరుఁడును, మనయందఱి హితమునుగోరినవాఁడునగు నమ్మహావిష్ణువునకు సహాయముగా బలాఢ్యులును, కామరూపులును, మాయల నెల్ల నెఱింగినవారును, ధైర్యవంతులును, వేగమున వాయువును బోలినవారును, నీతివేత్తలును, విష్ణుతుల్యపరాక్రములును, శత్రువులకు లొంగనివారును, శత్రువుల గెల్చు నుపాయముల నెఱిఁగినవారును, దివ్యదేహులును, సకల శస్త్రాస్త్రముల నెఱిఁగినవారును, అమృతపానము సేసినవారివలె మృత్యువు లేనివారు నైన కుమారులను గంధర్వాంగనలయందును, అప్సరసలయందును వానర రూపంబునఁ బుట్టింపుఁడు. నేను పూర్వము జాంబవంతుఁడను నెలుఁగుబంటులలో మేటిని బుట్టించితిని. అతఁడు నే నావులించు చుండఁగాఁ దటాలున నా నోటినుండి పుట్టెను." అని దేవతలతోఁ జెప్పఁగా దేవతలును, ఋషులును, సిద్ధవిద్యాధరోరగచారణులును బ్రహ్మదేవుని నాజ్ఞ శిరసావహించి వీరులగువానరులను కుమారులనుగాఁ బుట్టించిరి. దేవేంద్రుఁడు మహేంద్ర పర్వతముఁబోలు బలవంతుఁడగు వాలియను వానరశ్రేష్ఠుని బుట్టించెను. సూర్యుఁడు సుగ్రీవుని బుట్టించెను. బృహస్పతి వానరులందఱిలోను బుద్ధిమంతుఁ డని పేరు పొందినవాఁడును, బలవంతులలో శ్రేష్ఠుఁడునైన తారుఁడను వానరుని బుట్టించెను. కుబేరునకు గంధమాదనుఁడను కుమారుఁడు పుట్టెను. విశ్వకర్మ నలుఁడను కపివీరుని బుట్టించెను. అగ్నిదేవునికిఁ దనతో సాటివచ్చు తేజముగల నీలుఁడను వానరుఁడు పుట్టెను. వాఁడు కాంతిచేతను, కీర్తిచేతను, పరాక్రమము చేతను వానరుల నందఱను మించియుండెను. అశ్వి దేవతలు రూపసులయిన మైందద్వివిదుల నిరువురఁ గనిరి. వరుణుఁడు వానరశ్రేష్ఠుఁడగు సుషేణుని పర్జన్యుఁడు మహాబలిష్ఠుఁడైన శరభునిఁ బుట్టించిరి. వాయుదేవునికి వజ్రాయుధంబువంటి దేహముగలిగి, వేగమున గరుత్మంతునికి సాటియై, కాంతిమంతుఁడగు హనుమంతుండను వానరోత్తముఁడు పుట్టెను. ఇవ్విధంబున మితిలేని బలముగలవారును, శూరులును, పరాక్రమవంతులును, గోరినరూపంబు దాల్చు శక్తిగలవారునైన వానరపుంగవులు వేలకొలఁదిగ రావణవధము నిమిత్తమై దేవతలచే సృష్టింపఁబడిరి. మేరుమందర పర్వతములతో సాటివచ్చువారును, బలిసిన శరీరము

గల బలవంతులునైన యెలుఁగుగొడ్లు, కొండముచ్చులును, వానరులును వెనువెంటనే పుట్టిరి. దేవతలకుఁ బుట్టినవానరులందఱు తమ్ముఁబుట్టించిన దేవతలంబోలు రూప సౌందర్య బలంబులు గలవారలై యుండిరి. కొందఱు వానరులు కొండముచ్చులందును, మఱికొందఱు వానరులు ఋక్షాంగనలందును, కొందఱు కిన్నరకామినులందును జనించిరి. ఇట్లు దేవర్షి, గంధర్వ, యక్ష, తార్క్ష్య, పన్నగ, కింపురుష, సిద్ధ, విద్యాధరులు మహాసంతోషభరితులై, సొగసుకత్తెలగు నప్సరలందును, నాగకాంతల యందును, విద్యాధరాంగనలందును, గంధర్వకామినులందును గొప్ప దేహముఁగల్గిన బలవంతులగు వానరులను వేలకొలఁదిఁ బుట్టించిరి. ఇవ్విధంబున దేవతలవలనఁ బుట్టిన యీ వానరు లందఱు తమకోరికకుఁ దగిన రూపంబుఁ దాల్చువారును, బలముగలవారును, సింహశార్దూలముల మాడ్కి బలము గర్వము గలవారును, ఱాళ్ళతోను, చెట్లతోను బోరాటము సేయువారును, గోళ్ళను కోఱలును నాయుధములుగా వాడువారును, సకలాస్త్రంబుల నెఱింగినవారును నై యుండిరి. వారు పర్వతములనైనఁ బగుల మొత్తుదురు. గొప్పచెట్లనైనఁ బెల్లగింతురు. కాలితన్నుతో భూమినైనను బ్రద్దలు సేయఁగల్గుదురు; మహాసముద్రములనైనను దాటుదురు. ఆకసంబున కెగురఁగలరు; మేఘములనైన నందుకొనఁగలరు. మదించి యడవులలోఁ దిరుగుచుండు నేనుఁగులనైనను బట్టుకొందురు. తమయార్పులచే నాకసమునఁ బోవుపక్షులను నేలఁబడఁ జేయుదురు. మహాత్ములు కామరూపులునగు నిట్టి వానరవీరులు కోట్లకొలఁదిగ జనించిరి. వీరిలో వానరశ్రేష్ఠులు కొందఱు వానరుల కెల్లఁ బ్రభువులై, తాము మఱికొందఱను బుట్టించిరి. ఇట్లు పుట్టిన వానరు లందఱు నానావిధ పర్వతములను, అనేకారణ్యములను జొచ్చి, వాలి సుగ్రీవులను దమకు రాజులనుగను, నలుఁడు, నీలుఁడు, హనుమంతుఁడు మొదలగు వానరులను మంత్రులనుగను సేవించుచు, వారి యాజ్ఞలప్రకారంబుగ నడుచుకొనుచు ఋక్షవంతమను పర్వతమునందు నివసించుచుండిరి. మఱికొంద ఱచ్చటచ్చట నుండు కొండలను, నడవులను జేరి యచ్చటఁ దిరుగుచు నచ్చట నున్న సింహవ్యాఘ్రాదులనుగూడఁ దమ బలగర్వముచే నొంచుచుండిరి. విస్తార పరాక్రమము గలవాలి యా

వానరవీరుల నందఱిఁ దన భుజబలముచేఁ బాలించుచుండెను. నానారూప ధారులయి, పర్వతములను, మేఘములను బోలియుండు వానరులు రామునికి సాయము చేయునిమిత్తము పుడమి యంతయు నిండియుండిరి.

## 18-వ స ర్గ ము

### శ్రీ రామాదుల యుత్పత్తి

ఆ మహాత్ముండగు దశరథుని యశ్వమేధంబును, బుత్రకామేష్టియు ముగియఁగనే, దేవత లందఱు హవిర్భాగంబులఁ గైకొని, తమ తమ యునికిపట్లకుఁ బోయిరి. అంత దశరథుఁడును యజ్ఞదీక్షా నియమంబుఁ బూర్తిచేసి, భార్యలతోఁ గూడినవాఁడై, సేవకులు, సేనలు, గజాశ్వములు వెంటరాఁ బురంబుఁ జొచ్చెను. యాగంబు చూడవచ్చిన రాజులందఱు దశరథుం డొనర్చు పూజలుగైకొని, ఋషిశ్రేష్ఠుఁడగు ఋశ్యశృంగునకు మ్రొక్కి ముదంబుతోఁ దమతమ దేశముల కేఁగిరి. అప్పుడు మహానందముతో నయోధ్యనుండి తమ పురంబుల కేఁగుచుండు రాజుల సేన లన్నియు శుభ్రవస్త్రములఁ దాల్చి, మనంబుల సంతోషించుచు, వెలుఁగుచుండినవి. రాజు లందఱు పయనమైనతర్వాత దశరథనృపాలుఁడు బ్రాహ్మణోత్తములతోఁగూడఁ బట్టణముఁ బ్రవేశించెను. అంత ఋశ్యశృంగ మహామునియు దశరథునిచే గొప్పమర్యాదలు వడసి, శాంతను దోడ్కొని, దశరథుఁడు పరివారముతోఁగూడ సాగనంపఁగా, తన యాశ్రమమునకుఁ బయనమై పోయెను. ఇవ్విధంబున రాజుల నందఱఁ బంపి, దశరథుఁడు నెమ్మదితోఁ గూడి, పుత్రజననమును గూర్చియె యాలోచించుచుండెను. యాగము ముగిసిన తర్వాత నొకసంవత్సరము గడచినది. అంతఁ గౌసల్యాదేవి, పండ్రెండవనెలను చైత్రమాసమునందు నవమినాఁడు, పునర్వసు నక్షత్రమున సూర్యాంగారకశని బృహస్పతి శుక్రులేవురును దమ దమ యుచ్చస్థానములగు మేష, మకర, తులా, కర్కాటక మీనరాసులందుండఁగా, బృహస్పతి చంద్రులున్న కర్కాటక లగ్నమునందు నెల్లలోకముల రక్షకుఁడును, సకలజనులచేతను మ్రొక్కఁబడువాఁడును, శుభలక్షణంబు లన్నింటితో నొప్పినవాఁడును, ఇక్ష్వాకువంశమును వృద్ధినొందించువాఁడును, గొప్ప యదృష్టశాలియునైన విష్ణువులో సగము భాగమునునైన పుత్త్రుని గనెను. అట్టి తేజోవంతుఁడగు

కొమరుండు గలుగుటచే నా కౌసల్య, దేవేంద్రునిఁ గన్నయదితివోలె వెలుఁగుచుండెను. అంతఁ గైకేయి దృఢపరాక్రముఁడును, సుగుణములతో నిండినవాఁడును, తేటమైన తెల్విగలవాఁడును, విష్ణ్వంశములో నెనిమిదవ భాగమునగు భరతుఁడు పుష్యమీనక్షత్రమున మీనలగ్నమునం బుట్టెను. అంత శూరులును, సకలాస్త్రముల యందును నేర్పుగలవారును నైన విష్ణ్వంశమున నర్ధాంశమువా రయిన లక్ష్మణ శత్రుఘ్నులు ఆశ్లేషా నక్షత్రమునఁ గటకలగ్నమున మధ్యాహ్నకాలమున సుమిత్రకు జనించిరి. ఇట్లా దశరథనృపతికి జన్మించిన గొప్పస్వభావము గలవారును, సుగుణములచే నొప్పినవారును, అనుకూలురునైన పుత్రులు కాంతిచేఁ బూర్వాభాద్రోత్తరాభాద్రా రూపములగు నాలుగు నక్షత్రములవలె వెలుఁగుచుండిరి. దశరథునికిఁ బుత్రులు గలుగఁగనే గంధర్వులు మధురముగా గానముసేసిరి. అప్సరసలు నాట్యమాడిరి. దేవతల భేరీవాద్యములు మ్రోగినవి. ఆకసంబునుండి పూలవాన గురిసినవి. అయోధ్యాపురమునందలి జనులు గొప్పవేడుకలు సలిపిరి. రాజవీథులందు జనులు క్రిక్కిరిసిరి. నటనర్తకు లాడుచుండిరి. గాయకులు గానముచేయుచుండిరి. దశరథుఁడు పుత్రోత్పత్తి శ్రవణకుతూహలంబుచేఁ బౌరాణికులకును, వంశావళిఁ బాడువారికిని, స్తుతిపాఠకులకును విశేషముగ బహుమతులను, బ్రాహ్మణులకు విశేషధనమును, లెక్కలేని గోవులను నొసంగెను. అంత లక్ష్మణుఁడు పుట్టిన పదునొకండవనాఁడు (అనఁగా పండ్రెండవదినంబున) దశరథ నృపాలుండు వసిష్ఠుని బిలిపించి, తనకుమారులలోఁ గౌసల్యకుమారునికి రాముఁ డనియుఁ, గైకేయి కుమారునకు భరతుం డనియు, సుమిత్ర కొడుకుల కిద్దఱికి వరుసఁగా లక్ష్మణ శత్రుఘ్నులనియు నామకరణంబులు నేయించి, జాతకర్మ మొదలగు సర్వకర్మముల జరిపించి, యనంతరము బ్రాహ్మణులకుఁ, బురములలో నేమి, పల్లెలలో నేమి యుండు సకలజనులకు నన్నప్రదానము నేయించి, బ్రాహ్మణులకు విశేష ద్రవ్యమును, లెక్కలేని మణులను నిచ్చెను. వారలోఁ బెద్దయగు రాముఁడు, తండ్రి కానంద మొసఁగఁజేయుచు, సకల జనులకు నిష్టుఁడయి బ్రహ్మదేవుని చందమున వెలుఁగుచుండెను. ఆ కొడుకులలోఁ బెద్దవాఁడగు రాముఁడు కేతనముపోలెఁ బ్రకాశించుచుఁ దండ్రికి సంత

సము గావించుచు బ్రహ్మ చందమున నందఱిజనుల కొప్పినవాఁడుగ నుండెను. ఆ యన్నదమ్ములు నలుగురును వేదములఁ జదివి, జనుల కందఱకు మేలొదవు కార్యములం జేయుచుఁ దెలివితేటలు గలవారు, సుగుణములతో నిండినవారునయి యుండిరి. వారిలో నందఱిలోను శ్రీరాముఁడు యథార్థపరాక్రమము గలిగి, యొచ్చెములేని పున్నమ చందురునిం బోలె జనుల కందఱకుఁ గోరఁదగినవాఁడై. యేనుఁగుమీఁద నెక్కుటయందును, గుఱ్ఱపువారియందును, దేఱు నడుపుటయందును, విలువిద్దెయందును గట్టినేర్పులఁగల్గి, తండ్రికి శుశ్రూష యొనర్చుటయందు శ్రద్ధ గలిగియుండెను. కాంతి నొసఁగఁజేయునట్టి లక్ష్మణుండు పసితనము మొదలు జనుల కిష్టుఁడైన తన యన్నయగు శ్రీరామునియందే యెల్లప్పుడు ప్రేమముఁగలిగి, యాతని కిష్టమగు కార్యములం జేయుచు వేఱగు నతని వెలుపటి ప్రాణమా యనఁదగియుండెను. ఆ శ్రీరాముఁడా లక్ష్మణుని బాసి నిద్ర చెందఁడు. పాయసాన్నము పెట్టినను దినఁడు. శ్రీరాముఁడు గుఱ్ఱము నెక్కి వేఁటకు బయలువెడలినప్పుడు లక్ష్మణుండు విల్లు చేతఁ బూని యతనిని వెంబడించును. లక్ష్మణుఁడు రాముని కెట్లో యట్లు భరతునకు లక్ష్మణుని తమ్ముఁడగు శత్రుఘ్నుఁడును, బ్రాణముల కంటెఁ బ్రియుఁడుగ నుండెను. ఆ నలుగురు పుత్రులును తెలివితేటలతోఁ గూడి, సకలసుగుణములు గలవారలై, పెద్దలకడ లజ్జయు, మంచి పేరును గలిగి, విషయముల నెల్ల నెఱిఁగి, మీఁదఁ జేయఁదగు పనులఁ గూర్చి బాగుగ నాలోచించుచు నెక్కువ సామర్థ్యముతో వెలుఁగుచుండఁగా నట్టి కుమారులఁ గన్న దశరథుఁడు దేవతలచేఁ జుట్టఁబడిన బ్రహ్మలోకాధిపతియగు పరమేష్ఠివోలె వెలుఁగుచు సంతోషపడుచుండెను. శ్రీరామాదులును వేదశాస్త్రాభ్యాసము చేయుచు, విలువిద్దెయందుఁ బేరు వడసినవారలై, తండ్రికి నిరంతరము శుశ్రూష చేయుచు నుండిరి. అంత వారికిని యౌవనము ప్రాదుర్భవించెను.

అంత దశరథనృపాలుఁడు పురోహితుఁడగు వసిష్ఠుని, మంత్రులను, చుట్టాలను బిలిపించి, ఆ యందఱితోను దనకుమారుల వివాహమునుగూర్చి యాలోచించుచుండెను.

ఇవ్విధంబున మహాత్ముఁడగు దశరథుఁడు మంత్రుల నడుమనుండి యాలోచించుచుండఁగా నప్పుడు మిక్కుటమగు బ్రహ్మతేజస్సుగల విశ్వామిత్రమునీంద్రుఁ డరుగుదెంచి, రాజుగారి దర్శనంబు సేయఁగోరి, పరిచారులఁ జూచి, "ఓ ద్వారపాలకులారా, కుశికవంశమునఁ బుట్టిన గాధిరాజ తనూజుఁడగు విశ్వామిత్రుఁడు వచ్చియున్నాఁ"డని వేగముగ మీ మహారాజున కెఱిగింపుఁ డని చెప్పెను. ఆమాట విని ద్వారపాలకులు తత్తరపడుచు రాజు నగరులోపలికిఁ జొచ్చి, యిక్ష్వాకు వంశోద్భవుఁ డయిన దశరథనృపాలునికి విశ్వామిత్రమహాముని వచ్చి యున్నాఁడని యెఱింగించిరి. అంత నృపాలుఁడు వారిమాటలు విని పురోహితుని దోడ్కొని జాగ్రత్తతో దేవేంద్రుఁడు బ్రహ్మదేవునిం బోలె నమ్మహామునిని నెదుర్కొని, తీవ్రమగు తపస్సుచేతను, గఠిన నియమముచేతను, జ్వలించుచున్న విశ్వామిత్రుని జూచి, మనమున ముదమునొందుచు నర్ఘ్యపాద్యాదులచేఁ బూజ లొనరించెను. విశ్వామిత్రుఁడును శాస్త్రవిధానమునఁ జేయఁబడిన యర్ఘ్యపాద్యాది సత్కారములఁ గొని, దశరథ నృపాలుని "నీకుఁ గుశలమా? నీ క్షేమియు నపాయంబులు లేవుగదా? మహారాజా! నీ పురజనులు సుఖముగా నున్నారా? పల్లెలలోని జనులు క్షేమమా? నీచుట్టములు, నీ మేలు గోరెడి మంత్రులు మొదలగువారును గుశలముగా నున్నారే? నీ బొక్కసము నిండి యున్నదిగదా? నీచుట్టుపట్ల నుండు రాజులు నీకు లొంగియున్నారే? నీకు శత్రువులు లేరుగదా? నీవుచేయు యజ్ఞయాగాది దేవకార్యములును, సామాద్యుపాయములును గలిసి వచ్చుచున్నవా?" యని కుశలమడిగి వసిష్ఠమహామునికడ కేఁగి, యమ్మహామునినిఁ, దక్కినబుషులను గుశలమడిగెను. అంతట వారందఱు సంతోషభరితులై రాజభవనము సొచ్చి యచ్చట వారు చేసిన మర్యాదలఁ గైకొని, తమతమ యోగ్యతకుఁ దగిన యాసనములందుఁ గూర్చుండిరి.

అంత గొప్ప మనస్సుగలవాఁడగు దశరథమహారాజు మనంబున నానందము నొందుచు విశ్వామిత్ర మహామునిని గారవించి యిట్లనియె. "ఓ మహామునీ, అమృతము దొరకుటయు, నీరు లేనిచోట వాన గురియుటయు, బిడ్డలు లేనివానికిఁ దన సజాతీయలగు భార్యలందుఁ బుత్రులు



విశ్వామిత్రుఁడు రాముని యాచించుట. బా—55

గలుగుటయు, నష్టపడినవానికి లాభము వచ్చుటయుఁ, బోయిన వస్తువు మఱలఁ జిక్కుటయు, గొప్ప యుత్సవాదులందు సంతసంబునొందుటయు నెంత వేడుకఁ గావించునో, యట్లే నీరాకయు నామనమున కమితోత్సాహమును గలిగించుచున్నది. నీవు సుఖముగా వచ్చితివిగదా! నాకిపుడు దేహ మానందపరవశమై గగుర్పాటొందియున్నది. మీకోరిక నేనేమి తీర్పవలయును? ఓ కౌశికమునీంద్రా! నీవు నాకు దానయోగ్యుఁడవయితివి. నాభాగ్యవశంబుననే నీ విచ్చటికేతెంచితివి. ఇపుడు నాజన్మము సఫలమయ్యె. నాబ్రదుకు మంచిబ్రదుకు. తొల్లి నీవు రాజర్షియని చెప్పఁబడుచుండి, పిమ్మట దుష్కరమగు తపమొనర్చి తపస్సువలనఁ గలిగిన తేజంబుచే వెలుఁగుచు బ్రహ్మర్షి యని పేరొందితివి. నాకు నీవు సకలవిధములఁ బూజ్యుఁడవు. కావున నీరాక మిక్కిలి యాశ్చర్యముగ నున్నది. నాగృహము నీరాకచేఁ బరమపావనమయ్యెను. ఓనిగ్రహానుగ్రహసామర్థ్యముగలవాఁడా! నీదర్శన విశేషమున నేను శుభక్షేత్రము నొందినవాఁడ నయితిని. నీ విచ్చటి కేమికార్యంబుఁ దలపెట్టివచ్చితివి? ఆ కార్యంబుఁ దెలుపుము. నీ వనుగ్రహించిన నాకార్యము సఫలమొనర్చెదను. ఓ కుశికవంశజుఁడా! యీతఁడు మనకార్యంబు సేయఁగలఁడో లేఁడో యనువిచారము సేయవలదు. నీవు నాకుఁ బరమదేవతవు గావున నే నెట్టి కార్యంబునైనను లోపము లేకుండఁ జక్కపెట్టెదను. ఓ ద్విజశ్రేష్ఠా! నాకు నీరాక యనునది గొప్ప భాగ్యంబుచేఁ గలిగినది. నీరాకవలన సకల శ్రేష్ఠధర్మంబులును నాకు దొరకినవి" అని బుద్ధిశాలి యగు దశరథ మహారాజు చెప్పిన మనోహరమును శ్రావ్యమునునైన వినయపూర్వకమునునగు మాట విని, సకలగుణవంతుఁడును బ్రహ్మర్షి యని ప్రసిద్ధి నొందినవాఁడునునైన విశ్వామిత్ర మునీంద్రుఁడు పరమానందము నొందెను.

## 19-వ సర్గము

**విశ్వామిత్రుఁడు యాగరక్షణంబునకై రాముని యాచించుట**

ఇవ్విధంబున దశరథమహారాజు సకలజను లాశ్చర్యపడునట్లు చెప్పిన వాక్యమును విని, బ్రహ్మతేజంబుగల విశ్వామిత్ర మునీంద్రుఁడు సంతసముచే గగుర్పాటొందిన మేనుగలవాఁడై, దశరథనృపాలునితో

నిట్లనెను:—ఓ రాజశ్రేష్ఠుఁడా, ఇక్ష్వాకువంశమునఁ బుట్టి వసిష్ఠునివలన నుపదేశంబు నొందినవాఁడవై యున్న నీకు నిట్టివాక్యము తగును గాని పుడమిలో నితరుల కిది తగునే? రాజశ్రేష్ఠుఁడా! నే నేమి మనమునఁ దలంచి యిచ్చటికి వచ్చితినో, యాకార్యంబు నెఱవేర్చి, సత్యసంధుఁడవు గమ్ము. నే నొక కార్యసిద్ధిని దలఁచి యొక యాగంబుఁ బూనితిని. దానికి విఘ్నము గావింపఁ గామరూపము దాల్చు నిద్దఱు రక్కసు లేర్ప డిరి. వారు బలశాలులు; పరాక్రమవంతులు; ధనుర్విద్యయందు నేర్ప రులు. నేను యజ్ఞ దీక్ష వహించి, వ్రతము పరిసమాప్తి నొందు సమయ మునకు నీ రక్కసు లిరువురు యజ్ఞవేదికపై రక్తమాంసములను గుమ్మ రించి, యాయజ్ఞవేదిక నపవిత్రము చేసిరి. అట్లు నా వ్రతసంకల్పము పాడైపోఁగా, నేఁ జేసిన ప్రయత్నమంతయు విఫలమాయెఁగదా యని చిన్నపోయి, యా ప్రదేశము వదలి యిట కేతెంచితిని. పుడమిఱేఁడా! వారియెడఁ గోపంబు సూప బుద్ధిపొడమ దయ్యె. ఆ వ్రత సంకల్పంబట్టిది, అప్పుడు కోపపడరాదు గాన వారికి శాప మొసఁగ రాదయ్యె.

ఈ విషయమున నాకు సహాయపడుటకై నీ పెద్దకుమారుని రాజ సింహుఁడైన శ్రీరాముని బంపుము. ఇతఁడు పిల్లజుట్టువాఁ డయినను, మంచి మగటిమి గలశూరుఁడు. నే నీతని నమోఘమైన నానిజతేజ ముతో రక్షించు చుండఁగా నీతఁడు నాయజ్ఞమునకు విఘ్నకర్తలైన యా రక్కసుల నందఱనుగూడ నాశము చేయుటకు సమర్థుఁడై యుండును. సంశయము లేదు. ఇదికాక, నీకుమారునికి ముల్లోకంబు లందును గీర్తిఁ దెచ్చు పలువిధములగు శ్రేయస్సులను గావించెదను. యుద్ధములో రామునియెదుట నా మారీచసుబాహువులు నిలువఁ జాలరు. రామునికంటె నన్యులు నారక్కసులను సంహరింపఁజాలరు. ఆ దురాత్ములయిన రక్కసు లిరువురుఁ దమకంటె బలముగలవారు లేరని గర్వించి మృత్యువాతఁ బడ నున్నారు. ధైర్యశాలియగు రామునితో నెదిరించి యుద్ధముచేయఁజాలరు. "రాజశ్రేష్ఠా, కొడుకు పసివాఁడే యని తలంపకుము. ఆరాక్షసు లిరువురి రామునిచేఁ జచ్చి రని యెఱుఁగుము. ఇట్లని నేను శపథము చేయుచున్నాను. సత్యపరాక్రముఁడనియు, గొప్ప ధైర్యశాలి యనియు నే నెఱుఁగుదును. మీ కులగురువగు వసిష్ఠుఁ

డెఱుఁగును. ఇంకను నావంటి తపోనిష్ఠగల మునులంద ఱెఱుఁగుదురు. రాజేంద్రా! నీవు ధర్మవృద్ధిని, భూలోకంబున నెక్కుడుకీర్తిని శాశ్వతముగఁ బొందఁగోరుదువేని, రాముని నాతోడఁ బంపుట కియ్యకొనుము. కకుత్స్థవంశోద్భవుఁడవైన దశరథనృపాలా! నీయభిప్రాయమును నీమంత్రులును, నీగురువగు వసిష్ఠుఁడును నొప్పుకొందురు. కావున రాముని నాతోఁగూడ నంపుము. నీకు ముద్దులపట్టియైనను, రాముని యాగసంరక్షణము నిమిత్తము పదిదినంబులు నావశంబున నుండ సమ్మతింపుము. నాయజ్ఞకాలము మించిపోకుండునటులాగునఁ జేయుము. వ్యసనంబున మనంబు నుంచకుము." అని యివ్విధంబున ధర్మాత్ముఁడును, విస్తారమైన తేజంబుగలవాఁడును నైన విశ్వామిత్రమునీంద్రుఁడు దన యాగసంరక్షణముకొఱకును, జనుల మేలుకొఱకును దశరథమహీపాలు నివ్విధంబున నడిగి యూరకుండెను. అంత దశరథనరపాలుఁ డమ్మునీంద్రుఁడు పల్కిన శుభవాక్యమును విని, తన కాపలుకులు గుండెలు బ్రద్దలుసేయునవిగా నున్నందునఁ గడుశోకమునొంది, భయముతో మిగులఁ జింతించి, సింహాసనమునుండి లేచి గడగడవణఁకెను.

## 20-వ స ర్గ ము

దశరథమహారాజు విశ్వామిత్రునకు బదులుసెప్పుట

అవ్విధంబున విశ్వామిత్రమునీంద్రుఁడు పల్కిన వాక్యమును విని, దశరథమహారాజొక్కముహూర్తకాలము మూర్ఛనొందియుండి యంతఁ దెప్పిరిల్లియమ్మహామునితో నిట్లనెను:—"ఓ మునీంద్రా, తామరరేకులంబోలు కన్నులుగల నాబిడ్డఁడగు రాముని కింకను బదునాఱేండ్లయినను నిండలేదు. వానికి విలువిద్దెయం దంత యభ్యాసమును లేదు. రాక్షసులతో యుద్ధము చేయునంత యూహగూడ లేదని తలంచెదను. నాకొకయక్షౌహిణి సేన యున్నది. ఈసేనను దోడ్కొనివచ్చి, నేను ఆరక్కసులతో యుద్ధముసేసెదను. ఈ నాసేవకులు మగటిమిగలవారు. పగతురముట్టడింపఁ జాలుదురు. అస్త్రములనెల్ల నెఱింగినవారు. రక్కసులు గుంపులుగుంపులుగాఁ గూడి వచ్చినను యుద్ధము సేయఁగలవారు. తాము రాముని వెంటఁబెట్టికొని పోఁజనదు. నేనే విల్లు చేతఁగొని నాబొందిలోఁ బ్రాణములున్నంతవఱకు నారాక్షసులతోఁ బోరెదను. నీవ్రతచర్య

సురక్షితమై నిర్విఘ్నముగా సాగఁగలదు. కనుక నేను నీవెంటవచ్చెదను. రాముని బంపఁజాలను. రాముఁడు పసివాఁడు; విలువిద్య నేఱనివాఁడు; పగతుర బలాబలములను దెలియలేఁడు. అస్త్రబలము చాలదు. యుద్ధము నందు నేర్పరి గాఁడు. ఈపసికూన రాక్షసులతో యుద్ధము చేయఁదగిన వాఁడు గాఁడు. ఆరక్కసులు నిజముగాఁ గపటయుద్ధము చేయుటలోఁ గడుసమర్థులు. ఓమునిపుంగవా! నేను రాము నెడఁబాసి యొకనిముస మైనను మనఁజాలను. రాముని మీతోడఁ బంపఁజాలను. అట్లుగాక రామునే తోడ్కొనిపోవలె నని తలంతువేని చతురంగబలముతోడ నన్నుఁగూడ నతనివెంటఁ దీసికొనిపొమ్ము. నాకఱువది వేలయేండ్లకెన్ని యో కడగండ్లతో నీరాముఁడు జన్మించెను. కనుక రాముని నీవు తీసి కొనిపోఁదగదు. నా నలువురు కొడుకులలో నీతనియందే నా కెక్కుడు ప్రేమ. ఇతఁడు పెద్దవాఁడు. ధర్మప్రధానుఁడు. కావున నిట్టిరాముని నీవు తీసికొని పోఁజనదు. ఆరాక్షసు లెవ్వరు? వా రెవ్వరికొడుకులు? యెంత యొడ్డుపొడుగు గలవారు? వారిపరాక్రమం బెంతమాత్రము? వారిని రక్షించువా రెవ్వరు? ఆమాయాయోధులగు రక్కసులతో రాముఁడు గాని, నాసేనలుగాని, నేనుగాని యేమిచేయవలయును? దుస్స్వభావు లగు నారక్కసులతో యుద్ధము చేయునపుడు నే నెట్లుండవలయును? వారు మిక్కిలి పరాక్రమవంతులు. ఓ మహాత్మా! యా సంగతి నెల్లఁ దెలియఁజెప్పుము" అని దశరథుఁ డడుగఁగా, విశ్వామిత్రమునీంద్రుఁ డిట్లనియె. "ఓ నరపతీ! వినుము. పులస్త్యబ్రహ్మవంశమునఁ బుట్టిన రావణుఁ డను నసురుఁ డొకఁడు గలఁడు. అతఁడు బ్రహ్మనుగూర్చి యుగ్రతప మొన రించి, మనుష్యులకుఁదక్కఁ దక్కినవారికి వధ్యుఁడు గాకుండునట్లు వరము బడసి, యెక్కువ బలపరాక్రమములతోఁగూడి, రక్కసు లనేకులఁ జేర్చు కొని మూఁడులోకంబులను గడునిడుమలఁ బెట్టుచున్నాఁడు. రాక్షసా ధిపుఁడైన రావణుఁడు కుబేరునికి సాక్షాత్తుగఁ దమ్ముఁడనియు, విశ్రవసుని కొడుకనియు, మహాపరాక్రమశాలియనియు నీవు వినియుందువుగదా, ఎప్పు డారావణునకుఁ దానుగా యజ్ఞవిఘాతంబు సేయ వలనుపడదో, యప్పుఁడు వాని ప్రేరణవలనఁ గడుబలశాలులగు మారీచసుబాహువు లనెడు నిరువురు రక్కసులు బయలుదేరివచ్చి యజ్ఞమునకు విఘ్నము

లోనరింతురు" అని విశ్వామిత్రమహర్షి చెప్ప, నప్పలుకు లాలకించి, "ఓ మహానుభావా! యాక్రూరస్వభావుఁడైన రావణుని యెదుట నేనే నిలువనోపను. నాపసిపాపనియందును, అల్పభాగ్యుఁడయిన నా యందును దయయుంచి, మమ్ము వదలుము. నీవు మాకు గురుండవు. దేవతవు. కోపము చేయవలదు. దేవ దానవ యక్ష గంధర్వ పన్నగ వైనతేయాదులు గూడ యుద్ధరంగమున నా రావణునియెదుట నిలువ నోపరు. అట్లుండ మనుష్యు లేమి? యుద్ధములో నతనియెదుట నిలుచుట యేమి? ఆరావణుఁడు యుద్ధరంగమున నెదుట నిల్చినవారిబలమును లాగఁగలఁడు. నాసేనలతోఁగాని, నాపుత్త్రులతోఁగూడఁ గాని వచ్చి నే నారావణునితోఁ బోరాడఁజాలను. కనుక దేవతాతుల్యుఁడును, యుద్ధ మన నేమియో యెఱుఁగనివాఁడును నగు, నారాముని బసిపాపని నాచిన్నకుమారుని నీతో నెంతమాత్రము పంపఁజాలను. మఱియు సుందోపసుందుల పుత్త్రులైన యా మారీచ సుబాహులు యుద్ధరంగ మున యమునికి సాటివచ్చువారలు. వారు నీయాగంబునకు విఘ్నము గావించిన గావింతురు కాక. నాకొడుకును నీతోడఁ బంపఁజాలను. ఆ సుబాహు మారీచులు విలువిద్య చక్కఁగా నెఱింగిన పరాక్రమ శాలులు. నేను నాసేనలతోఁ గూడివచ్చి, వారిలో నొక్కనితోఁ బోరాడఁగల్గుదును." అని దశరథుఁ డీమాట చెప్పఁగా, కుశికసూనుఁ డగు విశ్వామిత్త్రున కత్యాగ్రహము వచ్చెను. ఆకోపంబుచే నాజ్యా హుతిని బ్రజ్వరిల్లు నగ్నిహోత్త్రుని చందమున నమ్మహర్షి మండిపడెను.

## 21-వ సర్గము

### వసిష్ఠమహాముని వాక్యము

అంతటఁ గుశికనందనుఁడైన విశ్వామిత్త్రుఁడు కోపముచేఁ గన్ను లెఱ్ఱఁజేసి, లలాటం బదురఁ గనుబొమ్మలు ముడిపెట్టి, పండ్లు పటపటఁ గొఱుకుచు, దశరథమహీనాథునిం జూచి "ఓ మహారాజా! మొదట నీవేది యడిగిన నది యిత్తునని ప్రతిజ్ఞచేసి, యట్టి ప్రతిజ్ఞ నెఱవేర్పక విడిచిపెట్టఁ గోరుచున్నాఁడవు. రఘువంశోత్పన్నులయినవారి కిది విప రీతము. ఓ నరేంద్రా! మొదట నొప్పుకొని పిమ్మట లేదనుట నీకు యుక్తమగునేని, నేను వచ్చినట్లె మఱలిపోయెదను. నీ వాడినమాట

తప్పువాఁడ వని లోకంబునఁ బేరొంది, బంధుమిత్రాది సహితంబుగ సుఖం బుండుము" అని చెప్పి యత్యాగ్రహగ్రస్తుఁడై లేచెను. ఆ జ్ఞానవంతుఁడైన విశ్వామిత్రమునీంద్రుఁడు రోషాక్రాంతుఁడయి లేవఁగనే భూమి యదరెను. దేవతలందఱు వెఱచిరి. అప్పుడు నియమవంతుఁడును, ధైర్యశాలియు నైనవసిష్ఠమునీంద్రుఁడు విశ్వామిత్రుని యాగ్రహమునకు లోకమెల్ల నడలియుండుటను జూచి, మహారాజుతో నిట్లనెను. "ఓ నృపాగ్రణీ! ఇక్ష్వాకు వంశంబునఁ బుట్టి, రెండవ ధర్మదేవత యని ప్రసిద్ధికెక్కి, ధైర్యవంతుఁడవై యుండి, సత్యపరిపాలనాది నియమములు గలిగి, శ్రీమంతుఁడవయి యుండియు ధర్మమార్గముఁ దప్పఁగోరుచున్నాఁడవు. రఘువంశజుఁడా! ధర్మాత్ముఁడ వని ముల్లోకంబులఁ బ్రసిద్ధికెక్కినవాఁడవు. కావున స్వధర్మంబుఁ బాయకుము. అధర్మంబుఁ జేకొనకుము. ఏది చెప్పినను జేసెద నని మొదట పలికి పిమ్మట వెనుదీయువానికి సకలయాగముల ఫలమును, కోనేళ్ళు, బావులు, గుంటలు, చెఱువులు మొదలగువానిఁ ద్రవ్వించిన ఫలమును నశించిపోవును. కావున రాముని విశ్వామిత్రునితోఁగూడఁ బంపుటకు వెనుదీయకుము. రాముఁ డస్త్రముల నేర్చినవాఁడు కానిమ్ము, నేర్వనివాఁడు గానిమ్ము, విశ్వామిత్రుని కాఁపుదలలో నుండఁగా నాతని నగ్నిహోత్రునిచే రక్షితమైన యమృతమునుంబోలె రాక్షసు లేమియుఁ జేయఁజాలరు.

## వసిష్ఠమహాముని విశ్వామిత్రుని ప్రభావంబు దశరథునితో వర్ణించి చెప్పుట

"ఓరాజేంద్రా! ఈవిశ్వామిత్రమహర్షి రూపముదాల్చిన ధర్మదేవత. ఇతఁడు వీర్యవంతులలో నుత్తముఁడు. లోకంబున బుద్ధియం దందఱను మించినవాఁడు. ఇతఁడు తపమున కుత్తమస్థానము. చరాచరాత్మకమయిన యీప్రపంచమున నితఁడు సకలవిధాస్త్రముల నెఱింగినవాఁడు. ఇతనిని నితరు లింతకుము న్నెఱిఁగినవారు లేరు. ఇఁకమీఁదను నెవ్వ రెఱుఁగఁజాలరు. దేవాసుర యక్ష రాక్షస గంధర్వ కిన్నర పన్నగాదు లెవ్వరు నీతని ప్రభావ మెఱుఁగరు. విశ్వామిత్రుఁడు రాజ్యపరిపాలనము సేయుచుండఁగా, శివుఁడు పరమధర్మిష్ఠులును, సర్వాస్త్రరూపులునగు భృశాశ్వుని పుత్రులు నూఱుగురుని ఈ విశ్వామిత్రుని కొసఁగెను. ఆభృశాశ్వుని పుత్రులు దక్షప్రజాపతియొక్క కూఁతులకుఁ బుట్టినవారు. పలు

తేజఃగులగు రూపంబులఁ దాల్చినవారు. మహావీరులు. ప్రకాశముగల వారు. జయముఁ గూర్చువారు. తొల్లి దక్షప్రజాపతికి జయ, సుప్రభ యను పేరులుగల యిరువురు కూఁతు లుండిరి. వారిరువురికి మిక్కిలి వెలుఁగుచున్న నూఱస్త్రములు పుట్టినవి. మొదట జయ యనునది యసురవధము నిమిత్తమై, మితిమీఱిన ప్రభావముగలిగి యిచ్ఛవచ్చిన రూపముఁ దాల్చు నేఁబదుగురు పుత్రులను గనెను. సుప్రభయు శత్రువులకు లొంగనివారును, లోఁచుట కలవికానివారును, బలవంతు లును నైన సంహారు లనెడి యేఁబదుగురు పుత్రులను గనెను. సకల ధర్మముల నెఱింగిన విశ్వామిత్రుఁ డన్నియస్త్రములను యథావిధిగ నెఱిఁ గినవాఁడు. క్రొత్తయస్త్రములఁ గల్గించుటయందును నేర్పుగలవాఁడు. ఎక్కువ ప్రకాశముగలవాఁడు. అన్నిదెసలందు వ్యాపించిన కీర్తిగల వాఁడు. ఇట్టిమహిమగల విశ్వామిత్రునివెంట నీకొడుకును రాముని౯ బంపుటకు సంశయింపకుము. విశ్వామిత్రుఁడే యారక్కసుల నెదిరించుట యందుఁ జాలిన వాఁడు; అయినను నీపుత్రుల మేలుగోరియే నీకడకు వచ్చి యాచించుచున్నాఁడు." అని వసిష్ఠమహాముని చెప్పినమాటచేతఁ గలఁకఁదేఱినవాఁడై దశరథుఁడు నిర్మలహృదయముతో నుప్పొంగి, ప్రఖ్యాతి నొందఁగోరి, రాముని విశ్వామిత్ర మునీంద్రుని వెంటఁ బంపు టకు సమ్మతించెను.

## 22.వ సర్గము

దశరథుఁడు రామ లక్ష్మణులను విశ్వామిత్రునితోఁగూడఁ బంపుట

అట్లు వసిష్ఠమహాముని చెప్పఁగనే, దశరథనృపాలుఁడు చిఱు నగవుమోముతో రాముని లక్ష్మణునితోఁగూడఁ బిలుచుకొనిరమ్మని యానతిచ్చెను వారు రాఁగానే తానును దల్లులును శిరంబున ముద్దిడి కొన్నపిదపఁ బురోహితుఁడగు వసిష్ఠమహామునియు నక్కుమారులకు మంత్రపూర్వకముగా మంగళాశీర్వాదములు చేసెను. వెంటనే దశర థుఁడు మనమున నేమియు గలవరంబు పెట్టుకొనక, మనఃపూర్వకముగాఁ దన యిరువురు కొడుకులను విశ్వామిత్రుని వశమున నొప్పగించెను.

విశ్వామిత్రుఁడు రాముని గయికొన్నప్పుడు శుభసూచకముగా మలయమారుతము దుమ్మురేపక, మిక్కిలి యుల్లాసకరంబుగాఁ జల్లఁద

నము, సువాసన, తిన్నదనము నను మూడుగుణములు గలదై వీచు చుండెను. ఆకాశమునుండి విశేషముగాఁ బూలవాన గురిసెను. దేవ దుందుభులు మ్రోఁగినవి. మొదట విశ్వామిత్రమునీంద్రుఁడరిగెను. ఆయనవెంబడి రాముఁడు విల్లు ధరించిపోయెను. పిల్లజుట్టుగల లక్ష్మణుఁడు విల్లుచేతఁ బూని యా రాముని వెంబడించిపోయెను. అమ్ముల పొదులు వీపునఁ బెట్టుకొని, చేత విండ్లను దాల్చి, మేలిడాలుచేఁ బలు దెసలను వెలుఁగఁజేయుచు, నాయిరువురు మూఁడుతలలుగల రెండు పాములవలె నొప్పుచు, దిట్టలయి యశ్వినీదేవతలు బ్రహ్మదేవునింబోలె నామునినిని వెంబడించిపోయిరి. అప్పుడు చక్కఁగ నలంకరింపఁబడిన వారలై, యుడుముత్తోలుతోఁ జేయఁబడిన చేతికిఁ దొడుగుకవచమును, వ్రేళ్లకుఁదొడుగు కవచమును దాల్చి, ఖడ్గమును జేతఁబట్టి, యందమగు దేహముగలవారలై, తమ కాంతులచే దెసలను వెలుఁగఁజేయుచుఁ బోవుచున్న యెచ్చెములేని పసిపాపలగు నన్నదమ్ములైన రామలక్ష్మణులావిశ్వామిత్రుని వెంబడించిపోవుట, ధ్యానింపనలవిగాని యీశ్వరుని నగ్నిహోత్రమునఁ బుట్టిన కుమారస్వామియు, విశాఖుఁడును వెంబడించుటను బోలియుండెను.

**విశ్వామిత్రుఁడు రామునకు బల అతిబలయను విద్యలను నుపదేశించుట**

ఇవ్విధంబున వారొక కోసుదూరముపోయి, సరయూనది దక్షిణపుగట్టునఁ జేరఁగా విశ్వామిత్రుఁడు 'రామా!' యని ప్రేమతోఁ బిలిచి యిట్లనెను. నాయనా! శీఘ్రముగా నాచమనము చేయుము. ఆలస్యము చేయకుము. సకలమంత్రములు నిమిడియున్న బల, అతిబల యను రెండు విద్యలను నీకు నే నుపదేశించెదను. నీవు వానిని గ్రహింపుము. తన్మంత్ర ప్రభావమువలన నీ కలసట యుండదు. రోగము రాదు. రూపమున కెట్టివికారము గలుగదు. నీవు నిద్రపోయినను, నేమఱుపాటునొందినను రక్కసులు నిన్నేమియుఁ జేయలేరు. రామా! నీకు బాహుబలము సాటివచ్చువాఁడు ముల్లోకములం దొక్కఁడైనను నుండఁడు. నీవీ రెండువిద్యలను జపించుచుంటివేని, సౌందర్యమునను, నేర్పునను, దెల్వియందును, బుద్ధిచే నొకసంగతి నిశ్చయించునప్పుడును, వాదులాడునపుడును నీకు సాటియైనవాఁడు భూలోకమున నుండఁడు. ఇవి సకల

జ్ఞానములకుఁ దల్లివంటివి గావున నీరెండువిద్యలను నీవు జపింతువేని, నీకు సాటివచ్చువాఁ డుండఁడు. రఘునందనా! నీవు దారి నడుచునపు డీ బలాతిబల లనెడి మంత్రములను బఠించుచుందువేని, నీ కాఁకలియు, దప్పియు నుండవు. కీర్తియు మెండుగాఁగలుగు. ఇట్టి మహిమగల యీరెండువిద్యలును బ్రహ్మదేవుని బిడ్డలు. ఓ ధార్మికుఁడా! యీ విద్య లొసఁగుటకు నీవె తగినవాఁడవు. ఇప్పుడే నీయందు సౌందర్య దాక్షిణ్యాది గుణంబు లున్నవి. అయినను, ఈరెండు విద్యలు బహు తపస్సుచే సంపాదింపఁబడినవి కావున వీనిని నీవు జపించిన, నీ కింకను విశేషఫలంబులు గలుగును" అని చెప్పఁగా, రాముఁడు సంతోషముతోఁ గూడిన మోముగలవాఁడై, యాచమనంబు చేసి, పరిశుద్ధుఁడై, మహాత్ముఁడయిన విశ్వామిత్రుఁ డుపదేశించిన రెండువిద్యలను గ్రహించెను.

శ్రీరాముఁడు చేయవలసిన కార్యము లొనరించి యావిద్యలను రెంటిని బొందినవాఁడై, శరత్కాలమందలి సూర్యభగవానునిబోలెఁ బరాక్రమశాలియై వెలుఁగుచుండెను. అంత విశ్వామిత్రుఁ డాసరయూ నది దక్షిణపుగట్టున నారాజపుత్రులతోఁగూడ రాత్రియంతయు సుఖంబుగ నుండెను. మెత్తనిపాన్పులపైఁ బరుండి నిద్రపోవునట్టి యాదశరథ రాజపుత్రు లిరువుర్యుఁ గసవుపాన్పుపైకూడఁ బరుండి విశ్వామిత్రుని యింపు మాటలచే నానంద మొందుచు నారేయి సుఖముగఁ గడపిరి.

## 23-వ సర్గము

### స్థాణ్వాశ్రమంబున వసించుట

ఆరాత్రి వేఁగినంత విశ్వామిత్రమునీంద్రుఁ డాకులపాన్పుపైఁబరుండి నిద్రించుచున్న రామలక్ష్మణులనుజూచి, "ఓ రామా! కౌసల్యముద్దుబిడ్డఁడా! నరశ్రేష్ఠుఁడా! ప్రాతఃకాలము సమీపించినది. విధివిహితమగు ననుష్ఠానము చేయవలయును లెమ్ము" అని నిద్ర లేపెను. ఇట్లు విశ్వామిత్ర మహాముని బహు గంభీరముగాఁ జెప్పిన మాటను విని, శూరులు రాచకొమరులునైన రామలక్ష్మణులు లేచి సరయూనదియందు స్నానముచేసి, యర్ఘ్యప్రదానం బొనర్చి జపములలో నెల్ల నుత్తమమగు గాయత్రీ జపము నొనర్చిరి. ఇట్లు మహాపరాక్రములగు రామలక్ష్మణులు తమ యుదయకాలానుష్ఠానములను దీర్చి, తపోధనుఁడగు విశ్వామిత్ర మునీం

త్రునకు నభివాదన మొనర్చి, యెక్కువకుతూహలముతోఁ బ్రయాణము నకు సంసిద్ధులైరి. అట్లు వారు ప్రయాణమై పోవుచు సరయూనది గంగలో సంగమించు శుభప్రదేశమున దివ్యమయిన గంగానదిని జూచిరి. ఆచేరువను వేలకొలఁది సంవత్సరములుగా నెక్కువ తపం బొనర్చుచున్న శ్రేష్ఠమైన తేజముగల ఋషులయొక్క పుణ్యప్రదమయిన తపోవనమును దిలకించిరి. రామలక్ష్మణు లాపావనమైన తపోవనమును జూచి, కడుసంతసము నొందినవారలై. మహాత్ముఁడగు విశ్వామిత్ర మహామునితో నిట్లనిరి. "ఓ భగవంతుఁడా! యీ పుణ్యప్రదమైన యాశ్రమమెవ్వరిది? దీనియం దేపుణ్యపురుషుఁ డిపుడు వసించు చున్నాఁడు? మా కిరువుర కీ సంగతి దెలియవలెనని మిక్కిలి కుతూహ లముగా నున్న" దని రామలక్ష్మణులు ప్రశ్నింపఁగా విశ్వామిత్రుఁడు నవ్వి "పూర్వ మీయాశ్రమ మెవ్వరిదో చెప్పెద వినుఁ" డని చెప్పఁ దొడఁగెను. తొల్లి కందర్పుఁడు మూర్తిమంతుఁడై యుండెను. అతనినే దేవతలు కాముఁ డని యందురు. స్థాణురూపముఁ దాల్చిన శంకరుఁడు ము న్నొకసమయమున నిచ్చటికి వచ్చి యేదోయొక కార్యమును మన మునం దలంచి, యోగనిష్ఠలో నుండి ప్రమథగణములతోఁగూడి తపం బొనరించుచుండఁగా, దుష్టాత్ముఁ డయిన మన్మథుఁ డతని తపంబునకు విఘ్నము గావింపఁ బ్రయత్నించెను. అంత భగవంతుఁడగు శంకరుఁడు తనహుంకారముచేతనే యాతని నదలించి, తేజోమయమగు తన మూఁడవకంటితోఁ జూడఁగా నామన్మథుని దేహము బూదియైపోయెను. అంత నీశ్వరుఁడు క్రోధముతో "నీ వనంగుఁడ వగుదువు గాక." యని శపించెను. అదిమొదలు మన్మథుఁ డనంగుఁ డనియు, నతఁడు తనయంగ మును విడిచినచోటు యంగదేశ మనియుఁ బ్రఖ్యాతి నొందెను. ఇది యాస్థాణువుయొక్క పవిత్రమయిన యాశ్రమము. ఇచ్చట నున్న ముసు లందఱు నాతని శిష్యులు. కనుకనే వారు మిక్కిలి ధర్మపరాయణులు. కాఁబట్టియే వారికి పాపము లేదు. రాముఁడా! యీరాత్రి కీ పవిత్రము లైన గంగాసరయూనదులనడుమ నీయాశ్రమమున నుండి రేపు గంగా నది దాఁటెదము. వేకువ లేచి, మనము గంగానదియందు స్నాన మొన రించి, సంధ్యావందనాదులు దీర్చుకొని, యగ్నిహోత్రంబులు వేల్చి,

పావనమయిన యాశ్రమమును బ్రవేశింతము' అని వారిట్లు మాట్లాడు చుండఁగా, నచ్చటిమునులందఱు దమ జ్ఞానదృష్టిచే విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులతో నచ్చటికి వచ్చియుండుట యెఱిఁగి, మహాసంతోషము నొందినవారై, వారికడ కేతెంచి, మొదట విశ్వామిత్రుని నర్ఘ్యపాద్యాది పూజలచే సత్కరించి, పిదప రామలక్ష్మణులకుఁ దగుతెఱంగున నతిథి మర్యాదలు చేసిరి. ఆ మునులందఱు విశ్వామిత్రునివలన కుశలప్రశ్నాది సత్కారముల నంది కథలు చెప్పి యతిథులయిన విశ్వామిత్రరామలక్ష్మణు లను సంతోషపఱచిరి. వారంతట నెమ్మదినొంది సాయంసంధ్యావందనా ద్యనుష్ఠానంబులఁ జేసిరి. ఆ రామలక్ష్మణవిశ్వామిత్రులు ముగ్గురును వ్రత నియమములు గల యా మునుల ప్రేరణమువలన నా స్థాణ్వాశ్రమంబు సొచ్చి, యచ్చట నారేయి కడుసుఖంబుగాఁ గడపిరి. ధర్మాత్ముఁడయిన విశ్వామిత్రమునీంద్రుఁడును సుందరాకారులై సకల సుగుణములచే నొప్పి యున్న యా రాచబిడ్డలయిన రామలక్ష్మణులను వినోదకథలచే సంతోష పఱచుచుండెను.

## 24-వ సర్గము

### రామలక్ష్మణులు తాటకావనము సొచ్చుట

మఱునాఁ డుదయమున శ్రీరామలక్ష్మణులు నిద్రలేచి, ప్రాత రాహ్నికంబుల నెల్ల నెఱవేర్చుకొని, తన యాహ్నికములను దీర్చుకొని సిద్ధముగా నున్న విశ్వామిత్రుని వెంబడించి, గంగానదియొద్దు చేరిరి. అచ్చట నున్న మహానుభావులును, గఠినవ్రతులును నగు మునులందఱు పరిశుద్ధమయిన నావను దెప్పించి సిద్ధపఱచి, విశ్వామిత్రుని జూచి, "మహాత్మా! రాజపుత్రులతోఁగూడ నోడ నెక్కుఁడు. మంచిదారిని బొండు. ఆలస్యము వల"దని సాగనంపిరి. విశ్వామిత్రుఁడు నట్లే యని యామహర్షుల నందఱ సగౌరవముగా వీడ్కొని రాజకుమారులతోఁ గూడ సముద్రములోఁ గలియునట్టి యాగంగానదిని దాఁటెను. వా రానదిని దాఁటుచుండఁగా నయ్యేటినడుమ నురవడితోఁ బాఱుచున్న నీటి చప్పుడు విని రాముఁడు విశ్వామిత్రమునీంద్రునిజూచి "యేటినడుమ నొక్కదాని నొక్కటి యొరయుచున్న యీనీటిచప్పు డేల కలిగె"నని యడిగెను. రాముని వచనమును విని విశ్వామిత్రుఁ డత్యుత్సాహముతో

నాశబ్దమునకుఁ గారణంబు నిర్ణయించి చెప్పెను. "రామా! కైలాసపర్వతమున బ్రహ్మదేవుఁడు తన మనసుతో నొక సరస్సును నిర్మించెను. కావున నది మానససరస్సని చెప్పఁబడు. ఆసరస్సునుండి యొక నది పుట్టెను. అది యయోధ్యాపట్టణంబు నావరించుకొని ప్రవహించుచున్నది అది సరస్సునుండి ప్రవహించుచున్నది. కావున సరయువని చెప్పబడెను. అది బ్రహ్మసరస్సునుండి స్రవించుటచే మహాపవిత్రమయినది. ఆ సరయూనది యిట గంగానదితోఁ జేరుచున్నది. ఈశబ్ద మాగంగాజలంబును, సరయూజలమును గలియుటచేతఁ గలిగినది. నీవు పరిశుద్ధుఁడవై యీగంగా సరయూనదులకు నమస్కరింపుము" అని విశ్వామిత్రమునీంద్రుఁడు చెప్పఁగాఁ, గడుధర్మాత్ములయిన యారామలక్ష్మణు లిద్దఱు నాగంగాసరయూనదులకు నమస్కరించి, దక్షిణపుగట్టుఁ జేరి, వేగంబుగ నడచుచుఁబోయిరి. అట్లు దారిని బోవుచు దశరథనృపాలుని పుత్త్రుఁడగు రాముఁడు భయంకరమై, బొత్తిగా నరసంచారములేని యరణ్యమును గాంచి, విశ్వామిత్త్రుని జూచి "మహామునీ! యీయరణ్యంబు పేరేమి? ఏవైపు చూచినను, 'గూయి' యని కూయుచుండెడి యీల పురుగులచేతను, భయంకరములయిన క్రూరమృగంబులచేతను, దారుణంబుగ నఱచుచున్న యనేకవిధంబులగు పక్షులచేతను ఘోరంబుగ గర్జించుచున్న సింగంబులుఁ, బులులు, నడవి పందులు, నేనుఁగులు మున్నగువానిచేతను నిండినదై చండ్ర, యినుమద్ది, యేఱుమద్ది, మాఱేడు, తుమ్మికి, రేఁగు, కలివి చెట్లతోనుగూడి, జనులు లోపలికిఁ జొచ్చుట కలవికాకయున్నదే! ఈభయంకరమైన యడవి యెవరిది?" అని యడిగెను.

అంతట విశ్వామిత్రమునీంద్రుండు రాముని జూచి, "వత్సా! యీ ఘోరవన మెవ్వరిదో చెప్పెద నాలకింపుము. పూర్వకాలంబున దేవతలచే నిర్మింపఁబడి బహు సుభిక్షంబులయిన మలద, కరూశము లను దేశములు రెం డిచ్చట నుండినవి. తొల్లి దేవేంద్రుఁడు వృత్త్రాసురునిఁ జంపిన పిదప, నతనికి బ్రహ్మహత్య పట్టఁగా, నతఁ డాఁకలితోను మైలతోను బాధపడుచుండెను. అప్పుడు తపోధనులయిన ఋషులందఱును బరితాపంబు నొంది మహేంద్రు నిచ్చటికిఁ దెచ్చి గంగానది తీర్థజలంబును మంత్రపఠనపూర్వ

కంబుగాఁ గడవలు కడవలుగాఁ దలపైఁ గ్రుమ్మరించి, యతనిపాపము నీదేశములోఁ దొలఁగించిరి అట్లు దేవతలును, మహర్షులును దేవేంద్రుని శరీరంబునుండిఁబుట్టిన యపరిశుద్ధతను, నాఁకలిని దొలఁగించి మహానందము నొందిరి. ఇంద్రుఁ డెప్పుడు పాపము, నాఁకలియు లేక పరిశుద్ధుఁడాయెనో, అప్పుడు సంతసించి, "నాయొక్క పాపమును, నాఁకలియు నిచ్చటఁ దొలఁగి నది గాన నీరెండుదేశంబులకును 'మలదము, కరూశము' అను పేరును గలిగి ధనధాన్యసమృద్ధములై, మహాప్రసిద్ధి కెక్కఁగల"వని యాదేశ ముల కొక్కవరం బొసఁగెను. దేవేంద్రుఁ డాదేశంబునకుఁజేసిన పూజను జూచి, దేవతలు, ఋషులు మెచ్చుకొని 'బాగు బాగు' అని పాకశాస నుని ననిరి. ఇవ్విధంబున నీరెండుదేశంబులును జాలకాలము ధనధాన్య సమృద్ధిగలిగి సంపన్నములైయుండెను.

పిమ్మట గొంతకాలమునకు నాదేశములందు యక్షిణి యొకతె జన్మించినది. అది వేయి యేనుఁగుల బలము గలది. తలంచిన రూపంబుఁ దాల్చు శక్తి గలిగినది. దానిపేరు తాటక. అది సుందుఁ డను రక్కసునికి భార్య. దానికి మారీచుఁడను నొకపుత్త్రుఁడు గలఁడు. వాఁడు దేవేం ద్రుని పరాక్రమముబోలు పరాక్రమంబు గలవాఁడు. గుండ్రంబులయిన చేతులును, వెడల్పయిన మోమును, శరీరంబును గలవాఁడు. భయంకరా కారుఁడయిన యామారీచుఁ డెల్లప్పుడు ప్రజలను భయపెట్టుచు నీదేశము లను నాశనము చేయుచున్నాఁడు. దుష్టచారిణియైన తాటక యీ మలదకరూశదేశాలను నాశనము చేయుచు నిచ్చటి కర యోజనము (రెండుకోసుల)దూరంబులోను దారి నడ్డగించుచున్నది. కావుననే మన మాతాటకావనంబునకుఁ బోయి తీఱవలయును. నీ బాహుబలముతో నీ వీ దుష్టచారిణిని వధింపవలయును. నా యాదేశానుసారము మరల నీదేశమును నిరుపద్రవముగాఁ జేయుము. మిక్కిలి పుణ్యవత్తరమయిన యిట్టిప్రదేశమున కీదుష్టతాటకభయమువలన నేప్రాణియు రాఁజాల కున్నది. దుస్సహాకారాలగు నాఘోరయక్షిణిచే నీదేశ మంత నిర్జనముగాఁ జేయఁబడినది. ఈదేశమును తాటక యెట్లు నిర్మానుష్యముగా నొనర్చి నదో యదియెల్ల నీకుఁ జెప్పితిని. ఇప్పటికిఁగూడ దాని పీ డణఁగలేదు.

## 25-వ సర్గము

### తాటకయొక్క జన్మవృత్తాంతము

అప్రమేయప్రభావుఁడగు నా విశ్వామిత్రమహర్షి యట్లు చెప్పఁగానే విని పురుషశ్రేష్ఠుఁడయిన రాముఁడు మిక్కిలి యడఁకువతో విశ్వామిత్రమునినిఁజూచి "మహామునీ! యక్షు లల్పవీర్యు లని చెప్పఁగా నేను వినియుంటిని. అట్లుండ నీయాఁడుదానికిమాత్రము వేయియేనుఁగులబల మెక్కడినుండి వచ్చినది" యని యడిగెను. ఇట్లు రాముఁ డడుగఁగా, విశ్వామిత్రమహర్షి, "రామా! దీనికి వరప్రభావమునలన నింతటి బలిమి వచ్చినది. ఆ సంగతినిగూర్చి వివరించి చెప్పెద నాల కింపుము. తొల్లి సుకేతుఁడను నొక గొప్ప యక్షుఁ డుండెను. అతఁడు బలపరాక్రమశాలి. అతనికి బిడ్డలు లేమిచే నతఁడు మిక్కిలి యాచార సంపన్నుఁడై గొప్పతపం బొనర్చెను. బ్రహ్మదేవుఁ డా యక్షరాజు తపంబునకు మెచ్చి, యతనికిఁ దాటక యను కూఁతు నొసఁగి, దానికి వేయియేనుఁగుల బలంబును నొసఁగెనుగాని, యొకపుత్త్రుని నొసంగఁ డయ్యెను.

ఆ తాటక దినదినంబునఁ బెరుగుచు, రూపయౌవనంబులు గల దయ్యెను. పిదప సుకేతుఁడు యౌవనవతి యగు తన కూఁతును జంభుఁ డను యక్షుని కుమారుఁడయిన సుందున కిచ్చి వివాహము చేసెను. అంతటఁ గొంతకాలమునకు నా తాటకకు మారీచుండను పుత్త్రుఁడు పుట్టెను. వాఁ డతిగర్వితుఁడు. అతఁడు శాపమువలన రాక్షసుఁడాయెను. అగస్త్యమహాముని సుందునిఁ జంపఁగానే, తాటక తనపుత్త్రునితోఁ గూడి ఋషిశ్రేష్ఠుఁడయిన యయ్యగస్త్యమహామునిని బెదరించి, యాతని మ్రింగఁ గోరి యతిత్వరితముగ నఱచుచు నతనిపైకి వచ్చెను. అట్లు వచ్చుచుండు తాటకను, దాని కొమరుఁడగు మారీచునిఁ జూచి, భగవంతుఁడగు నగస్త్యమహాముని వారికి శాప మీఁగోరి, మారీచునిఁ జూచి, "నీవు రాక్షసుఁడ వగుదువు గాక" యని శపించి, తాటకను జూచి "నీవు నరులను భుజించుదానవై వికృతాకారముతో మహాయక్షిణివై ఈ నీనిజ రూపమును వీడి మహాదారుణమయిన రూపమును బొందుదువుగాక" యని శపించెను.

ఆ తాటక యగస్త్యముని శాపముచే ఘోరరూపముం దాల్చి, తన కాతఁడు శాప మిచ్చె నన్న కోపముతో నమ్మహాముని నేమియుఁ జేయఁజాలక, యతఁడు సంచరించునట్టి యీ పుణ్యదేశమును బాధ చేయుచున్నది. ఓ రామా! గోవులయొక్కయు బ్రాహ్మణులయొక్కయు హితముఁగోరి చెడ్డనడతగలదై, చెడ్డపనులు చేయుచు నోర్వరాని బలిమిగల్గియున్న భయంకరరూపిణియగు నీ తాటకను సంహరింపుము. రఘునందనా! శాపమును బొందియున్న యీ తాటకను జంపుటకు నీవు తప్ప నీ మూఁడు లోకంబులలోఁ జాలినవాఁ డెవ్వఁడును లేఁడు. నరోత్తమా! తాటక యాఁడుదిగదా దాని నెట్లు వధియించుట? యని యేమాత్రమును నీవు ఏవఁగొనరాదు. నాలుగు జాతులవారిని సంరక్షించునిమిత్తము రాజకుమారునిచే నీ కార్యము చేయఁదగినదియె. ఏదైన నొకపని చేయుటవలన జనులకు మేలు గలుగునేని, అట్టికార్యము క్రూరమైనది యైనను, సౌమ్యమైనదియైనను, న్యాయమైనను, న్యాయ విరుద్ధమైనను, దోషము వచ్చునదియైనను జనుల రక్షణము సేయు వాఁడగు నృపాలుఁ డట్టి పనిచేసి తీరవలయును. కకుత్స్థవంశోద్భవా! రాజ్యభారము వహించువారి కిది సనాతనధర్మము. ఈతాటక ధర్మమార్గము దప్పినది. దీనియెడ ధర్మంబు కించిత్తైనను లేదు. దీనిం బరిమార్చుము. దీనఁ గొంచెమైనను నీకుఁ బాతకంబు గలుగదు. రామా! తొల్లి విరోచనుని కుమార్తెయగు మంథర భూమినిజంపఁ గోరఁగా, దేవేంద్రుఁడు దానిని జంపె నని వినియున్నాముగదా! మఱియు మున్నొకకాలంబున నీలోకంబు నింద్రుఁడులేని దానిఁగఁ జేయవలయు నని వ్రతము పట్టియున్న శుక్రునితల్లియు, భృగుమహర్షి పత్నియు నైన ఖ్యాతి యనుదానిని శ్రీమహావిష్ణువే వధించెఁగదా! రాజపుత్రా! యింక ననేకులైన రాజశ్రేష్ఠు లధర్మపరలైన స్త్రీలనెందఱనో చంపి యున్నారు.” అని చెప్పెను.

## 26-వ స ర్గ ము

### రాముఁడు తాటకను వధించుట

రాకొమరుఁడగు రాముఁడు విశ్వామిత్రముని మహార్థయుముగాఁ జెప్పిన వాక్యము విని, చేతులు జోడించుకొని యమ్మునితో

“మహామునీ! నా తండ్రి యిచ్చిన యాజ్ఞవలనను, ఆయన మాట లందలి గౌరవమువలనను, విశ్వామిత్ర మహామునియాజ్ఞ యని నిశ్శంకముగాఁ జేయవలసినదియే. అయోధ్యలో మహాజనుల నడుమ మాతండ్రి నన్నుఁ జూచి, ‘విశ్వామిత్రుఁ డేమిచెప్పినను నీవు తప్పక చేయవలసినది’ యని యాజ్ఞాపించెను. కావున నేనిపుడు మాతండ్రి యానతిచొప్పునను, బ్రహ్మవాదియగు తమయాజ్ఞవలనను దాటకావధము చేసెదను. గోవులకును, బ్రాహ్మణులకును, నీదేశమునకును బహువిధమైన క్షేమము గలుగుటకై, యూహింపరాని మహిమగల తమ యానతిచొప్పున నడచుటకుఁ బూనుకొంటి”నని చెప్పెను.

ఇట్లు చెప్పి శత్రుసంహారకుఁడయిన రాముఁడు వింటి నడుమును పిడికిటితోఁబట్టి, దిక్కులు మాఱుమ్రోఁగునట్లు ఖణిల్లు మని టంకారము కావించెను. ఆశబ్దము విని తాటకావనమున నున్నవార లులికిపడిరి. తాటకయు నాశబ్దముచేఁ బరవశయై, కడునలిగి యాశబ్దమున కేమి కారణం బుండునని కొంతసేపు చింతించి, యాశబ్దము వెలువడినవైపునకు వేగం బునఁ బరుగిడెను. శ్రీరాముఁ డట్లు కోపముతో వచ్చుచుండునదియు, రోఁతపుట్టుచుండు మోముగలదియు, మితిమీఱిన యాకారముగలదియు నైన తాటకను జూచి, లక్ష్మణునితో “లక్ష్మణా! చూచితివా? యీయక్షిణి యొక్క భయంకరరూపమును? వికృతరూపయగు నీతాటకను జూచిన నెంతటి ధైర్యశాలుల గుండెలును బ్రద్దలగును. ఈయక్షిణి మాయా బలముతోఁ గూడినది. ఒరులకు లోఁబడని బలము గలది. దీనిని మన యెదుటికి రానిమ్ము. దీని ముక్కు చెవులుకోసి పంపెదను. ఇది యాఁడుది గనుక దీనిని జంప నాకుఁ జేతులాడకున్నవి. దీని పొగరును, వేగము నణఁపవలయు నని నాతలంపు” అని రాముఁడు చెప్పెను.

ఇట్లు రాముఁడు తన తమ్మునితోఁ జెప్పుచుండఁగనే తాటక కోపముతో మఱింత రేఁగినదై, చేతులు పైకెత్తి, బొబ్బలిడుచు నారాముని మీఁదికే వచ్చెను. అట్లు వచ్చిన తాటకను బ్రహ్మర్షియగు విశ్వామిత్రుఁడు ‘హుం’ అని యదలించి నిలిపి, “రఘువంశోద్భవులైన రామలక్ష్మణులకు క్షేమము గలుగుఁగాక, వారికి జయము గలుగును గాక యని యాశీర్వాదమును జేసెను. ఇంతలోఁ దాటక దుమ్మును వారిమీఁదఁ దట్టముగ

నెగఁజిమ్ముచుఁ గొంతసేపు వారికిఁ గన్ను మిన్ను తెలియకుండులాగునఁ జేసెను. మఱియు, నది మాయారూపమునొంది గొప్పరాళ్ళవాన వా రాఘవులపైఁ గురిపించెను. రాముఁడు శరవర్షముచే నారాళ్ళవాన నణఁచి, మీఁదిమీఁదికి వచ్చుచుండ నాతాటక చేతులను రెంటిని బాణ ములతో నఱికెను. అట్లు తాటక చేతులు రెండు నఱుకఁబడుటచేఁ గొంచెము డస్సి బొబ్బపెట్టుచుండఁగా లక్ష్మణుం డతికోపముతో దాని ముక్కు చెవులను గోసెను. తోడనే తాటక పలు తెఱంగులగు రూపం బులఁ దాల్చినదై, తన మాయాబలమున నెదుటివారికిఁ గనఁబడక, రాళ్ల వానఁ గురిపించుచు, భీకరముగఁ దిరుగుచుండెను. అట్లు తాటక వర్షిం చిన రాళ్లవానచేఁ బూర్తిగఁ గప్పఁబడిన రామలక్ష్మణులను జూచి, భగ వంతుఁడగు విశ్వామిత్రుఁడు రామునితో "రామా, దీనిపై దయయుంచ వలదు. ఇది పాపాత్మురాలు. చెడ్డపనులే చేయునది. యాగములకు విఘా తము సేయునది. ఇది యింకను దనమాయచే వృద్ధినొందఁగలదు. సంధ్యా కాలము వచ్చునంతలో దీనినిఁ జంపుము. రక్కసులు సంజప్రొద్దులందు బలిమిగలవార లగుదురు. అప్పుడు వారిని జయించుట కష్టము." అని చెప్పఁగా, రాముఁడు తమపై నట్లు రాళ్లవాన గురిపించుచుండు తాట కను శబ్దమునుబట్టి బాణములఁ బ్రయోగించి యరికట్టెను. ఇట్లది బాణ ములతో నరికట్టఁబడినదై యఱచుచు రామలక్ష్మణులమీఁదికి వచ్చెను. ఇట్లు పిడుగువలె వేగముతో మీఁదికి వచ్చుచున్న పరాక్రమవతియగు నాతాటకపయి రాముఁడు ఱొమ్మున నాటునట్లు బాణమును బ్రయో గింపఁగా నది నేలమీఁదఁబడి విలవిలఁదన్నుకొని చచ్చెను.

మహాభయంకరాకార యైన యా తాటక చావఁగాఁ జూచి ఇంద్రుఁడును దేవేంద్రుఁడును సకల దేవతలును, "బాగు, బాగు" అని రాముని మిగులఁ గొనియాడిరి. పిదప వేయి కన్నులవాఁడగు దేవేంద్రుఁ డును పరమసంతుష్టులైన దేవతలును విశ్వామిత్రమహర్షిని జూచి, "మునీంద్రా, నీకు శుభమగుఁగాక. మంచిపని చేసితివి. ఇంద్రాది దేవత లందఱు నీ కార్యమునకు సంతసించిరి. రాఘవునిపైఁ బ్రేమ యుంచుము. భృశాశ్వునికిఁ బుట్టినవియు, సత్యపరాక్రమము గలవియుఁ దపస్సు యొక్క బలిమిచే నిండినవియునైన యస్త్రములను రాముని కుపదేశిం

పుము. నీ దగ్గఱనుండి యయ్యస్త్రములను గైకొన రఘురాముఁడు తగిన పాత్రమగును. ఇతఁడు నీకు శుశ్రూషలు సేయుటకై మనసు నిల్పుకొని యున్నవాఁడు. ఈ రాజపుత్త్రుఁడు చేయవలసిన దేవకార్యము మెండుగా నున్నది. ఇతఁ డందుకై భూమియం దవతరించియున్నాఁ" డని పలికి విశ్వామిత్త్రుని బూజించి, యానందముతోఁ దమతమ తావులకు వచ్చినట్లుగఁ జనిరి. ఇంతలోపల సంధ్యాకాలము వచ్చెను. అంత విశ్వామిత్త్రుఁడు రాముఁడుచేసిన పరాక్రమసూచకమైన తాటకావధరూపమగు కార్యము జూచి యానందమొందినవాఁడై, రాముని శిరమున మూర్కొని, "నాయనా! రామా, యీరాత్రి కిక్కడ నుందము. రేపు తెల్లవాఱ మన యాశ్రమమునకుఁ బోవుద"మని చెప్పెను.

అట్లే వారు ముగ్గురు నారేయి యక్కడనే సుఖముగా నిద్రించిరి. ఆ దినము మొదలు ఆవనమునం దుపద్రవము లేకుండునట్లు చేయఁబడినందున నావనం బాదినముననే శాపముచే విడువఁబడినదై చైత్రరథమను కుబేరునియుద్యానవనము మాడ్కి మనోహరముగఁ జూపట్టుచుండెను. ఆరాముఁడు తాటకను సంహరించి, సురసిద్ధసంఘములు గొనియాడుచుండఁగా నారేయియంతయు విశ్వామిత్రమహామునితోఁగూడ నయ్యరణ్యముననే నివసించెను. వేఁకువజాము కాఁగానే మునీంద్రుఁ డా రాజపుత్త్రులను నిద్రలేపెను.

## 27-వ సర్గము

### విశ్వామిత్రమహాముని రామున కస్త్రంబు లుపదేశించుట

ఆ రాత్రియంతయు నచ్చటఁ గడపిన తరువాతఁ గీర్తిమంతుఁడైన విశ్వామిత్త్రుఁడు చిఱునవ్వునవ్వి, యింపుగులుకు నక్షరములతోఁ గూడినవాక్యముల నిట్లనియె. కీర్తిమంతుఁడా, రాజపుత్త్రా, నీ పరాక్రమమునకు మిగుల సంతసించితిని. నీకు మేలయ్యెడు. పరమానందముతో నస్త్రముల నన్నిటి నొసంగెదను. దివ్యాస్త్రంబుల నన్నింటిని నీవు గ్రహింపుము. వాని సాయమున దేవాసుర గంధర్వ యక్ష రాక్షసులలో నెట్టి శత్త్రువుల నేని జయింపఁగల్గుదువు.

రఘువంశోద్భవా! నీకు దండచక్రమను నొక చక్ర మొసంగెదను. రాఘవా! ధర్మచక్రమును, కాలచక్రమును, భయంకరమగు విష్ణుచక్రము

ను, ఐంద్రాస్త్రము, వజ్రాయుధము, త్రిశూలము, బ్రహ్మశిరంబను నస్త్రము, ఐషీకాస్త్రము, శ్రేష్ఠమైన బ్రహ్మాస్త్రము మొదలగు నస్త్రముల నన్నింటిని నీ కుపదేశించెదను. నృపతిశ్రేష్ఠా! దగదగ వెలిగెడుమోదకి, శిఖరి యను రెండు గదలను, ధర్మపాశ కాలపాశము లను వారుణాస్త్రమును, శుష్కము, ఆర్ద్రము అనెడి రెండుపిడుగులను, పినాకాస్త్రమును, నారాయణాస్త్రమును, శిఖరమనెడి యాగ్నేయాస్త్రమును, ప్రథనమను వాయవ్యాస్త్రమును, హయగ్రీవాస్త్రమును, క్రౌంచాస్త్రమును, విష్ణుశక్తి రుద్రశక్తి యను రెండు శక్తులను, రాక్షసులు ధరించునట్టి కంకాళ, ముసల, కాపాల, కంకణములను నాయుధములను, విద్యాధరసంబంధియైన మహాస్త్రమును, నందనమను నొకఖడ్గమును, మానవమను పేరుగల గాంధర్వాస్త్రమును, ప్రస్వాపనాస్త్రమును (నిద్రపోవునట్లు చేయునస్త్రమును), ప్రశమనాస్త్రమును (శాంతిని గలిగించెడు నస్త్రమును), సౌరాస్త్రమును, దర్పణాస్త్రమును, ఎండింపఁజేయు శోషణాస్త్రమును, వేండ్రముపుట్టించు సంతాపనాస్త్రమును, రోదనంబుగల్గించు విలాపనాస్త్రమును, మన్మథునకుఁ బ్రియంబును, శత్రువుల కోర్వరానిదియునైన మదనమనెడి యస్త్రమును, మోహనమనెడుపేరుగల పైశాచాస్త్రమును, తామసము, సౌమనము, సంవర్తము, దుర్ధర్షమగు మౌసలము, సత్యము, మాయాధరము, శత్రువులబలంబుఁ దగ్గించునట్టి తేజఃప్రభము, చంద్రదేవతాకమగు శిశిరము, త్వష్టదేవతఁగాఁగల సుదామనము, భాగుడు దేవతగాఁగల దారుణమగు శీతాస్త్రము, మానవాస్త్రమును నీ యస్త్రంబులను నీవు ప్రతిగ్రహింపుము. ఇవియెల్లను గావలసిన రూపము దాల్చునవి, కడుబలిమి గలవి. మిగులగొప్పవి. నృపకుమారా! యిట్టియస్త్రముల నన్నిటిని వేగమ కైకొనుము" అని చెప్పి విశ్వామిత్రుఁడు మిక్కిలి సంతోషించి శుచియై తూర్పు మొగంబుగఁ గూర్చుండి, దేవతలకేని దుర్లభమై యత్యుత్తమమైన మంత్రగ్రామమును (సమస్తాస్త్రమంత్రములను) సాకల్యముగ నుపదేశించెను. సమస్తాస్త్రములను రామున కొసఁగెను.

జ్ఞానియగు విశ్వామిత్రుఁడు రామున కుపదేశించి, కొంతసేపు జపంబుసేయఁగనె, యస్త్రంబులన్నియు రామునియెదుట నిలఁబడి చేతులు మోడ్చి, సంతోషముతో రామునిఁజూచి, 'ఓరా రాఘవా, మే మిదిగో

నీకుఁ బనివారమైతిమి. మే మందఱము నీకుఁ గావలసిన పనులను నెరవేర్చుటకు సిద్ధముగా నున్నవారము' అని చెప్ప వానినన్నింటిని రాముఁడు చేతితోఁ దాఁకి, తనవశము చేసికొని, మీరు నామనస్సువెంట మెలఁగునది' అని యానతిచ్చెను. రాముఁడును తనకుఁగలిగిన యస్త్ర లాభమునకై పరమానందము నొందుచు, తనకింత యుపకార మొనర్చిన విశ్వామిత్రమహామునికి నమస్కరించి, యటనుండి బయలుదేర సిద్ధముగా నుండెను.

## 28-వ సర్గము

### రాముఁడు విశ్వామిత్రునివలన సంహారమంత్రముల నొందుట

అంతటఁ గకుత్స్థవంశోద్భవుఁడయిన రాముఁడు సకలాస్త్రములఁ బడసి, చిఱునవ్వుమోముతోడఁ బయనమైపోవుచు, విశ్వామిత్రునిఁ జూచి, "యోమహాత్మా, మీవలన సకలాస్త్రంబులఁ బడసితిని. నన్నిఁక దేవతలుగూడ జయింపఁజాలరు. మునిపుంగవా, యీ యస్త్రముల ప్రయోగము మాత్ర ముపదేశించితివి. ఇఁక వాని యుపసంహార ముపదేశింపఁ గోరుచున్నాఁడను." అని యడుగఁగా, విశ్వామిత్ర మహాముని సంతోషముతో, నియమము పూని, మిక్కిలి పరిశుద్ధుఁడయి రామునికి నుపసంహారమంత్రముల నుపదేశించెను.

"సత్యవంతము, సత్యకీర్తి, ధృష్టము, రభసము, ప్రతిహారతము, పరాఙ్ముఖము, అవాఙ్ముఖము, లక్షాక్షము, విషమము, దృఢనాభము, సునాభము, దశాక్షము, శతవక్త్రము, దశశీర్షము, శతోదరము, పద్మనాభము, మహానాభము, దుందునాభము, సునాభము, జ్యోతిషము, కృశనము, నైరాశ్యము, విమలము, యోగంధర, హారిద్రములు, దైత్యము, ప్రశమనము, సార్చిర్మాలి, ధృతిర్మాలి, వృత్తిమంతము, రుచిరము, పిత్రుసౌమనసము, విధూతము, మకరము, కరవీరకరము, ధనము, ధాన్యము, కామరూపము, కామరుచి, మోహము, ఆవరణము, జృంభకము, సర్వనాభము, సంతానము, వరణము అని చెప్పఁబడు మంత్రముల నన్నింటిని నీ కుపదేశించెదను. ఇవి యెల్లను గావలసిన రూపముఁ దాల్పఁజాలినవి; భృశాశ్వునివలనఁ బుట్టినవి. వీనిఁ బ్రతిగ్రహింపుము. నీకు క్షేమము గలుగునుగాక. మంత్రముల నెల్లఁ

గైకొనుటకు నీవే తగినవాఁడవు." అని విశ్వామిత్రమహాముని చెప్పెను.

రాముఁడును తన సంతోషము తనముఖముననే తెలియుచుండ "మహామునీ, యట్లకానిమ్ము" అనిచెప్పి, వానినెల్లఁ గైకొనెను.

అస్త్రము లన్నియు రూపంబుఁ దాల్చినవై యెదుట నిల్చినవి. ఆ యస్త్రములలో గొన్ని దివ్యములై వెలుఁగుచున్న దేహములు గల విగఁ గనఁబడినవి. కొన్ని నిప్పుకణికలవంటివిగను కొన్ని పొగవంటివి గను, కొన్ని సూర్యచంద్రులవలెఁ బ్రకాశించునవిగను, కొన్ని యంజలి బంధముగలవిగను నుండెను. ఈయస్త్రము లెల్లను ఇంపుగ మాటా డుచుఁ, జేతులు జోడించుకొని 'రాఘవా, ఇదే మేము వచ్చియున్నాము. మా కేమి యాజ్ఞ? ఏమి చేయుదుము?' అని యడిగినవి. ఆ మాటలు రాముఁ డాలకించి, "నా కవసరమయినపుడు నేను తలఁచుకొందును. అప్పుడు నాకు మీరు సాహాయ్యము చేయుఁడు. ఇప్పుడు మీరు యిచ్చ వచ్చినట్లు వెళ్లవచ్చు" నని చెప్పెను. అంత నా యస్త్రము లన్నియు రాముని వీడ్కొని ప్రదక్షిణము సేసి "అట్లె నడచుకొనఁ గల"మని చెప్పి, వచ్చినదారిని బోయినవి.

ఇవ్విధముగా నస్త్రముల నన్నింటిని బ్రయోగించుటలను వాని నుపసంహరించుటలతోఁ గూడ నేర్చుకొని, రాముఁడు దారిని బోవుచు నొకపర్వతసమీపమున మేఘమువలె వెలయుచున్న యొక్క యందమైన తోపునుజూచి, "యిది యెవరి వనము? దీనిఁ జూడఁగనే నా కపరి మితానందము గలుగుచున్నది. ఈ వనమున ననేకములగు పక్షు లింపుగాఁ గూయుచున్నవి. ఇది సకలవిధములైన మృగములతో నిండి యున్నది. ఈవనము మిక్కిలి రమ్యమై చూడఁదగియున్నది. ఇంతక మున్ను మనము చూచిన వనము మనమునకు భయంబు గల్గించుచుండినది. ఆవనమును దాఁటివచ్చితి మని తలఁచెదను. ఈవనప్రదేశము భయము లేక సుఖంబుగ నున్నది. ఈ వనమెవ్వరిదో తెలియఁజెప్పుము. చూడఁ జూడ మన మానంద మొందుచున్నది. ఇది యొక యాశ్రమ మని తలఁచెదను. తమయాశ్రమం బెచ్చట నున్నది. ఎల్లప్పుడు యాగము లను చెరుపుచు, ననేకదుష్టకార్యములఁ జేయుచునుండు నా పాపాత్ము

లగు బ్రహ్మఘ్నులెచ్చట నున్నారు. ఏ వనమునకుఁ జని యా దుష్ట రాక్షసులను వధింపవలయును. ఆ వనమేది? ఆ వనముననేకదా తమరు యాగము చేయ నున్నారు. అప్పుడేకదా నేను దమకుఁ దోడుగనుండి రాక్షసులను వధింపవలయును. ఓమునిశ్రేష్ఠా! మహాప్రభూ! వీని నన్నింటినిగూర్చి మీవలన వినఁగోరుచున్నాను" అని వినయముతో విశ్వామిత్ర మహర్షి నడిగెను.

## ౨౯-వ సర్గము

### సిద్ధాశ్రమ వర్ణనము

మనస్సుచే నూహింప సాధ్యపడని మహామహిమగల రాముఁడివ్విధమున నడుగఁగా, బహు తేజస్వి యగు విశ్వామిత్రుఁడు రామునిఁ జూచి యీ క్రిందివిధమున విస్తరించి చెప్పఁదొడఁగెను. "దేవాదిదేవుఁడును, మహాప్రభువును నైన విష్ణు విచ్చట ననేక వేలయుగములు గొప్ప తపము చేయుచు నివసించియుండెను. ఇది పూర్వము వామనావతారమెత్తిన మహాత్ముఁడయిన విష్ణువుయొక్క యాశ్రమము. ఇట గొప్ప తపస్వి యగు కాశ్యపుఁడు తపస్సిద్ధి నొందుటంజేసి యిది సిద్ధాశ్రమ మనఁబడుచున్నది. ఇక్కడ విష్ణువు తపము చేయు కాలముననే విరోచన పుత్రుఁడగు బలిచక్రవర్తి యింద్రాది దేవతలనందఱను, మరుత్తులతోఁడ దన బలపరాక్రమములచే జయించి, ముల్లోకంబులందును బ్రసిద్ధిఁజెందినవాఁడై, యా దేవతలరాజ్యమగు స్వర్గలోకమును బాలించుచుండెను. ఆ బలిచక్రవర్తి, యొక మహాయాగమును జేసెను. అప్పుడు అగ్ని మొదలు దేవత లందఱీ యాశ్రమమునకు పరుగిడి వచ్చి, విష్ణువునకు నమస్కరించి, "ఓభగవంతుఁడా! విష్ణుమూర్తీ! విరోచనపుత్రుఁడగు బలిచక్రవర్తి యొక మహాయాగము జేయుచున్నాఁడు. అతఁడా యాగము సమాప్తి నొందించు నంతలోఁ దాము తమ కార్యము నెఱవేర్పకొనవలయును. అతఁ డేది వచ్చి యడిగినను లేదనక దానము నొసంగుచున్నాఁడు. తమరు మాయాబలమువలన వామనవేషముఁ దాల్చి, దేవతలకు మేలు చేయవలయును" అని చెప్పిరి. ఇంతలోనే యగ్నితో సమానమగు కాంతిగల కాశ్యపుఁ డదితితోఁ గూడి, వేయి దివ్య వత్సరములు తప మొనర్చి, వ్రతము పరిసమాప్తి గావించి, వరముల నొసఁగు

నట్టి విష్ణుమూర్తి నివ్విధమునఁ గొనియాడెను. ఓ విష్ణుమూర్తీ! నీవు తపోమయుఁడవు. తపస్సులకు రాశివి. తపస్సే శరీరముగాఁ గలవాఁడవు. తపస్సే ఆత్మగాఁ గలవాఁడవు. నా తపోబలమున నిన్ను నేనెఱిఁగితిని. ఓ ప్రభువా! నీ శరీరమున జగమునంతటిని జూచుచున్నాను. నీకుఁ బుట్టుక లేదు. నీ విట్టివాఁడ వని తెలియుటకు వలనుపడనివాఁడవు. ఇట్టి నిన్ను నేను శరణు సొచ్చితిని." ఇవ్విధమునఁ గాశ్యపుఁడు గొనియాడఁగా, విష్ణుమూర్తి పాపరహితుఁడయిన కాశ్యపుని జూచి, "వరము గోరుము. నీకుఁ గోరినవరము నొసంగెదను" అని సంతోషముతోఁ జెప్పెను. ఆమాట విని మరీచిమహాముని పుత్రుఁడగు కాశ్యపుఁడు విష్ణుమూర్తినిగూర్చి, "ఓ వరదుఁడా! నేనును, అదితియు, సకల దేవతలును వరము యాచించుచున్నాము. ఆ వరము నీయవలయును. ఓ యనఘా! నీవు నాకును, నదితికిని పుత్రుఁడవుగఁ బుట్టుము. ఇంద్రుఁ డిదివఱకే మాకు జన్మించినవాఁడు. నీవు వానికిఁ దమ్ముఁడవుగ జన్మింపుము. దుఃఖితులై యున్న సకల దేవతలకు సాహాయ్యము సేయవలయును. ఈయాశ్రమమున నీయనుగ్రహముచే నాతపస్సు సిద్ధి నొందుటం జేసి, యికమీఁద నియాశ్రమము సిద్ధాశ్రమ మనఁబరగుచు. ఇంక నీవిచ్చటనుండి లేచి, యవతరింపు"మని చెప్పెను.

అంతట నెక్కువ ప్రతాపము గల విష్ణుడు కాశ్యపున కదితి యందుఁ బుట్టి, వామనరూపంబు ధరించి, బలిచక్రవర్తికడ కేఁగెను. ఆ బలిచక్రవర్తి వామనావతారుండయిన విష్ణువును జూచి, "అయ్యా! మీ కేమి కావలెను?" అని యడుగఁగా, నా వామనమూర్తి మూఁడడుగుల భూమిని యాచించి, కైకొని. యామూఁడడుగులచేతనే సకల ప్రాణులమేలు కోరి లోకమునంతయుఁ గొలిచి తీసికొనెను. ఇట్లు బలిచక్రవర్తి నణఁగఁద్రొక్కి, పిదప మూఁడులోకములను దేవేంద్రుని వశము చేసెను. సకల శ్రమలను బోఁగొట్టునట్టి యీ యాశ్రమంబున మొదట విష్ణువు వాసము చేసెను. ఆ వామనావతారుఁడయిన విష్ణుమూర్తియందు భక్తి యుంచి, నే నిప్పు డీ యాశ్రమమున వాసము చేయుచున్నాఁడను. ఈ యాశ్రమమ్మున కీ రాక్షసులు మాటిమాటికి వచ్చి యుపద్రవము కలిగించుచున్నారు. పురుష

వ్యాఘ్రా! యిచ్చటనే యీ దుష్టులగు రాక్షసులనందఱను జంపవలయు. ఇదే మన మీసిద్ధాశ్రమంబునకుఁ బోవుచున్నాము. నాయనా! యీ యాశ్రమము నాకెట్లో, నీకు నట్లే" అని చెప్పుచు, రామలక్ష్మణులతోఁ గూడ దమ యాశ్రమము లోపలికి మహానందంబుతోఁ బ్రవేశించి చంద్రుఁడు మంచు తొలఁగిన పిదపఁ బునర్వసూనక్షత్రముతోఁ గూడిన వాఁడై వెలుఁగునట్లు వెలుఁగుచుండెను.

సిద్ధాశ్రమంబున వసించు మునులందఱు విశ్వామిత్రమునీంద్రునిఁ జూచి, సంతసంబుతో గంతులు వేయుచు వచ్చి, అతనికిఁ బూజలొనర్చి, రాజపుత్రులయిన రామలక్ష్మణులకును నతిథిపూజ లొనరించిరి. అంత నా రాజకుమారు లొక కొంత తడవు బడలికఁ దీర్చికొని, లేచి చేతులు గట్టుకొని, విశ్వామిత్రునిముందట నిలఁబడినవారలై, విశ్వామిత్రమునీంద్రునిఁ జూచి, "మునిపుంగవా! తాము యజ్ఞదీక్ష వహించి యాగము మొదలుపెట్టుఁడు. ఈ యాశ్రమము పేరు సిద్ధాశ్రమముగదా. ఆపేరు సత్యమగునట్లు మీ యాగము సిద్ధినొందును" అని చెప్పిరి. వారు చెప్పిన మాట విని బహుతేజము గల విశ్వామిత్రుఁడు జితేంద్రియుఁడై నియమముతో యాగము చేయ నారంభించెను. రామలక్ష్మణులును మిక్కిలి జాగ్రత్తతో నారేయి గడపి వేఁకువను లేచి, స్నానసంధ్యాద్యనుష్ఠానములు నెఱవేర్చి, పరిశుద్ధులై నియమంబుతో జపంబుచేసి, యగ్నిహోత్రంబున హోమముచేయుచున్న విశ్వామిత్రునికి నమస్కరించిరి.

## 30-వ సర్గము

### విశ్వామిత్రమహాముని యాగము సేయుట

అంత దేశమును, గాలమును గనిపెట్టి, వానికిఁదగినట్లు మాటాడ నేర్చినవారలగు శత్రుసంహారులయిన రాజపుత్రు లిరువురును దగిన దేశమున దగిన కాలమును గనిపెట్టి విశ్వామిత్రమహామునిని జూచి, "ఓ మహాత్మా! యెప్పుడా రాక్షసులు వత్తురు? వారినిగూర్చి మే మేసమయమునఁ గాచియుండవలెను? ఆ సమయము మించకుండులాగున మాకుఁ దెలుపవలయు. మే మాసమయము గనిపెట్టి జాగ్రత్తతో నుండవలెను గదా. దయచేసి చెప్పు"మని యడిగిరి. ఆ కాకుత్స్థులగు రాజపుత్రు లివ్వి

ధమునఁ బలుకుచు, మిక్కిలి యుత్సాహముతో యుద్ధంబుచేయఁ ద్వర పడుచుండుటను జూచి మునులందఱు కడుసంతసము నొందినవారలై వారిని గొనియాడి, "రఘువంశోత్పన్నులారా! మీరు లీదినము మొదలాఱు రాత్రులు మమ్ము రాక్షసులనుండి కాపాడవలయు. ఈ విశ్వామిత్రుఁడు యాగదీక్షఁ బూనియున్నవాఁడు గాన నొరులతో మాటలాడక మౌనముతో నుండును" అని చెప్పిరి.

మహాసమర్థులని కీర్తివడసిన రాజపుత్రులిరువురును మునులు చెప్పిన మాటలు విని, యా యాఱు రేయింబగళ్లు నిద్రమాని, తపోవనము గాపాడుచు, గొప్ప విండ్లఁ దాల్చి, యేది చెప్పినను జేయుటకు సిద్ధులై విశ్వామిత్రునిఁ గాచియుండిరి. ఇట్లయిదుపగళ్లు నైదురాత్రులు గడచి యాఱవదినము రాఁగానే, రాముఁడు లక్ష్మణుంజూచి, "లక్ష్మణా! నీ వీదినమున మఱింత హెచ్చరిక గలిగియుండు"మని చెప్పెను.

రాముఁడు రాక్షసులతోడి పోరునకు సిద్ధుఁడై యిట్లు లక్ష్మణునితోఁ జెప్పుచుండఁగా, యజ్ఞశాలయందున్న విశ్వామిత్రమునియు, ఋత్విజులును బరివేష్టించియున్న యజ్ఞవేది చక్కగా జ్వలింప నారంభించెను. మఱియు నచట నుంపఁబడియున్న దర్భలు, పానపాత్రములు, సమిధలు, పుష్పములు మొదలగు యజ్ఞసామగ్రులతోఁ గూడియున్న యజ్ఞశాల మండ నారంభించెను. అప్పుడు విధియుక్తంబుగను, మంత్రపూర్వకముగను యాగంబు జరుగుచుండ నందఱకు గగుర్పాటు గలుగఁజేయు గొప్ప యట్టహాసం బాకసంబునఁ గలిగెను. వర్షాకాలమునందుఁ భయంకరాకారులగు సుబాహుమారీచులును, వారి యనుచరులును గాఱుమబ్బులు బయలుదేఱి యాకసమును గప్పినట్లు మాయతో నాకసమును గప్పి పరువెత్తుకొని వచ్చి రక్తవర్షమును గురిపించిరి. ఆ యజ్ఞవేదికయంతయు రక్తప్రవాహముచేఁ దడుపఁబడినదై వెలుఁగుచుండెను. అప్పుడు రాముఁడు వెంటనే పరుగెత్తుకొనుచు వచ్చి యాకసమున నావరించియున్న యారాక్షసులను జూచెను. తర్వాత నత్యుద్రుతముగా మీఁదిమీఁదికి బరుగిడుచు మారీచ సుబాహులు

వచ్చుచుండుటఁ జూచి లక్ష్మణునితో నిట్లనియె. “ లక్ష్మణా ! మానవాస్త్రముచే, గాలి మబ్బులను జెదరఁగొట్టురీతిని మాంసమును భుజించుచు దుష్టకార్యములఁ జేయుచున్న రాక్షసులను సంహరించెదను” అని చెప్పి, మిక్కిలి క్రోధముతో, దగదగమని వెలుఁగుచున్న మానవాస్త్రమును మారీచుని రొమ్మునఁ బ్రయోగించెను. ఆ మానవాస్త్రమా మారీచుని నూఱుయోజనములదూరము త్రోసికొనిపోయి నడిసముద్రమునఁ బడవైచెను. గొప్పయస్త్రముచేఁ గొట్టఁబడనందున దిక్కుదోఁచక యచ్చటఁ దెలివిఁదప్పి పడి, మారీచుఁడు సముద్రములో మునిఁగిపోవుటను రాముఁడెఱిగి, లక్ష్మణునిజూచి, “చూడుము తమ్ముఁడా! యీ మానవాస్త్రము మారీచుని యసురు దీయక, వానిబుద్ధికి మైకము గల్గించి, వానిని బహుయోజనములదూరమున కావల మోచుకొనిపోయి త్రోసినది. తక్కిన రాక్షసులను నేను విడిచిపెట్టుట లేదు. వారు కడుదుష్టులు; కించిత్తైనను దయలేనివారు; పాపకర్మములఁ జేయువారు; యజ్ఞముల ధ్వంసముచేయువారు ; రక్తమును బానముచేయువారు. ఆ రక్కసులనందఱను నొక ముహూర్తములోపల వధించెదను” అని చెప్పెను. అట్లుచెప్పి, యత్యద్భుతమయిన యాగ్నేయాస్త్రమును గైకొని సుబాహుని ఱొమ్మున వేయఁగా, నతఁ డాబాణముచే నేలఁగూలెను. అంతట మిగిలియున్న రాక్షసులనందఱను వాయవ్యాస్త్రమును బ్రయోగించి మునీశ్వరులకు సంతోషము గలిగించుచు నొక్కుమ్మడి సంహరించెను. ఇట్లారామునకు యజ్ఞధ్వంసకులయిన రాక్షసుల నందఱను సంహరింపఁగా రాక్షససంహారానంతర మింద్రునిఁ బూజించిన ట్లారాముని మునులందఱు బూజించిరి. అంత యజ్ఞము పరిసమాప్తి కాఁగా విశ్వామిత్రమహర్షి దిక్కులన్నియు నిరుపద్రవములై కాన్పించుటఁజూచి రామునితో నిట్లనియె. ‘రామా! నీవలన నేను గృతార్థుఁడనయితిని. నీవు గురువువాక్యమును నెఱవేర్చినవాఁడవయితివి. ఇది సిద్ధాశ్రమ మను మాటను సత్యము చేసితివి” అని రామునిఁ గొనియాడెను.

## 31-వ సర్గము

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులఁదోడ్కొని మిథిలాపురంబునకుఁబోవుట

తా మొప్పుకొనిన కార్యముఁ జేసి ముగించిన పిదప రామలక్ష్మణులు నాఁటిరేయి బహుసంతోషముతోఁగూడి, చింతఁబాసి, హాయిగా నిద్రించిరి. వేకువనే లేచి, వారు ప్రాతరనుష్ఠానంబుల నన్నింటిని ముగించుకొని, విశ్వామిత్రమునీంద్రుఁడు, తక్కిన ఋషులును గూడియున్న తావునకు వచ్చిచేరి, అగ్నిహోత్రుని చందమునఁ దేజరిల్లుచున్న విశ్వామిత్రుని కభివాదనంబు సేసి, బహు గంభీరముగను, నింపుగను నమ్మహామునితో "మునీంద్రా, మే మిరువురమును తమ రాజ్ఞాపించు పనిచేయఁ గాచి యున్నాము. ఇంకను మావలనఁ గావలసిన పను లేవో యాన తీయుఁడు." అని యడుగ నచ్చట నున్న ఋషులు విశ్వామిత్రుని బురస్కరించుకొని రామునితో నిట్లు చెప్పిరి. "నరశ్రేష్ఠా! మిథిలానగరాధీశుఁడగు జనకమహారాజు బహు ప్రసిద్ధమైన యాగ మొక్కటి చేయనున్నాఁడు. మే మచ్చటి కేఁగుదుము. నీవును మాతోడ నచ్చటికి రావలసినది. అచ్చట నొకవింతయైన ధనుస్సున్నది. మిగుల బలమును, గాంతియుఁ గలిగి, వెలుఁగుచున్న యా ధనుస్సు నొక యాగసమయమున జనకమహారాజునకు దేవతలు సంతసించి యొసంగిరి. దేవతలు గాని, గంధర్వులుగాని, అసురులుగాని, రాక్షసులుగాని, యెవ్వరును దాని నెక్కుపెట్టఁజాలక పోయిరి. ఇక మనుజులమాట చెప్పనేల! ఎక్కుడు బలశాలులగు ననేకులు రాజులును, రాజకుమారులును వచ్చి దాని నెక్కిడలేక యవమానపడిపోయి యున్నారు. నరసింహుఁడా, నీవు మాతోడ వచ్చినచో నట నాజనకుని ధనుస్సును, అద్భుతమైన అతని యజ్ఞమును జూడఁగలవు. పూర్వ మొకప్పుడు మిథిలాధిపతియగు జనక మహారాజు యాగముచేయుచోటఁ బ్రకాశింపఁజేయు నీ ధనుస్సును బొందుటయే యాగమునకు ఫలమునుగాఁ గోరెను. దేవతలును నాలాగే య్యా మహారాజునకు దాని ననుగ్రహించిరి. జనకమహారాజు నుత్తమోత్తమ మని కొనియాడఁదగిన యాధనుస్సును దనయింట నుంచి

కొని ప్రతిదినము దానిని నానావిధ సుగంధధూపదీపములచేతఁ బూజ సేయుచు వచ్చుచున్నాఁడు" అని చెప్పిరి.

అనంతరము విశ్వామిత్రమునీంద్రుఁడు రాజపుత్రులగు రామలక్ష్మణులను వెంటఁ బెట్టుకొని, మునిసంఘములతో నటనుండి బయలు వెడలునపుడు ఆ మునీంద్రుఁడు వనదేవతల నుద్దేశించి, "ఓ వనదేవతలారా, మీకు మేలు గలుగునుగాక. ఇచ్చట నా కార్యము బాగుగా నీడేరుటచేత, నే నిచ్చటినుండి వెడలి గంగానది కుత్తరముగా హిమవత్పర్వతమునకుఁ బోవఁ బయనమై యున్నాను." అని చెప్పి సిద్ధాశ్రమమునకుఁ బ్రదక్షిణముగ వచ్చి, తక్కిన మును లందఱు వెంబడి వచ్చుచుండ నుత్తరముఖముగాఁ దిరిగి, బ్రహ్మవేత్తల యగ్నిసాధనములతోఁ గూడిన బండ్లు నూఱులకొలఁదిగా వెంబడి వచ్చుచుండఁ బయనమాయెను. ఆ మునిశ్రేష్ఠునిమీఁద నున్న విశ్వాసముచే నాసిద్ధాశ్రమమమున నున్న మృగములును, పక్షులును నమ్మహామునిని వెంబడించినవి. కొంతదూర మేఁగిన పిదప, విశ్వామిత్రమునీంద్రుఁడు పక్షులను మృగంబులను జూచి వానిని దమ తావులకుఁ బోవ ననుజ్ఞ యొసఁగి పంపెను. బహుదూరము దారి నడచి సూర్యాస్తమయ సమయమునకు వీరలందఱు శోణనదము నొడ్డునఁ జేరిరి.

దినకరుఁ డస్తమింపఁగనే, స్నానము, సంధ్య మొదలగు ననుష్ఠానములు వారందఱు విధిప్రకారముగ ముగించుకొని యచ్చట గూరుచుండిరి. రాముఁడును లక్ష్మణునితోఁగూడఁ దన యనుష్ఠానములను దీర్చుకొని వచ్చి, మునుల నందఱకు నమస్కరించి, విశ్వామిత్రుని యెదుటఁ గూర్చుండిరి. వెండియు రాముఁడు మహామునినిజూచి, కుతూహలముతో "భగవంతుఁడా, యిది యే దేశము? సంపూర్ణములైన వనంబులచే నిది శోభిల్లుచున్నది. ఈదేశవృత్తాంతము నెఱుఁగ నాకు మనంబున నుత్సాహముగలుగుచున్నది" అని యడిగెను. ఇట్లు రాముఁ డడుగఁగా, మహాతపస్సంపన్నుఁడగు విశ్వామిత్రమునీంద్రుఁడు రాముని కోరిక దీర్పఁగోరి, ఋషులందఱు చుట్టుగూర్చుండియుండ నా దేశముయొక్క చరిత్రము నీ క్రిందివిధమునఁ జెప్పఁదొడఁగెను.

## 32-వ స ర్గ ము

విశ్వామిత్రమహామునియొక్క వంశము

మున్నొకకాలమున బ్రహ్మయొక్క కుమారుఁడగు కుశుండను నొక ప్రసిద్ధుఁడైన తపోనిధి యుండెను. అతఁడు వ్రతములు లోపము లేకుండఁ బూర్తి గావించినవాఁడును, సకలధర్మముల నెఱింగినవాఁడును, పెద్దలను సేవించి పూజలొనరించువాఁడును, మేరలేని తపముచేయువాఁడును నై యుండెను. ఆ మహాత్ముఁడు గొప్పవంశమునందుఁ బుట్టినదియు, సకల సుగుణములతోఁ గూడినదియు నైన వైదర్భి యనునొక రాజపుత్రిని బెండ్లాడి, యామెయందుఁ దనతో సాటివచ్చువారును సుగుణములు గలవారునైన కుశాంబ, కుశనాభ, అధూర్తరజస, వసువు లనెడి నలువురు కొడుకులను గనెను. ఆ కుశుఁడు క్షత్రియధర్మమును యథావిధిగా నడపఁగోరి క్షేత్రతేజమును, మహోత్సాహమును, స్వధర్మాసక్తియు, సత్యమును గల తన నలువురు కొడుకులం బిలిచి, "కుమారులారా! మీరు భూలోకమున న్యాయముగాఁ బ్రజాపరిపాలనము చేసి, పుష్కలముగా ధర్మము నార్జింపుఁడు. అని చెప్పెను.

లోకములకుం బ్రియులైన యా రాజకుమారులు నలువురు ఋషిశ్రేష్ఠుఁడైన తమతండ్రి చెప్పినమాట విని, తమతమ రాజ్యభాగములఁ బంచుకొని, గొప్పపట్టణముల దమకుఁ బ్రధానపట్టణములనుగ నేర్పఱచుకొని, రాజ్యమేల నారంభించిరి. వారిలోఁ గాంతిమంతుఁడగు కుశాంబుఁడు కౌశాంబి యను నొక పట్టణము నేర్పఱచుకొనెను. ధర్మాత్ముఁడయిన కుశనాభుఁ డెక్కువ సంపదగల మహోదయ మను పురంబును రాజధానినిగాఁ జేసికొనెను. అధూర్తరజస నృపాలుఁడు ధర్మారణ్య మనుపురమును, వసువు గిరివ్రజ మనుపురమును రాజధానులనుగ నేర్పఱచుకొనిరి. రామా! యిపుడు మన ముందునది మహాత్ముఁడైన యావసుమహారాజుభూమి. ఈ దేశముచుట్టును బహుసుందరములైన యైదుపర్వతము లమరియున్నవి. ఈ యైదుపర్వతములనుండి పుట్టి, మగధదేశమునకుఁ బూలమాలికవలె నున్న మాగధి యనఁబరగు శోణనద మీ దేశమును సకల సస్యములతో నిండినదానినిగాఁ జేయుచున్నది. ఈ శోణనదము తూర్పుదేశమునుండి పడమటి వైపునకుఁ బ్రవహించు

చున్నది. దీని గట్టున నున్న పొలము లెల్లను సారవంతములై, సకల సస్యములతోఁ గూడియున్నవి.

రఘునందనా, కుశనాభుఁ డను రాజర్షికి ఘృతాచియందు నూఱువురు సొగసుకత్తెలగు కూఁతులు పుట్టిరి. ఆ నూఱువురు కన్యలును వయసు వచ్చినపిదప నొకదినమునఁ దమ దేహములను భూషణములచే నలంకరించుకొని, వర్షాకాలమునందలి మెఱుములవలె వెలుఁగుచు, నొక యంతమైన తోఁటకుఁ బోయి, యాడుచుఁ బాడుచు, వీణె మొదలగు వాద్యముల వాయించుచుఁ, దమ కాలము నతివినోదముగాఁ బుచ్చుచుండిరి. సుందరములయిన సర్వావయవములు గలవారును, బుడమియందు రూపమున సాటి లేనివారును నై యా రాజకన్య లాయుద్యానంబునందుఁ బ్రకాశించుచుండిరి.

ఇట్లు సకల శుభలక్షణములతోను, సద్గుణములతోను, ప్రాయముతోను వెలుఁగుచున్న యా పడుచుల నందఱను జూచి సర్వాంతర్యామియైనవాయుదేవుఁడు "ఓకాంతామణులారా, మిమ్ము నందఱ నేను వరించుచున్నాఁడను. మీరందఱు నన్నుఁ బెండ్లాడుఁడు. మీకందఱకీ మనుష్యత్వము పోయి దేవత్వము వచ్చునట్లు వరం బొసంగెదను. మీరు దేవత్వము పొందుటచే మరణము లేక, దీర్ఘాయువు గలవారలై యుందురు. అందఱకును యౌవనంబు నిలుకడ లేనిది. అందును మనుజులం దది మిక్కిలి నిలుకడ లేనిది. మీరు నన్నుఁ బెండ్లియై, యెప్పటికిఁ దఱుగని జవ్వనము గలవారలై దేవత్వము నొందుదురు" అని చెప్పెను.

అడ్డగింపనలవికాని కార్యములఁ జేయు నవ్వాయుదేవునియొక్క వాక్యముల నానూర్వురు పడుచులు విని, గొల్లన నవ్వి, యావాయుదేవునిఁ జూచి, "దేవతలలో శ్రేష్ఠుఁడైనవాఁడా, నీవు సకల భూతములలోపలను సంచరించువాఁడవు? మే మందఱము నీ ప్రభావము నెఱింగినవారమే. అట్లున్నను నీవు మమ్మేల యి ట్లవమానించి మాట్లాడితివి? దేవతోత్తమా, మే మందఱము కుశనాభమహారాజు కూఁతులము. ఇది మీకుఁ దెలియదా? మమ్ము నవమానించెడు నీవు దేవతవుగా నున్నను, నిన్ను మాతపోమహిమచే నీస్థానమునుండి తొలఁగించుటకు మాకు శక్తి గలదు. కాని మాతపస్సును మేము కాపాడుకొను

చున్నాము. ఓరీ దుర్మతీ! మాతండ్రి నీకు మృత్యువుగాకుండుగాక. సత్యవేదియగు మాతండ్రి నవమానింపకుము. మేము మాతండ్రి నిర్ణయించిన పురుషుని బరిణయమయ్యెదము. తండ్రియే మాకుఁ బ్రభువు. తండ్రియే మాకుఁ బరమదైవము. మాతండ్రి మమ్ము నెవరికిచ్చునో, యతఁడే మాకు భర్త యగు" నని చెప్పిరి.

ఇట్లా కన్యలు చెప్పిన మాట విని, వాయుదేవుఁడు మిక్కిలి యలిగినవాఁడై, వారి దేహములలోఁ బ్రవేశించి, చేతులు కాళ్ళు మొదలగు నవయవములు పట్టుకొనిపోయి కుఱుచ లగునట్లు చేసెను. ఈవిధమున నాకన్యలు వాయుదేవునిచేఁ గుఱుచలుగాఁ జేయఁబడి, తమ యందమైనమే నవలక్షణమయ్యెనని మిక్కిలి సిగ్గును, వ్యసనమును గలవారలై, కన్నీరు విడుచుచుఁ గడువేగముతోఁ దమతండ్రికడ కేతెంచి నేలమీఁదఁబడిరి. అంతఁ గుశనాభుఁడును కడుసొగసుకత్తెలగు తన ముద్దుఁగూఁతులు చేతులు కాళ్లు పట్టుకొనిపోయి, యట్లు వ్యసనముతో వచ్చిన రీతిని జూచి, తత్తరపడినవాఁడై, తన కూఁతులం జూచి, "తల్లులారా, యేమి యిది చెప్పుఁడు! ఎవఁడిట్టియన్యాయమునకుఁ బాలుపడెను. మిమ్ము నెవఁడిట్లు కుఱుగుజ్జులఁ జేసెను? ఏల మీరు పరుండి పొరలుచు మాటలాడకున్నారు" అని యడిగెను. ఇట్లడుగుచు నిట్టూర్పునిగిడించి, వారు చెప్పినమాటలు లెస్సగా నాలకించుటకై సావధానుఁడై యతఁడు యుండెను.

## 33-వ సర్గము

### విశ్వామిత్ర జన్మవృత్తాంతము (కుశనాభుని యోర్పు)

కుశనాభుఁ డివ్విధమున నడిగిన పలుకులు విని యాతని నూర్వురు కూఁతులును శిరములు సోఁక తండ్రిపాదములకు నమస్కరించి "తండ్రీ, సకల ప్రాణులలోపల సంచరించు వాయుదేవుఁడు దుర్బుద్ధి పుట్టుటచే మమ్ము భంగపఱుపఁ గోరి బెదరించెను. అతఁడు న్యాయమార్గముఁ దప్పి యన్యాయమునందుఁ దలంపుపెట్టెను. అప్పుడాతనితో మేము "మాకుఁ దండ్రియున్నాఁడు. నీకు శుభమగుగాక. మేము స్వతంత్రలము గాము. మాతండ్రి నీకొసఁగునేని ఆయ నడుగు" మని పలికితిమి. "అయిన నా చెడుతలంపుగల వాయుదేవుఁడు మా వేఁడికోలు పుచ్చుకొనక,

మమ్ము నందఱను మఱుగుజ్జలను గావించెను” అనిరి. గొప్పధార్మికుఁడును, కాంతి గలవాఁడునైన కుశనాభుఁడు తన కూఁతులు చెప్పిన పలుకులు విని, తన నూర్వురు కూఁతులతో నిట్లనెను. “బిడ్డలారా, ఓర్పు అనునది గొప్పతనమున కుండవలసిన లక్షణము. మీరందఱు నైకమత్యము గలిగి గొప్పకార్యంబు సేసితిరి. మన కులగౌరవమును గాపాడితిరి. ఆఁడువారికిఁ గాని, మగవారికిఁగాని ‘యోర్పు’ అనునదే యొక గొప్పభూషణము. సకల జనులును నోర్పుగలిగియుండరు. అందును దేవతలకుఁ దఱుచుగా నోర్పనుమాటయే లేదు. మీకందఱ కిప్పు డెంత యోర్పు గలిగెనో, యంత యోర్పు మీకందఱికి నెల్లప్పుడు నుండుట మంచిది. బిడ్డలారా, క్షమయే దానము. క్షమయే యజ్ఞము. క్షమయే సత్యము. క్షమయే కీర్తి. క్షమయే ధర్మము. సమస్త ప్రపంచము క్షమచేతనే నిలిచియున్నది.” అని తనకూఁతులతోఁ జెప్పి, వారిని బంపించి, తా నన్ని యాలోచనలందు నేర్పరి గనుక, “ఇఁక మనము మనకూఁతులకుఁ బెండ్లిసేయకుండుట సరిగాదు. మనకులమునకు, గోత్రమునకుఁ దగిన వరుని వెదకి శుభముహూర్తమున వీరిని మంచిచోట నిచ్చి వివాహముచేయవలయు”నను విషయమును మంత్రులతోడ నాలోచింపఁ దొడఁగెను.

కుశనాభుఁడు రాజ్యము సేయుచున్న కాలములోనే చూళి యను నొక గొప్ప తాపసుఁ డుండెను. అతఁ డస్ఖలితబ్రహ్మచారియు, ఆచారసంపన్నుఁడు నై వైదికమగు తపస్సును చేయుచుండెను. తపస్సు చేయుచుండు నమ్మునివరునికి నూర్మిళయొక్క కూఁతురైన సోమద యను గంధర్వకాంత శుశ్రూష చేయుచుండెను. ఓరామా, నీకు మేలుగలుగుఁగాక. ఆ సోమద యివ్విధంబున నమ్మునీంద్రునకు శుశ్రూష సల్పుచుఁ గడు ధర్మాత్మురాలై యుండఁగా, నమ్మునిపుంగవుఁ డామెయొక్క శుశ్రూషచేఁ గడు సంతసంబు నొంది, కాలయోగముచే నాసోమదం జూచి, “ఓసుగుణా, నీయొక్క పరిచర్యకుఁ గడుసంతసమందితిని, నీకు మేలయ్యెడు. నీకేమి వరము గావలెనో వేఁడుమిచ్చెద”ననెను. అమ్ముని తనయెడ మిక్కిలి ప్రేమగల్గి యున్నాఁడని యెఱింగి, కడుసంతసము నొందినదై, తాను మాటలలో నేర్పరి గనుక, మధురస్వరముతో

నమ్మునివరునితో నిట్లనెను. "ఓమునీంద్రా! సకల ధర్మముల నెఱింగిన వాఁడా! బ్రహ్మసంబంధమైన తపస్సునందు సిద్ధినొంది బ్రహ్మవర్చస్సుతోఁ గూడినవాఁడవై వెలుఁగుచున్న నిన్నుఁ జూచిన బ్రహ్మదేవునిఁజూచి నట్లే యున్నది. ఇట్లు బ్రహ్మతపస్సును, బ్రహ్మవర్చస్సును గల్గియున్న యొకకొడుకు నాకుఁ గలుగవలయును. నాకింతదనుకను భర్తలేఁడు. నేనొక్కనికి నింతవఱకును భార్యనుగాను. నేను నిన్ను శరణుఁ జొచ్చితిని. నాకుఁ దపోమహిమచేఁ గొడుకు ననుగ్రహింపవలయును" అని యడిగెను. ఇట్లాసోమద చెప్పినమాట విన్నచూళి సోమదయొక్క సద్గుణములను, మంచినడతలను జక్కఁగా నెఱింగినవాఁడగుటవలనను, నామె తనయెడ నుంచిన భక్తివిశ్వాసములను జక్కఁగా ననుభవించినవాఁడగుటవలనను, నామెను మిక్కిలి మెచ్చుకొని, తన తపోమహిమవలన మనంబున సంకల్పించి, బ్రహ్మదత్తుఁడను నొకపుత్రుని సృజించి యామె కొసఁగెను.

ఆసోమదయొక్క పుత్త్రుఁడగు బ్రహ్మదత్తుఁడు విశేషకాంతితోఁ గూడినవాఁడై, దేవేంద్రుఁ డమరావతిం బాలించునట్లు, కాంపిల్యపురమును బాలించుచుండెను. ఓకాకుత్స్థుఁడా! ధర్మముల నెల్ల నెఱింగిన కుశనాభుఁడు తన నూర్వురు కూఁతులను బ్రహ్మదత్తున కొసఁగుటకు మనమున నిశ్చయించుకొనెను. అట్లు నిశ్చయించి, యామహాకాంతిగల కుశనాభనృపాలుఁడు బ్రహ్మదత్తునిబిలిపించి, కడునుప్పొంగుచుండుమనసుతోఁ దన నూర్వురు కూఁతులను నాబ్రహ్మదత్తున కిచ్చెను. ఓరఘునందనా! బ్రహ్మదత్తమహీపాలుఁడు వరుసగా నానూర్వుఱు కన్యలను బెండ్లాడి, యప్సరసలచేఁ జుట్టఁబడిన దేవేంద్రునిమాడ్కి వెలుఁగుచుండెను. ఆబ్రహ్మదత్తునిచేయి యాకన్యలపైఁ దగులఁగనే వారు తమ మఱుగుజ్జితనమును, వికారరూపమును విడిచి, చింతఁబాసి, యతిసౌందర్యముతో వెలయుచుండిరి.

ఇవ్విధముగా వాయుదేవునివలనఁ దన కూఁతులకుఁ గలిగిన యవమానంబుఁ దొలఁగుటఁ జూచి, కుశనాభుఁడు మిక్కిలి సంతసము నొందెను. అంతఁ గుశనాభుఁడు పెండ్లికొడుకగు బ్రహ్మదత్తునికి బహువిధ మర్యాదలు నేసి, యాతని నాతని పత్నులతోను, ఉపాధ్యాయుల

తోను అతని నగరమునకుఁ బంపెను. సోమదయుఁ దన కుమారుఁడు తన కీడైన పడుచులను బెండ్లాడి, వచ్చుటను జూచి, యుప్పొంగి, తన కోడండ్రనందఱను చేతులతోఁ జఱిమి చఱిమి, కుశనాభుని బహు విధంబులఁ గొనియాడి, మనంబున నుప్పొంగి యానందాబ్ధియందు మునింగెను.

## 34-వ సర్గము

### విశ్వామిత్ర జన్మవృత్తాంతము

ఇట్లు బ్రహ్మదత్తుఁడు తన రాజ్యమునకుఁ బోవఁగనే కుశనాభుఁడు పుత్రులు లేమింజేసి, పుత్రసంతతిఁ బడయఁగోరి, పుత్రకామేష్టి యాగము చేయుచుండఁగా, కడుగొప్పవాఁడగు బ్రహ్మమానసపుత్త్రుఁడైన కుశుఁడు తన పుత్త్రుఁడగు కుశనాభనృపాలునిం జూచి, "ఓకుమారా! నీకు బల వీర్యాదులందు సాటివచ్చు ధర్మబుద్ధిగలవాఁడైన గాధి యను పుత్త్రుఁడు నీకుఁ బుట్టఁగలఁడు. వానివలన నీకీర్తి యెల్లదెసలఁ బర్వి శాశ్వతముగా నుండును." అని తనపుత్త్రునితోఁ జెప్పి, యాకాశము సొచ్చి, శాశ్వత మగు బ్రహ్మలోకంబునకుఁ బోయెను.

అంతఁ గొంతకాలమునకు వివేకియైన యా కుశనాభునకుఁ గడు ధర్మాత్ముఁడగు గాధియను పుత్త్రుఁడు పుట్టెను. ఓ కాకుత్స్థుఁడవైన రామ చంద్రా! నే నాగాధిరాజునకుఁ బుత్త్రుఁడను. నేను గుశికునివంశమునఁ బుట్టుటంజేసి, నన్నుఁ గౌశికుండనియుఁ బిలుతురు. నాకక్కయగు సత్య వతియను నామె యొకతె యుండెను. ఆమెను ఋచీకుని కిచ్చిరి. ఆమె మహాపతివ్రత. ఆమె తనభర్తకు శుశ్రూష సేయుచుండి యాతనితోడ బొందితోనే స్వర్గము నొందినది. మఱియు నామెయే జనులకు మేలు గలుగవలెననికోరి, పరమపావనమైన కౌశికియను నదీరూపమున హిమ వత్పర్వత ప్రాంతమునఁ బాఱుచున్నది. పవిత్రజలముగల ఆనదియందు మునిఁగినవారి పాపములెల్లఁ దొలఁగును. ఆసత్యవతి మహాపతివ్రతయు, సత్యముఁ దప్పనిదియు, ధర్మమున నిలుకడగలదియు నై పతిశుశ్రూష చేయుచు మహాత్మురాలని ప్రసిద్ధినొందినది గాన నామె రూపాంతరమగు

కౌశికి యను నీనదియు నదులలో నెల్లఁ బరమోత్తమమని ప్రసిద్ధివడసి యున్నది. నేనును నాయక్కయందలి చెలిమిచే హిమవంతము పార్శ్వమున నీకౌశికీనదీతీరంబున నున్నవాఁడను. నేనొకయాగము దలపెట్టి, యాకౌశికీనదిఁ బాసి యీసిద్ధాశ్రమముఁ జేరితి. నీప్రతాపమువలన నాతలఁచినకార్యము నెఱవేఱెను. ఓరామా! నీవడిగితివి గాన, నీదేశ చరిత్రమును నావంశచరిత్రమును జెప్పితిని. నేను కథలు సెప్పుచుండుటచే సగమురాత్రి గడచినది. ఇఁక నీవు పరుండి నిద్దురపొమ్ము. నీకు మేలయ్యెడు. మనకు దారిలో నేమియు నాటంకము గలుగకుండుఁగాక! రఘునందనా! చెట్లన్నియుఁ గదలక మెదలక యున్నవి. మృగములు, పక్షులు తమతమ యిరవులలోఁజేరి నిద్రించుచున్నవి. దిక్కులంతటఁ గటికి చీకటి గ్రమ్మియున్నది. సంజచాయ తొలఁగి, యాకాశము నేత్రములవంటి నక్షత్రములతోఁ గూడినదై, వానికాంతులచే వెలుఁగుచున్నది. పుడమియందుఁ బర్వియుండు చీకటిఁ బోఁగొట్టుచుఁ జందమామ దన చల్లని కిరణముల వ్యాపింపఁజేయుటచే లోకములందలి జంతువుల యుల్లముల కుల్లాసం బొదవుచు నుదయించుచున్నాఁడు. రాత్రులందుఁ దిరుగు సకల జంతువులును నడయాడుచున్నవి. నంజుడు దినువారై వెఱపుఁగల్గించు యక్షులు, రక్కసులు నచ్చటచ్చటఁ దిరుగుచున్నారు" అని చెప్పి విశ్వామిత్రుఁడు తనమాట చాలించెను. అంతఁ గూడవచ్చిన మునులందఱు విశ్వామిత్రునిమాటలు 'బాగుబాగ'ని తల యూచి, యతనిని జూచి "ఈకుశికవంశము గొప్ప మహిమగలది. ఎల్లప్పుడు ధర్మముఁ బాయకుండునది. ఈకుశికవంశమునఁ బుట్టినవారందఱు పురుష శ్రేష్ఠులు; గొప్పవారు; బ్రహ్మదేవునిఁ బోలువారు. వారందఱిలోఁ గీర్తిమంతుఁడగు విశ్వామిత్రుఁడ వను నీవును, నీయక్కయగు నదీశ్రేష్ఠరూపమైన కౌశికియు నాకులమునకు వన్నె దెచ్చినవారలు"అని యాతనిని బొగడిరి. ఇట్లు మునీంద్రులందఱు దన్నుఁ గొనియాడుచుండ బ్రహ్మతేజస్సుగల విశ్వామిత్రుఁడు కాంతియుక్తుఁడైన సూర్యుఁ డస్తమించునట్లు నిద్రించెను. రాముఁడును లక్ష్మణుఁడును యించుక యాశ్చర్యము నొంది విశ్వామిత్రమునీంద్రునిఁ బొగడి, కూడఁబరుండి, దారి నడకవలని బడలికతో బాగుగ నిద్రించిరి.

## 35-వ సర్గము

### గంగానదీ ప్రభావము

ఇవ్విధమున విశ్వామిత్రుఁడు మహర్షులతోడ శోణనగరముగట్టున నారేయి గడపి వేఁకువను లేచి, రామునికడకుఁ బోయి, "రఘునందనా! చక్కఁగాఁ దెల్లవాఱినది. లేలెమ్ము. ప్రాతస్సంధ్యాకాలము సమీపించి నది. వేగిరముగా నాహ్నికములు దీర్చుకొని, దారినడచెదము" అని చెప్పెను. అంత రాముఁ డమ్మునీంద్రునిమాటలు విని, వెంటనే లేచి ప్రాతరాహ్నికముల నెల్లఁ దీర్చుకొని, పయనమునకు నాయితుఁడై, "ఈశోణనదము బహు రమ్యమైయున్నది. లోతులేక ఇసుకతిన్నెలచే వెలయుచున్నది. ఏదారిని మన మీశోణనదమును దాఁటుదము" అని యడిగెను. అంత విశ్వామిత్రమునీశ్వరుఁడు "ఋషులందఱు వాడుకగా దాఁటెడి యీదారినే మనము దాఁటవలయును" అని బదులు సెప్పెను.

ఇట్లు చెప్పిన విశ్వామిత్రుని మాటను విని, యందఱు వేగ శోణ నదము దాఁటి, విశ్వామిత్రుని వెంబడిఁ బోవుచు, సకలవిధములగు నర ణ్యములఁ జూచుచుఁ గడుదూరము చని, మధ్యాహ్నకాలము వచ్చు నప్పటికి, సకల ఋషులచే నుపాసింపఁబడుచుండు నదీశ్రేష్ఠమైన గంగా నదిని జూచిరి. హంసలు, బెగ్గురుపక్షులు మొదలగువానితోఁగూడి పవిత్రమగు తేటనీరు గలిగియుండు గంగానదిని జూచి, మునులందఱును రామలక్ష్మణులును గడుమోదమందిరి. అంత వారందఱు నాగంగానది యొడ్డున విడిసి, ఆనదియందు స్నానముచేసి యథావిధిగ దేవపితృతర్పణ ములు గావించి, ఔపాసనములు సల్పి, హోమశేషమును భుజించి, పవిత్రమైన గంగానదీతీరమున విశ్వామిత్రునిచుట్టును గూర్చుండి, బడలిక దీర్చుకొనుచుండిరి. రామలక్ష్మణులును నమ్మహామునియొక్క చేరువను గూర్చుండియుండిరి.

అపుడు శ్రీరామమూర్తి విశ్వామిత్రమునీంద్రునిఁ జూచి, "భగ వంతుఁడా! గంగానది మూఁడుపాయలై మూఁడులోకములం దెట్లు పాఱి, సముద్రములోఁ గలియుచున్నది? ఈగంగామహిమ వినవలయు

నని యాశపడియున్నాను” అని వేఁడుకొనెను. ఇట్లు శ్రీరాముఁ డడుగఁగనే విశ్వామిత్రమహర్షి గంగయొక్క పుట్టుకను, పెంపును గూర్చి చెప్పుట కారంభించెను.

సకల లోహములకును నుత్పత్తిస్థానమైన హిమవంతుఁడను నొక గొప్పపర్వతరాజు గలఁడుగదా! అతనికిఁ బుడమిని సాటిలేని రూపము గల యిరువురు కూఁతులు పుట్టిరి. ఆయిరువురికిని దల్లి మేరుపర్వతరాజు పుత్రికయు, హిమవంతునికిఁ బ్రియపత్నియు సొగసుకత్తెయు నగు మనోరమ యను నామె. హిమవంతున కామనోరమయం దీగంగ పెద్దకూఁతురుగఁ బుట్టినది. ఆమెకు వెంబడి ఉమ యను రెండవకూఁతురు పుట్టినది. తొల్లి యొకప్పుడు దేవతలందఱు హిమవంతునికడ కేఁగుదెంచి, “ఓపర్వతరాజా! తమ కుమార్తె యగు గంగ స్వర్గమర్త్యపాతాళలోకములు మూఁటియందుఁ బ్రవహింపవలయును. ఆమెవలన దేవతలమయిన మాకుఁ గొన్నిపనులు గావలసియున్నవి” యని ప్రార్థించిరి. అంత హిమవంతుఁడును మూఁడులోకములకును మేలుసేయఁగోరి, స్వేచ్ఛగాఁ దిరుగునదియు, లోకములఁ బావనంబు సేయునదియు నైన తన కూఁతురగు గంగను యాచకుల మనోరథము విఫలంబు సేయరాదని యెంచిన వాఁడై దేవతల కొసఁగెను. అంత దేవతలందఱు ముల్లోకముల మేలు సేయఁగోరువారై, యాగంగాదేవిని బడసి, తమకార్యము నెఱవేరుటచే మనంబులం దానందము నొంది స్వర్గలోకమునకుఁ జనిరి. గంగయు ముల్లోకంబులఁ బ్రవహించి, వాటిని బావనంబు చేసెను. రఘునందనా! హిమవంతుని రెండవకూఁతురగు నుమ యను నామె కఠినవ్రతముఁ బూని, తపస్సే ధనముగా నెంచినదగుటచేఁ దపము సేసెను. ఇట్లుగ్రమగు తపస్సుచేసి, సకల జనులచేఁ బొగడఁబడునట్టి తన రెండవకూఁతురగు నుమాదేవిని సాటిలేని మహిమము గల పరమశివుని కిచ్చి వివాహము చేసెను. నదులలో నుత్తమురాలగు గంగయు, నుమాదేవియు నీహిమవంతుని కూఁతులు. వీరిద్దఱు జనులచేఁ గొనియాడఁబడువారు. మూఁడుదారులఁ బ్రవహించు గంగ, సర్వదా జలముగలిగినదై మొదట నాకాశమార్గమునంబోయి స్వర్గలోకము నొంది వెలయుచున్నది.

## 36-వ సర్గము

### గంగయొక్కయు, ఉమయొక్కయుం జరిత్రము

ఆమహాముని యివ్విధమునఁ జెప్పఁగా, శూరులైన రామలక్ష్మణు లాకథను విని సంతసించిరి. అంత రాముఁడు మునిశ్రేష్ఠునితో నిట్లనియె, 'ఓమహాత్మా! తాము చెప్పిన కథ బహుపుణ్యప్రదమైయున్నది. పర్వతరాజగు హిమవంతుని పెద్దకూఁతురగు గంగయొక్కచరిత్రమును విస్తరించి చెప్పవలయును. ఆమె దేవలోకమున నేమిసేసినది? ఈభూలోకమున నేమిసేసినది? తాము విస్తరించి చెప్పవలయును. అన్నింటిని విస్తారముగా నెఱింగినవారుగదా తాము! లోకములను బవిత్రము చేయు నీగంగానది యేకారణముచే మూఁడుపాయలుగాఁ జీలి ప్రవహించినది? మఱియు నీనదీశ్రేష్ఠమగు గంగానది మూఁడుపాయలై మూఁడులోకములందుఁ బాఱి యచ్చటచ్చట నేయేకార్యములుచేసి ప్రసిద్ధినొందినది. ఓధర్మజ్ఞుఁడ వయిన మహామునీ! నీ వీవిషయంబు సవిస్తరముగ వినిపింపవలయు"నని శ్రీరాముఁడు విశ్వామిత్రునిఁ బ్రార్థించెను. ఇట్లు కకుత్థ్సవంశజుఁడయిన రాముఁడు ప్రశ్నవేయఁగా, విశ్వామిత్రమునీంద్రుఁడు ఋషులందఱు వినుచుండ, గంగయొక్క కథనంతయు సవిస్తరముగాఁ జెప్పఁదొడంగెను. "రామచంద్రా! తొల్లి యొకప్పుడు దీర్ఘకాలము తపమొనరించిన శంకరుఁడు పార్వతినిబెండ్లాడి, యామెపై మోహముఁగొని, సంసారసుఖము ననుభవించుచుండెను. ఇట్లాశంకరుఁడు పార్వతితోఁగూడి నూఱుదేవవత్సరములు సంసారసుఖము ననుభవించుచున్నను, నామెయం దాతనికిఁ బుత్రోత్పత్తి యింకను గలుగదయ్యె. అప్పుడు బ్రహ్మదేవుఁడు మొదలగు దేవతలందఱు "పార్వతియందుఁ బుట్టఁబోవు పుత్త్రుని నెవ్వఁడోర్వఁగలఁడు?" అని మిక్కిలి వెఱచినవారలై భగవంతుఁడగు శంకరునికడ కేతెంచి, నమస్కరించి యిట్లనిరి. "ఓభగవంతుఁడా! దేవదేవుఁడా! లోకమునకు మేలుసేయుటయందే శ్రద్ధగల యోమహేశ్వరా! దేవతలమగు మేము నమస్కరించుచున్నాము. మాయందనుగ్రహము సేయవలయు. ఓదేవోత్తమా! నీవీర్యమువలనఁ బుట్టిన పుత్త్రుని లోకంబులు భరింపఁజాలవు. కావున దాము వేదోక్తమగు యోగమునొంది తమ దేవితోడఁగూడి తపంబు సేయవలయు. లోక

ముల మేలుకై తమ తేజస్సును తమయందే నిల్పికొనుఁడు” అని దేవతలు పలుకఁగా, సకలలోకములకు నధిరాజగు పరమేశ్వరుఁడు దేవతల వాక్యమును విని వారి మాటల“కట్ల” కానిండని యొప్పుకొని, మఱల వారలతో నిట్లనియె. “ఓ దేవతలారా, నేను నా శరీరమునందే నా వీర్యమును ధరించెదను. పార్వతియుఁ దన శోణితమును దన శరీరమునందే నిలుపుకొనును. దానివలన దేవతలును, భూమియు నెమ్మదిం బడయుదురుగాక. అయినను నిప్పుడు వీర్యస్థానంబునుండి జాఱిన శ్రేష్ఠమగు వీర్యము నెవ్వరు ధరింపఁగలరో? దానిని నాకుఁ జెప్పుఁడు” అని పరమేశ్వరుఁ డడుగఁగా, దేవతలు “పరమేశ్వరా, యిపుడు స్థానంబునుండి చలించిన యీ వీర్యమును భూదేవి ధరింపఁగలదు” అని పరమేశ్వరునితోఁ జెప్పఁగా నా పరమశివుఁ డా వీర్యమును భూమిపై విడువఁగా, నా వీర్యము పర్వతములు, నదులుగల భూమియంతయు నిండెను. అంతట దేవత లగ్నిహోత్రుని జూచి, “ఓ యగ్నీ, నీవు వాయుదేవునితోఁగూడి రుద్రవీర్యములోఁ బ్రవేశింపు” మని చెప్పిరి. అంత నగ్నిదేవుఁ డా వీర్యములోఁ బ్రవేశించెను. అటుపిమ్మట నా వీర్యము శ్వేతపర్వతమై యొప్పెను. మఱియు నది యగ్నివలెను సూర్యునివలెను జ్వలించు శ్రేష్ఠమైన రెల్లు (శరవణము) తోఁపుగా నయ్యెను. శరవణమునందు మహాకాంతిగల కుమారస్వామి పుట్టెను. అతనిని కృత్తిక లాఱుగురును బాలిచ్చి పెంచుటచే నతఁడు కార్తికేయుఁడనియు, అగ్ని హోత్రునివలనఁ బుట్టుటచే నగ్ని సంభవుఁడనియుఁ బేర్లు వహించెను. అంత దేవతలు ఋషిగణంబులతోడఁ గడు సంతోషమును బొంది యప్పరమేశ్వరునిఁ బార్వతీదేవిని మిగుల భక్తితోఁ బూజలు నేసిరి.

ఓ రామా! యంతటఁ బార్వతీదేవి కోపముచే నెఱ్ఱనైన కన్నులు గలదై, యనగడముఁ దెలుపుచు దేవతలను భూదేవిని శపింపఁగోరి, దేవతలం జూచి, “ఓ దేవతలారా, పుత్రసంతతికై నా ప్రాణనాథునితో రమించుచున్న సమయమున నాటంకమును గలుగఁజేసితిరి గాన, మీరు మీ భార్యలందుఁ బుత్రులఁ బడయక యుందురుగాక! ఇదిమొదలు మీరు సంతతిలేనివారలై యుందురుగాక!” యని దేవ

తలను శపించి, భూదేవిం జూచి, "యోసీ, నా ప్రాణనాథుని వీర్యము నీవు దాల్చితివిగాన నీవు నానారూపములుదాల్చి పలువురకుఁ బత్నివై యుందువు. మఱి నాకుఁ గొడుకులు పుట్టుట కిష్టపడకుంటివి గాన నా కోపముచేఁ బాపాత్మురాలవుగాఁ జేయఁబడినదానవై నీ వెప్పటికిని బుత్రులవలనఁ గలుగు సంతసము నొందఁజాలవు" అని భూదేవిని శపించెను.

అప్పుడు పరమేశ్వరుఁడు సిగ్గుపడియున్న దేవతల నెల్ల వీడ్కొలిపి, వరుణునిచే నేలఁబడు పశ్చిమదిశ కేఁగి, యచ్చట హిమవత్పర్వతముయొక్క యుత్తరప్రదేశమున నుండు నొక శిఖరంబునఁ బార్వతీదేవితోఁగూడి తపం బొనరించుచుండెను.

ఓ రామా, నేను నీ కిప్పుడు పార్వతియొక్క జన్మవృత్తాంతము విస్తరించి చెప్పితిని. ఇఁక *గంగయొక్క పుట్టుకను గూర్చి చెప్పెదను. నీవును లక్ష్మణునితోఁగూడ గమనించి వినవలయు నని విశ్వామిత్రుఁడు రామునితోఁ జెప్పెను.

## 37-వ సర్గము

### కుమారస్వామి పుట్టుక

ఇట్లు పరమశివుఁడు పార్వతితోఁ గూడ హిమవంతముఁ జేరి, తపస్సు చేయుచుండఁగాఁ, దొల్లి యొకప్పుడు, ఇంద్రుఁడు, అగ్నిహోత్రుఁడు మొదలగు దేవత లందఱు మహర్షి సమూహములతోఁ గూడి, తమకు సేనాధిపతి నొకనిని నేర్పఱచుకొనఁగోరి, బ్రహ్మదేవుని కడకుఁ బోయిరి. అట్లు పోయి, యగ్నిహోత్రుని ముందుంచుకొని, దేవతలంద ఱింద్రునితోఁగూడ భగవంతుఁడగు నలువకు నమస్కరించి యిట్లనిరి. "ఓ భగవంతుఁడా, నీవు మాకు మున్నొక సేనానాయకు నేర్పఱచితివి. అతని తండ్రియగు శంకరుఁ డిప్పుడు పార్వతితోఁగూడ నుగ్రమయిన తపస్సుచేయుచున్నాఁడు. కావున నీవు లోకము మేలు గలుగుటకై, యిప్పుడు చేయఁదగు పని చేయవలయు. ఏపని నెట్లు చేయవలసినదియు నెఱిఁగిన వాఁడవు. కనుక తగు నేర్పాటు చేయ

* గంగానదివలనఁ బుట్టిన కుమారస్వామినిగూర్చి చెప్పెదనని మహేశ్వరతీర్థుల వ్యాఖ్యానము.

వలయును. నీవే మాకు దిక్కు." అని దేవతలు ప్రార్థింప లోకముల కెల్ల సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁ డా వేల్పుల పలుకు లాలకించి, యా వేల్పులను మంచిమాటలచే నోదార్చుచు నిట్లనియె. "ఓ దేవతలారా, మీకు మీపత్నులందు బిడ్డలు పుట్టరని పార్వతీదేవి శాపం బొసఁగెనుగదా. ఆమెమాట తప్పదు. అది సత్యము. సంశయము లేదు. ఇదిగో యాకాశగంగ యున్నదిగదా. దేవతల కెల్ల సేనానాయకుఁడును, శత్రువులను సంహరించువాఁడునైన పుత్రును నగ్నిదేవుం డీ గంగాదేవియందుఁ బుట్టింపఁగలఁడు. పర్వతములకు ఱేఁడగు హిమవంతుని కామె పెద్దకూఁతురు. ఆమె యా కొమరునిఁ బ్రేమతోఁ గైకొనును. పార్వతికిని ఈ విషయ మొప్పియుండును. సందియము లేదు" అని, బ్రహ్మదేవుండు చెప్పఁగా దేవత లందఱు 'మహాత్మా, తమ కృపవలన మేము ధన్యుల మైతిమి. మా పనులు చక్కఁబడినవి' యని చెప్పి బ్రహ్మదేవునికి నమస్కరించి పూజించిరి. అంతట వారు బ్రహ్మదేవుని యాజ్ఞవడసి, లోహము లన్నింటిచే వెలుఁగుచున్న వెండికొండ కేఁగి, పుత్రోత్పాదనంబునకై యగ్నిహోత్రునినియమించి, "యోహుతాశనా, పర్వతరాజగు హిమవంతునికిఁ గూఁతురగు గంగయందు శివునివలన నీవు దాల్చియున్న వీర్యమును విడువుము. ఇది దేవతల కందఱకుఁ గావలసిన కార్యము. నీ వీకార్యంబు బాగుగఁ జేయుము" అని యానతీయఁగా, పావకుఁ డట్లే యని దేవతలతోఁ జెప్పి, గంగాదేవికడ కేతెంచి, 'యో దేవీ! నీవు గర్భము దాల్పుము ఇది దేవతల కెల్ల నిష్టమగు కార్యము" అని చెప్పెను. గంగాదేవి యగ్ని పలుకులు విని నదీరూపమువిడిచి, యందమైన స్త్రీరూపముఁ దాల్చి యగ్నిహోత్రునియెదుట నిలఁబడెను. అంతట నా జ్వాలనుఁ డమ్మగువయొక్క సొబగు చూచి మోహించి, యా వీర్యంబును దన యవయవములనుండి విడిచి, యా గంగాదేవి నంతటఁ దడిపెను. ఆమె యన్ని యంగము లా వీర్యముతో నిండెను. అప్పుడు గంగాదేవియొక్క యన్ని యంగము లా వీర్యముయొక్క వేఁడిమిఁ దాళఁజాలని వాయెను. అంత గంగాదేవి యా తేజంబు దాల్పఁ జాలక, మిక్కిలి నొచ్చినదై, "యగ్నిహోత్రుఁడా, నీవు నాయం దుంచిన వీర్యము నేఁ దాల్పఁజాలకున్నాను. దాని వేఁడిమి నాయన్నియంగము

లను గాల్చుచున్నది. నే నీవీర్యమును దాల్పఁజాలను.” అని సకల దేవతలకు ముఖ్యమయిన యగ్నిహోత్రునితోఁ జెప్పెను. అప్పుడు సకల దేవతల యజ్ఞభాగములగు హవిస్సులు ఆశనముగాఁగల యగ్నిహోత్రుఁడు గంగాదేవితో “నా వీర్యము నీ హిమవంతమందలి యొక తిప్పపై నుంచుము” అని చెప్పెను. ఆ ప్రకారమే గంగాదేవి దోషార్వాని వేఁడిమిగలదై వెలుఁగుచుండు గర్భమును దన యంగములనుండి యా హిమవంతమందలి యొక తిప్పపై వదలెను. ఆ వీర్యమునుండి తళతళ మెఱయు బంగారు, వెండియుఁ బుట్టినవి. ఆ వీర్యముయొక్క క్షారము చేత రాగియు, గాఱినుమును బుట్టినవి. ఆ వీర్యముయొక్క మలమే తగరముగాను, సీసముగాను నయినది. ఇట్లావీర్యము పుడమిపైఁ బడి, యనేక ధాతువులుగా పెంపొందినది. ఆ గంగాదేవి యా గర్భమును హిమవత్పర్వతమునం దుంచగనే, యా పర్వతమునందలి సమస్తమును బంగారుమయమై వెలుఁగుచుండెను. పురుషశ్రేష్ఠుఁడవగు రామమూర్తీ, బంగారము అగ్నికి సాటివచ్చు కాంతిగలదై, యది మొదలు ‘జాతరూపము’ అని పేరు దాల్చెను. ఆ పర్వతమందలి కసవుచెట్లు, తీఁగెలు, పొదలు బంగారుమయములై వెలుఁగుచుండెను. అప్పుడు దేవేంద్రుఁడు మున్నుగా గల దేవత లంగఱు గంగాదేవి విడిచిన వీర్యంబునఁ బుట్టిన కుమారునికిఁ బాలిచ్చుటకై, కృత్తికలను బ్రార్థించిరి. ఆ కృత్తికలును “మే మీకుమారునికిఁ బాలిత్తుమేని, ఇతఁడు మాపుత్త్రుఁ డని వ్యవహరింపవలయు నని, దేవతలతో నొకరియే ర్పాటుచేసికొని, యా కుమారునికిఁ దామె తల్లులని నిశ్చయించికొని యా బిడ్డకుఁ బుట్టినవెంటనే పాలిచ్చెద మనిరి. దేవతలును కృత్తికలను జూచి, “మీ రడిగిన చొప్పున నే యితఁడు కార్తికేయుఁడు (కృత్తికలపుత్త్రుఁడు) అను పేరితో ముల్లోకములందును బ్రసిద్ధిఁ గాంచును. సంశయములేదు” అని చెప్పిరి. ఆ కృత్తికలు దేవతల పలుకులు విని సంతసించి, గర్భస్రావమునుండి, యగ్నిహోత్రునివలె వెలుఁగుచున్న యా కుమారుని, స్నానము చేయించిరి. అతఁడు గర్భస్రావముతోఁగూడ జాఱినందున, దేవతలా మహాత్ముఁడయిన కుమారునికి స్కందుఁ డనియుఁ బేరుపెట్టిరి. ఆ కుమారుఁడు క్రిందఁబడఁగానే, కృత్తికలకుఁ బాలుచేపెను, ఆ కుమారుఁడు తా నాఱు

హాముల వాఁడయి, యా యాఱుకృత్తికల చనుఁబాలను ద్రాగెను. ఆ కుమారుఁడు కృత్తికల చనుఁబాల నొకపూఁటఁద్రాగి, సుకుమార రూపంబు గల్గియున్నను, తన పరాక్రమముచే దైత్యుల సేనలనెల్లఁ జయింపఁగలవాఁడయ్యె. అంత నగ్నిహోత్రుఁడు మొదలగు వేల్పు లందఱుగూడి తులలేని వెలుఁగు గలిగియున్న యా కుమారుని దమకు సేనాధిపతిగాఁ జేసికొనిరి.

ఓ రామచంద్రా! నేను గంగాదేవియొక్క చరిత్రమును గూర్చియుఁ, గుమారస్వామిపుట్టుకను గూర్చియుఁ జెప్పితిని. ఈపుణ్యచరిత్రము విన్నవారికి నిహపరసౌఖ్యములు రెండును గలుగును. కాకు త్స్థుఁడా, కార్తికేయునియందు భక్తుఁడై యెవఁ డుండునో, వాఁడు దీర్ఘాయుస్సు గలవాఁడై, దీర్ఘాయువుగల పుత్రపౌత్రులతోఁగూడి, కుమార లోకమును బొందును" అని విశ్వామిత్రుఁడు రామునితోఁ జెప్పెను.

## 38 - వ సర్గము.

### సగరుఁడు యాగముచేయఁ దలఁచుట

ఇవ్విధముగా గంగాదేవి వృత్తాంతమును రామునికిఁ జెప్పి, మఱల విశ్వామిత్రమహాముని రామునితో నిట్లనియె:—

పూర్వము సగరుఁడను చక్రవర్తి అయోధ్యాపట్టణ మేలుచుండెను. అతఁడు మహాశూరుఁడు. ధర్మాత్ముఁడు. ఆతనికి సంతానముగావలెనని కోరిక యుండెఁగాని సంతానము కలుగకపోయెను. ఆసగర నృపాలుని పెద్దభార్య విదర్భరాజుకూఁతురు. ఆమెపేరు కేశిని. ఆమె ధర్మమునందె యాస్థ గలిగినది. అసత్యము మాట్లాడనిది. ఆయన రెండవభార్య యరిష్టనేమియొక్క కూఁతురగు సుమతి. ఆమెకు సౌందర్యమున సాటి వచ్చువా రీ భూమండలమున లేరు. సగరనృపాలుఁడు సంతతిని బడయఁ గోరి తనయిద్దఱు పత్నులతోడ హిమవంతమున కేఁగి, యచ్చట భృగు ప్రస్రవణమను నొక గిరియందుఁ దపము సేయుచుండెను. ఇట్లు సగర చక్రవర్తి తపము సేయుచుండఁగా నూఱేండ్లు నిండినది. ఆ తపమునకు మెచ్చి, సత్యవంతులలో, మేటియైన భృగుమహాముని యాతని కొక వరం బొసంగెను. "ఓపురుషశ్రేష్ఠా, నీకు బిడ్డ లనేకులు పుట్టగలరు. లోకంబున సాటిలేని యశమును బొందెదవు. నీ భార్యలలో నొకతెకు వంశ

కరుఁడైన పుత్రుఁ డొక్కఁడు పుట్టును, మఱియొకతె కఱువదివేలమంది కొడుకులు పుట్టుదురు." అని భృగుమహర్షి చెప్పుచుండఁగా, సగరచక్రవర్తియొక్క పత్ను లిరువురు నెక్కువ మక్కువతోఁ జేతులు జోడించి కొని, యమ్మహర్షిం జూచి, "మహాత్మా, యెవతె కొక్కఁడే కొడుకుపుట్టును? ఎవతె యనేకులను గొడుకులను గనును? ఓ బ్రాహ్మణోత్తమా! మీ మాట యెప్పటికి వ్యర్థముగాదు. అది తప్పక జరుగును. మే మాసంగతి నెఱుఁగఁగోరుచున్నారము. మా కెఱింగింపవలయు"నని ప్రార్థించిరి. వారిరువురి యా మాటలు విని, పరమధర్మిష్ఠుఁడైన యా భృగుమహర్షి "ఓమగువలారా, ఒక్కఁ డయ్యెనేని యాతఁడు వంశోద్ధారకుఁ డగును. పెక్కుమంది యగుదురేని వారు మహాబలవంతులుగాను, కీర్తిమంతులుగాను, మహోత్సాహము గలవారుగాను నుందురు. మీయిష్టము. ఎవరేవరమును గోరుదురో కోరుకొనుఁ"డని చెప్పెను. రఘునందనా, అప్పుడు కేశిని యాభృగుమహాముని పలుకులు విని, తనప్రియుని యెదుటనే నాకు వంశకరుఁడైన యొకపుత్రుఁడు చాలు ననెను. అంత గరుడుని తోఁబుట్టువగు నా సుమతి యెక్కువ పూనికి గలవారును, కీర్తిఁ గోరువారు నైన యఱువదివేలమంది కొడుకులు తనకుఁ బుట్టవలెనని కోరెను. ఇట్లు తన ప్రియపత్నులు భృగుమహర్షివలన వరములం బడయఁగానే, సగరచక్రవర్తి భృగుమహర్షికి సాష్టాంగ ప్రణామము లాచరించి ప్రదక్షిణముసేసి, పత్నులతోఁగూడి తన పట్టణమునకు మరలెను. అంతటఁ గొంతకాలమునకు సగరుని పెద్దభార్యయగు కేశిని గర్భంబు ధరియించి, యసమంజుఁ డను కుమారుని గనెను. ఓనరశ్రేష్ఠుఁడా, సుమతియన్ననో సొరకాయవంటి గర్భపిండమును బ్రసవించెను. ఆ పిండమును బగులఁ దీయఁగానే యఱువదివేలమంది బిడ్డలు బయలువెడలిరి. అట్లు బయలు వెడలిన బిడ్డలను నేతితో నిండిన కుండలలో దాదులు పెంచిరి. తర్వాత నాసగరపుత్రు లఱువదివేలమందియుఁ బెద్దకాలమునకు రూపయౌవనశాలులై యుండిరి. అప్పుడు సగరుని పెద్దభార్య పుత్రుఁడగు సమంజసుఁ దూరిలోనున్న పసిబిడ్డలను సరయూనదిలోఁ బడవైచి, నదిలో మునుఁగుచుండు వారినిజూచి బిగ్గరగా నవ్వుచుండెడివాఁడు. ఇట్లు పాపపుఁ బనులొనర్చువాఁడును, మంచివారికిఁ గీడు చేయువాఁడును, బట్టణ

వాసులకుఁ గీడు చేయుటయందే పట్టుదల గలవాఁడును నైన యా కొమరుని సగరుఁడు పట్టణమునుండి వెడలనడఁచెను. ఆ యసమంజునికి వీర్యవంతుఁడయిన యంశుమంతుఁడను నొక కొడుకుండెను. వాఁడు జనుల కందఱ కొప్పినవాఁడును, జనుల కెల్ల మేలుచేయువాఁడునైయుండెను. తర్వాతఁ గొంతకాలమునకు సగరనృపాలునికి యాగము సేయవలెననుతలంపు పుట్టెను. వేదవేదాంగముల నెల్ల నెఱింగిన సగరుం డిట్లు నిశ్చయించి, ఋత్విజుల నందఱఁ బిలిపించి; వారిసాయమున నీయాగంబు చేయ నుపక్రమించెను.

## 39 - వ స ర్గ ము.

### సగరపుత్రులు భూమిని ద్రవ్వుట

విశ్వామిత్రమహాముని యివ్విధంబుగఁ జెప్పి నిలుపఁగనే రాముఁడు మిక్కిలి యానందముతో విశ్వామిత్రునిఁ జూచి, "మా వంశములో పూర్వికుఁడైన సగరుఁడు యాగముచేసినక్రమమును దెలియ నాతురత గల్గియున్నాను." అని యడిగెను వెంటనే విశ్వామిత్రుఁడు చిఱునవ్వు నవ్వి రాముని జూచి యిట్లనెను. "రాఘవుఁడా, సగరుని వృత్తాంతము సవిస్తరముగఁ జెప్పెద నాలకింపుము. రెండు ప్రక్కలందును నొక్కటియొక్కటి మిక్కిలి యెత్తయి, నడుమ నేవియుఁ గొండలు లేకుండుటచేత నొక్క దాని నొక్కటి చూచుచుండు వింధ్యపర్వతమునకును, శంకరుని మామయగు హిమవత్పర్వతమునకు నడుమనుండు ప్రదేశములో నీ యాగము జరిగెను. ఓ నరశార్దూలా, సాధారణముగా నీ రెండుపర్వతములకు నడుమనున్న యీ ప్రదేశము యజ్ఞములు చేయుటకుఁ దగినది. ఓ కాకుత్థ్సా, ఆ యాగము నిమిత్తము గుఱ్ఱమును విడువఁగనే, యతని పెద్దభార్య కుమారుని కుమారుఁడగు నంశుమంతుఁ డనువాఁడు తనచేత గట్టివిల్లు దాల్చి, తన్నుఁ, సారథిని, గుఱ్ఱములను గాపాడుచుఁ బదునొకండువేలమంది సైనికులతోఁ గోరాడఁగలమహారథుఁడై, యజ్ఞాశ్వముం గాపాడుటకు సగరుని యానతిం బడసి, దానిని వెంబడించి పోయెను. సగరచక్రవర్తియొక్క యాగమున నుత్థ్యకాలమునందు దేవేంద్రుఁడు రాక్షసరూపంబుఁదాల్చి, యా యజ్ఞపశువగు నశ్వమును హరించి, పాతాళమున నుంచెను.

ఇట్లు గుఱ్ఱము నతఁ డెత్తుకొనిపోఁగానే, యాగము చేయించు చున్న ఋత్విక్కు లందఱు సగర మహారాజును జూచి, "మహారాజా, యీ యుత్కృష్టదినమున యజ్ఞపశువు నెవఁడో తీసికొనిపోవుచున్నాఁడు వానిఁజంపుము. గుఱ్ఱమును మఱలించుకొని రమ్ము. ఇది యజ్ఞమునకు లోపము. దీనివలన నందఱకుఁ జెఱుపు వాటిల్లును. ఓనృపాలా! యజ్ఞమున లోపంబు వాటిల్ల కుండునట్లుగనఁ జేయవలయును" అని చెప్పిరి. అప్పుడు సగరుండు ఆ సభయందలి ఋత్విజుల మాట విని, తన యఱు వదివేలమంది కొమరులను బిలిచి, "ఓ శూరులగు బిడ్డలారా! రాక్షసులు మన యజ్ఞాశ్వము నెత్తుకొనిపోయియుందు రని నేను తలంపను. రాక్షసు లిప్పుడు మన యాగంబుఁజెఱచుటకుఁ గారణము లేదు. ఏల యనిన, నీ యశ్వమేధయాగమును మంత్రములచేఁ బరిశుద్ధులైన గొప్ప పేరు గల ఋత్విక్కులు చేయించుచున్నారు. కాఁబట్టి యో నాయనలారా, మీరు పొండు. అన్ని సముద్రములతోఁ గూడిన సకల భూమండలములు వెదకుఁడు. ఒక్కొక్క యామడగా భూమి నంతయు వెదకుఁడు. మన యజ్ఞాశ్వమును దొంగిలించిన మనుష్యుఁడు చిక్కునంత దనుకఁ బుడమినిద్రవ్వుఁడు. నేను యజ్ఞదీక్ష వహించియున్నాఁడ. నేను బయటఁ బోఁగూడదు. నేను మీబిడ్డలను గాపాడుచు, ఋత్విజులతోడఁ గూడి యజ్ఞాశ్వము దొరకునంతవఱకు నిచ్చట నుండెదను. మీకు మేలయ్యెడు పోయిరం"డని చెప్పెను. సగరనృపాలునిచే నిట్లు చెప్పఁబడినవారలై, బలవంతులగు సగరుని పుత్రు లందఱు తండ్రియానతికిఁ గట్టుపడి భూలోకంబున వెదకఁ బయనమైరి. ఇట్లు పయనమై, సగరపుత్రులు ఒక్కొక్కరు నొక్క యోజనము వెడల్పును నొక్క యోజనము నిడివియుఁగల ప్రదేశమువంతున భూమినంతయు వజ్రాయుధములఁబోలు తమ గోళ్ళతోఁ ద్రవ్విరి. ఇట్లు వారు వజ్రాయుధంబులఁ బోలు శూలములచేతను, కడు గొప్పవగు నాగేళ్ళచేతను బుడమి నంతయుఁ ద్రవ్వుచుండ నా భూమి యపరి గొప్పచప్పుడు చేయుచుండెను. అట్లు వారు భూమి త్రవ్వినపుడు నలిగిన పాములును, రక్కసులును, మఱియుఁ బాతాళమున నుండు జంతువు లన్నియు గొప్ప రొదచేయుచుండెను. ఇట్లు వా రఱువదివేల యోజనములలోఁతు

పుడమి నంతయుఁ బాతాళలోకం బగునట్లు త్రవ్వి, జంబూద్వీపంబున నుండు పర్వతము లందును, నదులందును నన్ని ప్రదేశములందును వెద కిరి. అట్లు సగరపుత్రులు భూమి నంతయుఁ ద్రవ్వుచుండఁ దేవ గంధర్వ రాక్షస పన్నగాదులు వెఱచి, మనంబుల దిగులుఁ జెంది బ్రహ్మదేవుని కడ కేఁగి, మహాత్ముఁడైన బ్రహ్మదేవునకు మ్రొక్కి, మిక్కిలిదీనముగా నిట్లనిరి. "భగవంతుఁడా, సగరపుత్రులు భూమినంతయుఁ ద్రవ్వుచున్నారు. పాతాళలోకవాసు లనేకులు మహాత్ము లా సగరపుత్రులచేఁ జంపఁబడుచున్నారు. "ఇతఁడు మాయజ్ఞమును జెఱచినవాఁడు. ఇతఁడే మా గుఱ్ఱమును దీసికొనిపోవుచున్నాఁడు" అని యా సగరతనూజులు కనఁబడిన ప్రాణుల నెల్లఁ జంపుచున్నారు" అని దేవతలు మున్నగువారంపలు బ్రహ్మదేవునితో మొఱలిడిరి.

## 40-వ సర్గము.

### సగరపుత్రులు కపిలమహామునిని జూచుట

దేవతలమొఱ విని జగత్పితామహుఁడగు బ్రహ్మదేవుఁడు సగరపుత్రులబలముచే మోహితుఁడై మిక్కిలి భయభ్రాంతులైయున్న యా దేవతలతో నిట్లు చెప్పెను. దేవతలారా! ఈ భూమి యేవిష్ణుమూర్తికి భార్యగానుండెనో యేవిష్ణుమూర్తి కపిలరూపమును ధరించి యీభూమిని ధరించుచున్నాఁడో, అట్టి కపిలరూపధారియగు విష్ణువుయొక్క కోపాగ్నిచే నీ యఱువదివేలమంది సగరపుత్రులును దగ్ధులు కాఁగలరు. ఇట్లు భూమియంతయుఁ ద్రవ్వఁబడుటయు, నల్పాయుస్సుగల యీ సగరపుత్రులు చచ్చుటయు నను నీ రెండువిషయములును ముందుగాఁ దెలిసినవే" అని చెప్పెను. బ్రహ్మదేవుఁడు చెప్పినమాటను ముప్పదిమూఁడుకోట్ల దేవతలును విని, మిక్కిలి యానందము నొంది, చింత విడిచి, తమ తమ నెలవులకుఁ బోయి చేరిరి.

సగరపుత్రులు భూమిని ద్రవ్వుచుండఁగాఁ బిడుగుపడునప్పుడువలె నొక గొప్పధ్వని పుట్టెను. ఆ విధముగా సగరపుత్రులు భూమిని ద్రవ్వి, భూమియంతయుఁ బ్రదక్షిణముగాఁ దిరిగి తండ్రికడకుఁ బోయి "తండ్రీ, మేము భూమియంతయు గాలించి చూచితిమి. దేవతలు, అసురులు, రాక్షసులు, పిశాచములు, సర్పములు, కిన్నరులు మొదలైన బలశా

లుల నందఱను వధించితిమి. ఎచ్చోటనైనను నింతవనుకను కనంబడక పోయిన గుఱ్ఱముగాని, ఆ గుఱ్ఱమును దొంగిలించుకొనిపోయిన దుష్టుండగు దొంగగాని మాకుఁ గనఁబడలేదు. ఇంక మేమేమి చేయవలె? ఆలోచించి చెప్పుము. నీకు శుభమగుఁగాక. అని యడిగిరి. అట్లు పుత్రులు చెప్పినమాట విని సగరచక్రవర్తి మిక్కిలి కోపించి, "గుఱ్ఱమును హరించిన వానిని పట్టుకొని నీట కాగుఱ్ఱమును తీసికొనకుండ రావలదు. ఇంకను భూమిని ద్రవ్వుఁడు. ఎవ్విధమునైనను యాగపశువగు నశ్వమును గొనివచ్చి, నాయాగంబును బూర్తిచేయుఁడు" అని చెప్పెను. అంతట యఱువదివేలమంది సగరపుత్రులును తండ్రిమాట విని పాతాళలోకంబునకుఁ బరుగెత్తుకొనిపోయి యచ్చటఁ ద్రవ్వనారంభించిరి. అప్పు డక్కడ భూమిని మోయుచున్న కొండవంటి విరూపాక్షమను దిగ్గజమును జూచిరి. రామా! ఆగజము పర్వతములతోను, వనములతోను గూడియున్న యీసమస్త భూమండలమును దనతలతో ధరించియుండెను. ఆగజ మెప్పుడు మిక్కిలి శ్రమచేఁ దన బడలికను దీర్చుకొనుటకై తలయాడించునో, యప్పుడు భూకంపము సంభవించును. రామా! ఆసగరపుత్రు లావిరూపాక్షదిగ్గజమునకుఁ బ్రదక్షిణముచేసి దానిని గౌరవించి రసాతలమును భేదించుకొని పోయిరి. తర్వాతఁ దూర్పుదిక్కును భేదించి, మరల దక్షిణదిశను భేదించిరి. దక్షిణదిశయందును గొప్పపర్వతమువంటి మహాపద్మమను దిగ్గజమును భూమిని మోయుచున్న దానిని జూచిరి. చాల నాశ్చర్యము నొందిరి. అట నాగజమునకుఁ బ్రదక్షిణ నమస్కారముచేసి సగరుని యఱువదివేలమంది పుత్రులును బశ్చిమదిశను ద్రవ్విరి. అక్కడను సౌమనస మను దిగ్గజమును జూచి దానికిఁ బ్రదక్షిణము చేసి కుశల మడిగి, యుత్తరదిశను ద్రవ్వనారంభించిరి. ఆయుత్తరదిశయందును భూమిని మోయుచున్న భద్ర మను దిగ్గజమును జూచి దానిని స్పృశించి ప్రదక్షిణ నమస్కారముచేసి భూమిని ద్రవ్వి ఈశాన్యదిశకుఁబోయి మహారోషముతో భూమిని ద్రవ్వి యందు నారాయణావతారమగు కపిలమహర్షిని, ఆతని సమీపములోనే సంచరించుచున్న గుఱ్ఱమును జూచి మిక్కిలి సంతోషించి గుఱ్ఱమును దొంగిలిన దొంగ యతఁడే యని కోపముతో నత్యుగ్రులై క్రుద్ధులులు,

వాగళ్లు నానావిధములైనచెట్లు, రాళ్లు దీసికొని 'ఉండు ఉండు' అని కేకలు పెట్టుచు "ఓరీ నీవు మా యాగాశ్వమును దొంగిలి దెచ్చితివి? దురాత్మా! మేము సగరమహారాజు పుత్త్రుల మని తెలియుము" అని కేక లిడుచు నమ్మునిమీఁదికి దుమికిరి. ఆ మునివరుఁ డీ సగరపుత్త్రులు చేసిన రచ్చను విని, కన్నుఁదెఱచి చూచి, యతి కోపముతో హుంకారము చేసెను. వెంటనే యా సగరపుత్త్రు లందఱు నిర్దోషియైయున్న తపోనిధియగు నా కపిలమహాముని కోపమనెడు మంటలోఁగాలి బూడిదెప్రోగు లయిరి.

## 41-వ సర్గము.

### సగరునియొక్క యాగసమాప్తి

రఘునందనా, సగరుఁడు తన కుమారు లెంత కాలమునకును మరలి రాకుండుటఁ దలఁచి పరాక్రమముచే వెలుఁగుచున్న తన మను మనింబిలిచి, 'నాయనా! నీవు శూరుఁడవు. విలువిద్దెనేర్చినవాఁడవు. మన పెద్దలతో సమానుఁడవు. నీపినతండ్రు లెచ్చటికిఁబోయిరో యింతకు రాకు న్నారు. కావున నీవేఁగి, వారిగతని, గుఱ్ఱముపోయిన దారిని గని పెట్టుము. భూమ్యంతర్గతములైన జంతువులు మిక్కిలి బలముగలవి. గొప్పవి. వానిని జంపుటకై ధనుస్సును బాణములను, ఖడ్గమును గైకొని పొమ్ము. నీవు పోవునప్పుడు నమస్కరింపఁదగినవా రెదురుపడినచో, వారికి మ్రొక్కుచు, విఘ్న మొనరించువారలను బరిమార్చుచుఁ బోయిన పని నెఱవేర్చుకొనివచ్చి, నాయజ్ఞము ముగియునట్లు చేయుము" అని చెప్పెను.

ఇట్లు సగరచక్రవర్తి చెప్పఁగా, శీఘ్రగమనము గల యంశుమంతుఁడు మహాత్ముఁడగు సగరుని యానతివొప్పున విల్లును బాణములను గైకొని, మహాత్ములగు తనతండ్రులు త్రవ్విన పాతాళలోక మార్గమునే యనుసరించి పోయి, దైత్యదానవ రాక్షసులచేతను, పిశాచపక్షి పన్నగములచేతను బూజింపఁబడుచుండు దిగ్గజమును జూచి దానికిఁ బ్రదక్షిణంబు సేసి, సేమ మరసి, తన తండ్రులంగూర్చియు, గుఱ్ఱము నపహరించినవానిని గూర్చియు నాదిగ్గజము నడిగెను. ఆదిగ్గజము నంశుమంతుని వాక్యమునువిని, ఓయీ, నీవు కృతార్థుఁడ వగుదువు. నీవుఁ గుఱ్ఱముఁ దోలుకొని వెంటనే రాగలవు" అని చెప్పెను. అట్లే

యా యంశుమంతుఁడును నా మాట విని, వరుసగా, మర్యాదకుఁ దగి నట్లును దిగ్గజములనెల్ల నడుగ నారంభించెను. అంత మాటాడ నేర్పు గలవగు నాదిగ్గజములచే మర్యాదచేయఁబడి, "త్వరలోనే నీవు గుఱ్ఱ మును దీసికొని యీ దారిని బోఁగలవు" అని యంశుమంతుఁడు చెప్పఁ బడెను. అంతట నంశుమంతుఁ డతిశీఘ్రగమనముతోఁ దన పెద్దలగు సగరపుత్రులు భస్మరాసులై పడియున్నచోటికిఁ బోయి వారిచావునకు మిక్కిలి వగచుచు నచ్చటికిఁ జేరువనే సంచరించుచున్న యజ్ఞాశ్వమును చూచెను. తర్వాత భస్మమైపోయిన యీ రాజపుత్రుల కందఱ కుదక దానము (తర్పణము) చేయఁదలచి జలాశయము కొఱకు వెదకెను. కాని యెక్కడను గాన్పింపక పోయెను. దృష్టి సారించి చూడఁగా వేగమున వాయువును బోలినవాఁడును, తనతండ్రులకు మేనమామ యును నైన గరుత్మంతుని గాంచెను.

అంత మహాబలవంతుఁడగు గరుడుఁ డంశుమంతునితో నిట్లు నియె. "ఓపురుషశ్రేష్ఠుఁడా, నీవు వ్యసనపడకుము. వీరిచావు లోక సమ్మతమైనది. మహా బలవంతులగు వీరందఱు గపిలమహాముని కోపా గ్నిచే బూదిసేయఁబడి పడిసిరి. వీరు దుర్మరణము నొందినవారు. వీరికి దర్పణాదులు సేయ నీ లౌకిక జలము పనికిరాదు. హిమవంతుని పెద్ద కూఁతురు గంగయను నామె నదీరూపంబున నాకసంబునఁ బాఱుచున్నది. ఆ యుదకముతోడఁ దర్పణము నొనరింపుము. లోకముల నెల్లఁ బవిత్ర పఱచునట్టి యీ గంగానది జలముతో బూడిదె ప్రోవులుగాఁ జేయఁ బడిన యీ సగరపుత్రులను దడుపుదువేని, లోకములచేఁ గోరఁదగిన గంగచేఁ దడుపఁబడిన యీబూది యీ యఱువదివేలమందిని స్వర్గము నొందించును. ఓ పురుషశ్రేష్ఠుఁడా! నీవు గుఱ్ఱమును గొనిపోయి తాత యాగమును నెఱవేర్పుము' అని గరుత్మంతుఁ డంశుమంతునితోఁ జెప్పెను.

పరాక్రమశాలియు కీర్తిగలవాఁడునైన యంశుమంతుఁడు గరు డునివాక్యమును విని వెంటనే గుఱ్ఱమును దోలుకొని, మఱల సగరుని కడ కేఁగుదెంచెను. ఓ రఘునందనా, ఆ యంశుమంతుఁడు యజ్ఞదీక్ష వహించియుండు సగరునితో జరిగిన సంగతిని, గరుత్మంతుఁడు చెప్పిన

మాటలను వినిపించెను. సగరుఁడును దుర్భరమైన యాఘోరవార్తను విని, యాగమును కల్పోక్తంబుగను, న్యాయంబుగను బూర్తిచేయించి, కాంతిచే వెలుఁగుచు బురమునకుఁ బోయెను. తర్వాత నాకాశమునుంచి గంగను రప్పించుట కుపాయము గానకయే తదాలోచనతోనె ముప్పది వేలయేండ్లు రాజ్యమేలి దివంగతుఁ డయ్యెను.

## 42-వ స ర్గ ము.

### భగీరథుఁడు గంగను దెచ్చుటకై తపంబొనరించుట

ఇట్లు సగరచక్రవర్తి కాలధర్మము నొందఁగనే, మంత్రులును బురజనులును జేరి యాలోచించి మిగుల ధర్మాత్ముఁడైన యంశుమంతునిఁ దమ రాజునుగా నేర్పఱచుకొనిరి. ఓ రఘునందనా, యా సగరచక్రవర్తి మనుమఁడు మిక్కిలి గొప్పవాఁ డను పేరు దెచ్చుకొనెను. అతనికి దిలీపుం డను ప్రసిద్ధిగాంచిన పుత్రుఁడు పుట్టెను. అంశుమంతుఁ డా దిలీపునికి పట్టముగట్టి తాను పుణ్యప్రదమగు హిమవత్పర్వత శిఖరమున వెలుపుఁ బుట్టించు తపమొనర్చెను. ఇట్లంశుమంతుఁడు ముప్పదిరెండు వేలేండ్లు రాజ్యముఁ బాలించి, తపోవనమునందే స్వర్గస్థుఁడాయెను. అంతట మహాతేజస్వియైన దిలీపుఁడు రాజ్యము నొంది తన ముత్తాతల చావు సంగతిని విని మిక్కిలి వ్యసనాకులితుఁడై గంగావతరణమునకై యాలోచించి, యెట్లు భూలోకంబునకు గంగను దెచ్చుట? ఎట్లు లాపితరులకుఁ దర్పణము సేయుట. ఎట్లు వారిని స్వర్గము నొందించుట ? యని నిత్యము చింత చేయుచుండెను. ఇట్లు చింతచేయుచు నున్న యాతనికిఁ బరమధార్మికుఁ డైన భగీరథుఁ డనుకుమారుఁడు పుట్టెను. దిలీపుఁ డనేక యాగములు చేసి ముప్పదివేల సంవత్సరములు రాజ్యమేలెను. కాని సగరపుత్రుల నుద్ధరించుట కేమి నిశ్చయము దొరకక చివరకుఁ దన కుమారుఁ డగు భగీరథునకు రాజ్యాభిషేకము చేసి వ్యాధిగ్రస్తుఁడై చనిపోయి తనసంపాదించుకొనియున్న పుణ్యకర్మవశమున నింద్రలోకము నొందెను.

రఘునందనా! మహాతేజస్వియుఁ, బరమధార్మికుఁడునగు భగీరథుఁడు సంతతి లేనివాఁడగుటచే సంతానమును గోరువాఁడై యుండెను.

ఆతఁడు తన రాజ్యమును మంత్రుల కప్పగించి గంగను బుడమికిఁ దెచ్చు టకై, గోకర్ణక్షేత్రమునకుఁ జని, యచ్చటఁ జేతులఁ బైకెత్తుకొని, యైదగ్నిహోత్రముల మధ్యంబునఁ గూర్చుండి, నెల కొక్కమాఱు భోజనము సల్పుచు, నింద్రియములు నడఁచుకొని, దీర్ఘకాలము తపము సేసెను. ఇవ్విధంబున నా భగీరథుఁడు వేయిసంవత్సరము లత్యుగ్ర తపము చేసెను. అంత సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడు సంతసించినవాఁడై, దేవతలతోడ తపస్సుచేయుచున్న మహానుభావుండగు భగీరథుని కడకేతెంచి యిట్లనియె. "జనులందఱిచేఁ గొనియాడఁదగు స్వభావము గల యో భగీరథ మహారాజా, నేను నీ తపమునకు మెచ్చితిని. నీయెడ నాకు మిక్కుటమగు వాత్సల్యము గలిగెను. నీ వతి నియమముతోఁ దపంబు చేసితివి. నీవు వరమడుగు మిచ్చెదను. అని బ్రహ్మ చెప్పగా, భగీరథుఁడు సకలలోకములకు సృష్టికర్తయగు బ్రహ్మదేవునికి మ్రొక్కి, చేతులు గట్టుకొని, దగ్గఱకు వచ్చి నిలిచినవాఁడై, "ఓభగవంతుఁడా, నా యెడ నీకుఁ బ్రీతి గలదేని, నేఁ జేసిన తపంబునకు ఫలంబుగలదేని, మా పెద్దలగు సగర పుత్రు లందఱు నావలనఁ దర్పణంబుల నొందుదురుగాక. ఆ మహా బలవంతులైన సగరుల పుత్రుల బూది గంగానది జలముతోఁ దడిపినచోఁ నా ముత్తాతలగు సగర పుత్రు లందఱు స్వర్గముఁ జేరుదురు. మఱియు నిక్ష్వాకుకులం బింతటితో నశింపకుండునట్లు నాకుఁ బుత్రసంతతి నిమ్ము. ఇదియే నాకోరు వరమని బ్రహ్మ నడిగెను.

ఇట్లు భగీరథుఁ డడుగఁగా, బ్రహ్మదేవుఁ డతనిని జూచి మృదు మధురముగా నిట్లనియె "భగీరథా! యిక్ష్వాకువంశోద్ధారకా! యట్లే యగునుగాక! నీకు మేలు గలుగును. అయినను, నీ వడిగిన మొదటి వరమగు గంగను బుడమికిఁ దెచ్చుట నీకు నలవి కాదు. పర్వతరాజగు హిమవంతుని కూఁతురగు గంగను దాల్ప శంకరుని బ్రార్థింపుము. గంగాపాతమును భూదేవి సైరింపఁజాలదు. ఆ గంగను దాల్పఁజాలినవాఁ డీశ్వరుండుదక్క మఱియొక్కఁడు నాకగపడుట లేదు." అని బ్రహ్మ దేవుఁడు భగీరథునికి వరమొసంగి, భగీరథుని కోరికని దీర్ప గంగానదికిఁ జెప్పి దేవతలతోడ స్వర్గలోకమునకుఁ జనియెను.

## 43-వ సర్గము.

గంగ భూలోకమునకు దిగివచ్చుట

దేవతలకెల్లఁ బ్రభువగు నా పరమేష్ఠి యంతర్ధానము నొందగనే, భగీరథుఁడు బొట్టనవ్రేలిమీఁద నిలిచి యీశ్వరునిఁగూర్చి, యొక సంవత్సరకాలము తపమొనరించెను. అంతట నొకయేఁడు నిండఁగనే, సకలజనులచే నమస్కరింపఁబడువాఁడును, జంతువులకెల్లఁ బ్రభువైన వాఁడు నగు నుమాపతి యతనికిఁ బ్రత్యక్షమై "నరేంద్రా! నేను నీతపము నకు మెచ్చితిని. నీ కిష్టమైనపనిని జేసెదను. నేను నీ యిష్టముచొప్పున శైలరాజకుమార్తెయగు గంగాదేవిని తలను ధరించెదను" అని చెప్పి యంత ర్ధానము నొందెను.

అంతట జనులందఱిచేతను బొగడఁబడినదైన హిమవంతుని జ్యేష్ఠ పుత్రికయగు గంగ గొప్ప రూపముఁ దాల్చి సహింపరాని వేగము గలదై, యాకసమునుండి యుత్తమమైన యీశ్వరుని శిరస్సునఁ బడి, యితరుల కెవ్వరికిని నడ్డగింపరానిది గాన గర్వమున "నా త్రొఁబు తోడ యీశ్వరునిగూడఁ గొనిపోయి, పాతాళమునకుఁ జేరెద" నని తలఁచెను. ఆ ముక్కంటియగు భగవంతుఁడైన యీశ్వరుఁడు గంగ గర్వము నెఱింగి కోపగించి, దానిని మఱుగు పఱుపఁ దలచెను. అంతటఁ బవిత్రమైన గంగాదేవి హిమవంతముఁబోలు పావనమైన జటాజూటము నందుఁ బడి, యచ్చటనుండి యెంతప్రయత్నించియు, జడలలోనుండి వెలువడి భూమండలమునకుఁ బోఁజాలనిదయ్యెను. అట్లు గంగానది యా యీశ్వరుని జడలందే నిల్చిపోయి, యనేక సంవత్సరము లచ్చటనే నడయాడుచుండెను. భగీరథుఁడు గంగాదేవిని గానక, యచ్చటనే మఱల నుగ్రమగు తపమొనరించెను. రఘునందనా, పరమేశ్వరుఁ డాభగీ రథుని తపస్సునకు మిక్కిలి మెచ్చికొని, తన జడలం దింకియున్న గంగను బిందుసరోవరము వైపునకు విడిచిపెట్టెను. ఇట్లు శివుని శిరంబునుండి బిందుసరోవరమునఁ బడునపు డాగంగ యేడుపాయలుగా నేర్పడినది. అందు నిర్మలోదకము గలవియుఁ బవిత్రములునైన హ్లాదిని, పావని, నళినియను మూఁడుపాయలు తూర్పుదెసకుఁ బోయి చేరినవి. అట్లె స్వచ్ఛమగు జలముగల సుచక్షు, సీత, సింధువు లనెడి పాయలు

మూఁడును బడమటి దెసకుఁ బోయినవి. వానిలో నేడవపాయ భగీరథ నృపాలుని వెంబడించెను. రాజర్షియగు భగీరథుఁడును దివ్యమగు రథమునెక్కి ముందుపోవుచుండ వెంబడించి గంగానది పోయెను. ఆమె యాకసమునుండి శంకరుని శిరంబునఁబడి యచ్చటినుండి భూమినొందెను. అట్లు పైనుండి క్రిందికి వచ్చుటచేఁ బాఱెడి యా గంగాజలము సైరింప రాని యెక్కువ మ్రోఁతగలిగి యంతట వ్యాపించెను.

ఆ గంగాప్రవాహముతోఁగూడఁ బడునట్టి చేఁపలతోను, తాఁబేళ్లగుంపులతోను, మొసళ్ళ గుంపులతోను, మఱియు ననేక జంతువులతోను భూమియంతయు వ్యాపింపఁబడి ప్రకాశించుచుండెను. అపుడు దేవ ఋషి గంధర్వ యక్ష సిద్ధు లాకాశమునుండి గంగానది భూలోకమునకువచ్చుటను జూడఁగోరినవారై, పట్టణములం బోలు విమానంబుల మీఁదను, గుఱ్ఱములమీఁదను, మేటి యేనుఁగులమీఁదను, నెక్కి కడు సంబరముతో వచ్చి యా హిమవంతమునందలి బిందు సరోవర ప్రాంతమునఁ గూర్చుండిరి. మబ్బులేక నిర్మలమై యుండు నాకాశము గంగా ప్రవాహమును జూడవచ్చు దేవతల గుంపులచేతను, వారి భూషణముల కాంతులచేతను నిండినదై నూఱుగురు సూర్యులకాంతి గలిగియున్నట్లు వెలుఁగుచుండెను. చలించుచున్న చేపలు, పాములు, మొసళ్లు జలజంతువులతో మెఱపులతో వ్యాపించియుండు నాకాశముఁలాగునఁ గాని పించుచు, వేగముగఁ బ్రవహించు ప్రవాహమునందలి తెల్లని నురుగులతో, హంసల గుంపులతోను గూడిన శరత్కాలమందలి మేఘములఁ బోలియుండెను. ఆ గంగానది పల్లపునేలలందుఁ గడువడిగను, మిట్ట పల్లములందు వంకరగను, చదరపు భూములందు మిక్కిలి వెడల్పుగను, పల్లములలో లోపలికి వంగినట్లును, బండలు మొదలగు వాని తాఁకుడు గల్గినప్పుడు పై కుబికినట్లును, ఉన్నత భూములందు మెల్ల మెల్లగను, బోవుచుండినది. ఒకొక్కచోట నీరు నీరు కొట్టుకొనుచు మాటిమాటికిఁ బైకెగయుచు మరల క్రిందబడుచుఁ జూడ సొంపుగానుండెను. ఈశ్వరుని జటాజూటమునుండి జాఱి, నేలఁబడిన యా గంగాజలము మురికిలేనిదై మిక్కిలి తేఁటగాఁ బాఱుచుండెను.

అప్పు డాకసంబునఁ దిరుగు వేల్పులు, మహర్షులు, గంధర్వులు, భూలోకవాసులగు మనుజులు నీశ్వరుని శిరమునుండి క్రిందఁబడు జల మతిపావనం బని యాగంగలో మునిఁగిరి. శాపగ్రస్తులై యెవరెవరు స్వర్గమునుండి భూలోకమున జన్మించిరో, వారలందఱు నా గంగా జలములందు స్నానముచేసి, పాపవిముక్తులై పావనులైరి. అట్లు వా రందఱు గంగాస్నానంబుచేఁ దమపాపముల నెల్లఁ బోఁగొట్టుకొని మఱలఁ దమలోకంబులకుఁ బోయిరి. భూలోకవాసులగు జనులందఱు స్వచ్ఛముగ మెఱయుచున్న యా గంగాజలమును జూచినంతనే పట్ట రాని సంతసమొంది, యాగంగానదియందు స్నానముచేసి, తమ బడలిక లెల్లఁబాసి, కలఁకఁదేఱిన మనములతోఁ గూడియుండిరి.

భగీరథుఁడును రథం బెక్కి ముందును, ఆతని వెంబడి గంగయుఁ బోవుచుండ దేవతలు, మునులు, దైత్యదానవరాక్షసులు, గంధర్వులు, యక్షులు, కిన్నరులు, వాసుకి మొదలగు సర్పములు, అప్సరసలందఱును, జలచరంబులగు సకల జంతువులును భగీరథుని వెంబడిఁ బోవుచున్న యాగంగానదిని వెంబడించి పోయిరి. అట్లు వీరందఱు పోవునపుడు భగీ రథుఁ డేదెసకుఁ బోవునో, యాదెసకై సకలజనుల పాపములఁ బోఁగొట్టు నదియుఁ, బావనురా లనికీర్తివహించినదియు నగు గంగానది పోయెను. అట్లు గంగానది పాఱుచు, వింతయైన మహిమగల జహ్నుమహర్షి యాగంబుసేయుచుండఁగా నమ్మహామునియొక్క యజ్ఞశాలయందుఁ బ్రవేశించి, దాని నంతయు నీటితో ముంచెను. ఓరాఘవా! యాజహ్ను మహర్షి యా గంగయొక్క గర్వమునుజూచి, కడు నలిగినవాఁడయి, యతి రుచిగలిగియుండు నాగంగయందలి జలమునంతయుఁ ద్రావెను. అప్పుడు దేవతలు, గంధర్వులు, మునులు బొట్టునీరును లేక గంగ నెల్లఁ బానముచేసినందునకు మిక్కిలి యాశ్చర్యపడి, పురుషశ్రేష్ఠుఁడైన మహా త్ముఁడగు జహ్నుమహామునిని బొగడి, "ఓమహాత్మా గంగను విడువుము. దీనిని నీ పుత్రికయని యర్థమిచ్చు 'జాహ్నవి' యను పేరితోఁ బిలుతురని" చెప్పఁగా, బ్రహ్మతేజస్సుగల యా జహ్నుమహర్షి సంత సించి తన చెవులలోనుండి గంగను వదలెను. అట్లు జహ్నుమహర్షి చెవు లలోనుండి బయటికి వచ్చుటచేత గంగానదికి జాహ్నవియని పేరు గలిగి

నది. ఈతీరున గంగానది జహ్నుమహర్షివలన విడువఁబడి భగీరథుని వెంబడించి సముద్రమునుబొంది యా భగీరథుని కార్యసిద్ధికొఱకై పాతాళలోకమునకుఁ బోయి చేరెను. అంత రాజర్షియగు భగీరథుఁడును మహాప్రయాసముతో గంగనుదోడ్కొని పాతాళమునకుఁబోయి బూడిదరాసులై పడియున్న తన ముత్తాతలనుజూచి ఖిన్నుఁడాయెను. అపు డాభస్మరాసులెల్ల గంగాజలముతో లెస్సగాఁ దడిసెను. అంత సగర పుత్త్రులందఱు దుర్మరణమువలనఁ గలిగిన పాతకమునుండి విముక్తులై స్వర్గప్రాప్తులైరి.

## 44-వ సర్గము.

భగీరథుఁడు గంగను డెచ్చినందుకై బ్రహ్మవలన వరములు వడయుట

ఇట్లు గంగ తనవెంబడి వచ్చుచుండఁగా భగీరథుఁడు పాతాళంబునఁ దనముత్తాతలు బూడిదప్రోవులుగాఁ బడియున్న తావునకుఁబోయి, యా భస్మరాసులను దడిపినంతనే, లోకముల కెల్ల నధిపతియగు కమలాసనుఁడు ప్రత్యక్షమై యా భగీరథ మహారాజుతో నిట్లనియె. "ఓ నరశ్రేష్ఠుఁడా, నీవు నీ పెద్దలను నరకమునుండి తరింపఁజేసితివి. మహాత్ముఁడగు సగరునిపుత్త్రులఱువదివేలమందియు స్వర్గమునకేఁగి, దేవతల మాడ్కిఁ దేజరిల్లుచున్నారు. ఓ పుడమిఱేఁడా, ఎంతవఱకు సముద్రమునందు జలం బింకకయుండునో, అంతవఱకు సగరపుత్త్రులు స్వర్గమునందు వేల్పులమాడ్కి వెలుఁగుచుందురు. ఈ గంగానదియుఁ నీకు బెద్దకొమార్తె కాఁగలదు. ఈ గంగ 'భాగీరథి' యనుపేర నీ లోకమున వ్యవహరింపఁబడుచు నుండఁగలదు. ఈ గంగానది స్వర్గమర్త్య పాతాళములు మూఁడింటియందు మూఁడుదారులఁ బ్రవహించుటచేఁ ద్రిపథగ యనియు, భగీరథుఁడవను నీచే బుడమికి దేఁబడినందున భాగీరథి యనియు లోకమునఁ బ్రసిద్ధి కెక్కఁగలదు. ఓ మనుజాధిపా, నీవు నీ తాతలకందఱకును తర్పణంబునేసి నీ ప్రతిజ్ఞ చెల్లించికొనుము. నీకుఁ బూర్వుఁడును, ఎక్కువ కీర్తిగలవాఁడును, ధర్మవంతులలో నుత్తముఁడును నైన సగరుని కీమనోరథము సిద్ధింపకపోయెను. అట్లే పుడమియందుఁ బరాక్రమమున సాటిలేని యంశుమంతుఁడు గంగను దేవలెనని కోరెను గాని యతనికిని ఈ కోరిక కొనసాగదయ్యె. ఓమహాభాగా! క్షత్రియ

ధర్మముఁ దప్పక నడచియు, విశేషతప మొనర్చియు, నెక్కువప్రతాపముగల నీ తండ్రియగు దిలీపుఁడు గంగానదిని దేఁగోరియు మరల నాకోరికనుగూర్చి విచారముసేయకయె గతించెను. ఇట్టి గొప్పవారందఱు నెఱవేర్పని యీ కార్యము నీవు నెఱవేర్చి, యెప్పటికిఁ దఱుగని శాశ్వతమగు కీర్తి నొందితివి. శత్రువుల నణఁగఁద్రొక్కఁజాలిన యో భగీరథుఁడా! నీవు గంగను భూలోకమునకుఁ దెప్పించుట యను కార్యము చేయుటచే, నీకు శాశ్వతమయిన పుణ్యము కలిగినది. ఓ పురుషశ్రేష్ఠుఁడా, సముద్రమువలెఁ బక్వకాలమునందు మాత్రమే కాక, యెల్లప్పుడు స్నానయోగ్యంబయిన యీ గంగయందు నీవు మజ్జనము సేసి, పరిశుద్ధుఁడవై పుణ్యములను సంపాదింపుము ఓ నృపాలా, నీపెద్దలకెల్లఁ దర్పణాదులొనర్చి నీవు స్వనగరంబునకుఁ బొమ్ము; నీకు మేలుకలుగునుగాక! నేను బోయివత్తు" నని చెప్పి, తాను వచ్చినదారినే దేవదేవుఁడును, సకలజనులకు సృష్టికర్తయు నైన బ్రహ్మదేవుఁడు దేవలోకమునకుఁబోయెను. రఘుశ్రేష్ఠా! రాజర్షియుఁ, గీర్తిగలవాఁడునునగు భగీరథుఁడును తన పెద్దలకెల్ల వరుసఁ దప్పకయు, శాస్త్రప్రకారముగను నుత్తరక్రియలను దర్పణాదులను జేసి, పరిశుద్ధుఁడై, తాను దలఁచిన కార్యంబు నెఱవేఱుటచే ధన్యుఁడై తన నగరంబుజేరి రాజ్యము పాలించుచుండెను. అట్టి భగీరథుఁడు తమకు రాజగుటచే ప్రజలందఱు చింతఁ బాసి, యేమియుఁ గొఱఁత లేక నిర్భయులై యుండిరి. అనిచెప్పి విశ్వామిత్రమహర్షి రాముని జూచి, ఓ రామచంద్రా, నీకు గంగాచరిత్రము విస్తరించి చెప్పితిని. నీకు సకల క్షేమములు గలుగునుగాక, సంధ్యాకాలంబుఁ దాఁటిపోవుచున్నది. నీ సంశయము లిప్పటికిఁ జాలింపుము.

ధనమును, కీర్తిని, దీర్ఘాయువును, పుత్రపౌత్ర సంపదను, మోక్షమును, స్వర్గమును నొసఁగునట్టి యీ గంగావతరణమును బ్రాహ్మణాది నాలుగువర్ణములవారికిని ఎవఁడు వినిపించుచున్నాఁడో, వాఁడు తన పితృదేవతలను సంతోషపఱచుచున్నాఁడు. ఈ గంగావతరణకథ నేమానవుఁడు సావధానుఁడై వినుచున్నాఁడో, వాని సకలపాపములు నశించుచున్నవి; ఆయుస్సును, కీర్తియు వానికి హెచ్చుచున్నవి." అని విశ్వా

మిత్రుఁడు రామునితోఁ జెప్పి సంధ్యావందన మాచరింప గంగానదికిఁ బోయెను.

## 45 - వ స ర్గ ము.

### అమృతోత్పత్తి

విశ్వామిత్రమహర్షి చెప్పిన గంగావతరణమును విని, రాముఁడును లక్ష్మణునితోఁ గూడి మిక్కిలి సంతసించి, యెక్కువ యాశ్చర్యము నొంది, వెండియు విశ్వామిత్రమహామునిని జూచి, "ఓ బ్రహ్మజ్ఞా, తమరు చెప్పిన యీ గంగావతరణము, సాగరమునిండుటయు నను రెండును మహా పావనము లైనవి. ఇవి వినవిన వింతఁగొల్పుచున్నవి" యని యమ్మహామునిని బొగడెను. అంత నారేయి యంతయు రాముఁడును లక్ష్మణుండును విశ్వామిత్రమహర్షి చెప్పిన పుణ్యప్రదమైన కథనే తలపోసి కొనుచుఁ గడపిరి.

అంత, తెల్లవాఱఁగనే శత్రుసంహారియగు రాముఁడు ఉదయ కాలానుష్ఠానముల నెల్ల ముగించుకొనియున్న విశ్వామిత్రమహర్షిం జూచి, "సత్కథలతోఁ బవిత్రమైన రాత్రి గడచినది. అవశ్యముగా వినఁ దగిన గంగావతరణంబు వింటిమి. మహాతపస్సుతోఁగూడిన మహామునీ, మీరు వినిపించిన యీ గంగావతరణకథ నంతయుఁ దలపోసికొనుచుం డిన మాకు రాత్రి యొకక్షణమువలెఁ గడచినది. ఈపావనమైన గంగానదిని దాఁటుదము. ఋషు లెక్కిపోవుటకుఁ దగినట్లు దర్భాసనంబులు మొదలగునవి పఱచిన యీ యోడను నావికులు వేగిరంబుగాఁ దెచ్చిరి. ఈ యోడలోఁ గూర్చుండి యీ పావనమగు నదిని దాఁటుదము" అని చెప్పెను. అట్లు చెప్పఁగనే విశ్వామిత్రుఁడు ఋషిసంఘముతోడను, రామ లక్ష్మణులతోడను, గూడఁ బడవ యెక్కి గంగానదిని దాఁటి యుత్తరపుగట్టు చేరి, యచ్చట నున్న ఋషుల నందఱను పూజించి, గంగానది యుత్తరపుటొడ్డునఁ గొంత దడవు నిలిచి విశాలపురమును చూచిరి. అప్పుడే బయలుదేరి స్వర్గముతోఁ దుల్యమై, యందమై, యుత్తమమయి యుండు విశాలాపురికి విశ్వామిత్రమునీంద్రుఁడు ఋషి సంఘములతోడను, రామలక్ష్మణులతోడను బోయి చేరెను.

అంత మహాబుద్ధిశాలియగు రాముఁడు విశ్వామిత్రమహామునికి మ్రొక్కి, చేతులుజోడించి యమ్మహామునిం జూచి విశాలాపురిం గూర్చి యిట్లడిగెను. "మహామునీ! యే రాజవంశస్థు లీ విశాలాపురిం బాలించు చున్నారు? మహాత్మా, తమవలన నీ చరిత్రము వినవలె నని నా కెక్కువ యపేక్ష యున్నది" యని యడిగెను. అంత విశ్వామిత్రమహాముని యావిశాలానగరముయొక్క పురాతనచరిత్రమును జెప్పఁదొడఁగెను. "ఓ రఘువంశోద్ధారకా! యింద్రునియొక్క చరిత్రమును, నింకను నీ దేశమునం దేమేమి నడచెనో యది యెల్లను విస్తరించి చెప్పెదను వినుము.

తొల్లి కృతయుగమున దితికొడుకులు మిక్కిలి బలశాలులై యుం డిరి. మహాభాగ్యశాలినియగు అదితియొక్క పుత్రులు పరాక్రమవం తులు, ధర్మాత్ములు నై యుండిరి. ఒకప్పు డీ దితి పుత్రులకును, అదితిపుత్రు లకును 'మన మే పనిని జేసినయెడలఁ జావును, ముసలితనమును రోగ ములును లేనివారముగనుండఁగల?' మని యొక తలంపు వొడమెను. వారట్లు చింతించుచుండఁగా, పాలకడలిని జిలికి యచ్చట నమృతముఁ బడయుద మన్న తలంపు వారికిఁ గలిగెను. అంత వారు పాలకడలిని జిలుకుటకుఁ దీర్మానించుకొని, వాసుకిని కవ్వపుఁద్రాడుగను, మందరపర్వ తమును గవ్వముగను నేర్పఱిచికొని పాలకడలిం జిలికిరి. వారట్లు చిలుకుచుండఁగాఁ గవ్వపుఁద్రాడయినవాసుకి తలలు వేయిసంవత్సరములకు నోర్వరాని విషముఁగ్రక్కుచు మందరపర్వతమునందలి ఱాళ్లను తమ కోఱలతోఁ గొఱికెను. అట్లు కఱవఁగానె యగ్నిహోత్రునివలె నన్నిం టిని గాల్చివేయునట్టి హాలాహల మనెడి విషము పుట్టెను. అది బయటికి వచ్చుచునే, సకలలోకముల నుండువారిని, మనుజులను, దేవతలను, నసురులను గాల్చివేయఁదొడఁగెను. అప్పుడు దేవత లందఱు శంకరుని శరణుచొచ్చి, 'మహేశ్వరా, మమ్ముఁ గాపాడుము గాపాడు'మని మొఱపెట్టుకొని యనేకవిధముల స్తోత్రముఁ జేసిరి. ఇట్లింద్రుఁడు మొదలగు దేవతలు ప్రార్థించునపుడే, విష్ణుమూర్తి శంఖచక్రగదాధారి యై యా యీశ్వరుని ముందట నిలిచి, చిఱునవ్వు నవ్వుచు త్రిశూల ధారియగు శంకరునిఁజూచి, 'ఓమహేశ్వరా, నీవు దేవతలలోపల

మొదటి వాఁడవు. కావున దేవత లీపాలకడలిం జిలుకునపు డెయ్యది మొదటఁ బుట్టునో, దానిని నీవు గైకొనవలయును. ఇప్పుడీ హాలాహల మను విషము మొదటఁ బుట్టినది గావున దీనిని నీవు మొదటి మర్యాదనుగఁ దలఁచి గ్రహింపుము' అని చెప్పి యచ్చటనే యంతర్ధాన మొందెను,

అంత మహేశ్వరుండు దేవతల వెఱపును జూచి, విష్ణుమూర్తి మాటను నాలకించి, యమృతమునుబోలె నాహాలాహల విషమును ద్రావెను. అట్లు హాలాహలమును బానముచేసి, భగవంతుఁడైన శంకరుఁడు దేవతల వీడ్కొని స్వస్థానమునకుఁ జనియెను. ఓ పాపరహితుఁడ వయిన రఘునందనా! అంతటితో విడువక, దేవతలును, అసురులును పాలకడలిని జిలుక నారంభింపఁగా, నపుడు కవ్వమైన మందరపర్వతము పాతాళమునకుఁ గ్రుంకెను. అప్పుడు దేవతలు గంధర్వులు నందఱు విష్ణుమూర్తికడ కేఁగి, తమయవస్థఁ దెల్పుకొని 'ఓమహానుభావా! నీవె సకలప్రాణులకు దిక్కు. అందును దేవతలకు. వారికి నీవు దక్క వేఱు గతి లేదు. కావున మమ్ము రక్షింపఁగోరితివేని యీపర్వతమును లేవనెత్తుము' అని ప్రార్థించిరి. ఆదేవతల ప్రార్థనలు విని హృషీకేశుఁడు కూర్మరూపము ధరియించి పర్వతమును దనవీఁపుపై బెట్టుకొని సముద్రమున నుండెను. పదునాలుగు లోకములను దనలో నిమిడ్చికొన్న వాసుదేవుఁ డా మందరపర్వత శిఖరమును దనచేతితోఁ బట్టుకొని తానును వారినడుమనుండి వారితోఁగూడఁ జిలికెను. అట్లు వేయిసంవత్సరములు చిలుకుచుండ దండకమండలువులు దాల్చిన ధన్వంతరి పుట్టెను. ఎక్కువ కాంతిగల యప్సరసలుపుట్టిరి. రామచంద్రా, దేవతలు చిలుకునపుడు,అప్పునుండి (అనఁగా నీళ్లనుండి, యనఁగా పాలనుండి) యొక రసము పుట్టినది. ఆ రసమునుండి వీరు పుట్టినందున, వీ రప్సరస లనఁబడిరి. ఇట్టి యప్సరసలఱువదికోటులు పుట్టిరి. ఈ యప్సరసలకుఁ బనికత్తెలును లెక్కకు మిక్కిలిగఁ బుట్టిరి. అట్టి యప్సరసలను దేవతలుగాని, రాక్షసులుగాని బరిగ్రహింపరైరి. అందుచే వారు సాధారణస్త్రీలుగాఁ (వేశ్యలుగాఁ) బరిగణింపఁబడిరి. అంత సుర కధిదేవతయగు భాగ్యవతియైన వారుణి తన్నుఁ గ్రహించువారిని వెదకుచు బుట్టినది. అపుడు దితిపుత్రులు

డానిని గైకొనరైరి. అదితిపుత్రు లోచ్చములేని యావారుణిని గైకొనిరి. సురను గైకొనుటచేతనే దేవతలు సురు లనియు, సురను గైకొనమి చేతనే దైత్యులసురలనియుఁ బిలువఁ బడిరి. అప్పుడు దేవతలు సురను గైకొనుటచే మేనఁ బులకలెత్తఁగాఁ గడు సంతసము నొందిరి. ఆవల నుచ్చైశ్శ్రవ మనెడి యొక శ్రేష్ఠమగు గుఱ్ఱమును, కౌస్తుభమను మణి శ్రేష్ఠమును బుట్టెను. ఉత్తమమగు నమృతమును బుట్టెను. అయ్యమృతము నిమిత్తమై కులములకుఁ జేటుదెచ్చు గొప్పపోరు గలిగెను. అదితిపుత్రులు దితిపుత్రులఁ జంపిరి. ఆ పోరునం దసురులును రక్కసులును నొక్క ప్రక్కను జేరిరి. దేవత లంద ఱొక ప్రక్కఁ జేరిరి. ఇట్లా యిరుతెగలవారును జూపఱకు విస్మయం బొదవునట్లు పోరుచేసి, యొండొరులఁ జంపుకొనుచుండిరి. ఇట్లు రెండుతెగలవారును నశించుచుండఁగా విష్ణుమూర్తి మాయతో మోహినీరూపము దాల్చి, వేగ వచ్చి యాయమృతకలశము నపహరించెను. అపు డతని నెవ రెదిరించిరో, వా రందఱు నాతనిచే నుగ్గు నూచము సేయఁబడిరి. అతని నెవరు శరణు చొచ్చిరో, వా రందఱు గాపాడఁబడిరి. అప్పుడు విష్ణుమూర్తియొక్క సాయముఁవలన శూరులగు నదితిపుత్రులయిన దేవతలు దమకును దైత్యులకును జరిగిన ఘోరయుద్ధములో దితిపుత్రులను విశేషముగాఁ జంపిరి. ఇట్లు దేవతల కందఱకిఁ బ్రభువగు నింద్రుఁడు దేవతలతోడ్పాటు వలన దైతేయుల నందఱం బరిమార్చి, సంతసపడినవాఁడై, దేవతలు, ఋషులు, సిద్ధచారణాదులు వీరందఱితోఁగూడిన లోకములను బాలించుచుండెను.

## 46-వ సర్గము.

### దితియొక్క గర్భనాశము

శ్రీరామా! దితి తనపుత్రులందఱు మృతినొందఁగా మిగుల వగచినదై, మరీచుని పుత్త్రుఁడును, దన పెనిమిటియునైన కాశ్యపుని జూచి, 'మహాత్మా! మహా బలాఢ్యులైన నీపుత్రులచే నాపుత్రు లందఱు జంపఁబడిరి. నేను దీర్ఘకాలము తపముచేసి యింద్రుని జంపునట్టి కుమారుని బడయఁగోరుచున్నాను. అందు నిమిత్తమె తపముచేయ నున్నాను. నీవు నాకట్టి పుత్రుని బ్రసాదింపవలయును. ఐశ్వర్యవంతుఁడై యింద్రుని

సంహరింపఁ గలవానినిగా ననుజ్ఞ యీయవలయును." అని యడిగెను. అప్పుడు మరీచపుత్త్రుఁడైన కాశ్యపుఁడు దితి పలుకులు విని, మిగుల వగల పాలై యుండు దితిని జూచి, "అట్లే నీకుఁ బుత్త్రుఁడు పుట్టఁగలఁడు. అయినను నీ వేమఱుపాటు లేక వేయి సంవత్సరములు పరిశుద్ధురాలవయి యుంటివేని, ముల్లోకములఁ బాలించునట్టి యొక్క పుత్త్రుని నావలనఁ బొందగలవు. కాని నీ వీ వేయి యేండ్లును బరిశుద్ధురాలవుగ నుండ వలెను.' అని చెప్పి కశ్యపుఁ డామె దేహమును జేతితోఁ దడవి, 'నీకు మేలు గలుగును గాక' యని దీవనలొసఁగి, తపస్సు చేయఁబోయెను. ఓ నరశ్రేష్ఠుఁడవైన రాముఁడా! కాశ్యపుఁ డిట్లు పలుకఁగనే, దితి మిక్కిలి సంతసించి, కుశప్లవన మను క్షేత్రముఁ జేరి, మహాఘోరమైన తపముఁ జేయఁ దొడఁగెను. ఓనరశ్రేష్ఠా, యా దితి యిట్లు తపంబు సేయు చుండఁగా, దేవేంద్రుఁడు తన యుత్కృష్టగుణసంపదచే నామె కగ్ని, దర్భలు, సమిత్తులు, నీళ్లు, కందమూలఫలాదులును, నింకఁ గావలసిన వస్తువుల నెల్లఁ దెచ్చి యిచ్చుచు పరిచర్య సేయుచుండెను. అంతియ కాక యామెకుఁ గాళ్లు పిసుకుట, యలసట దీరునట్లు విసనకఱ్ఱలతో విసరుట మొదలగు నుపచారంబుల నెల్లవేళలయందును సల్పుచుండెను.

ఓ రఘునందనా! పదేండ్లు తక్కువఁగ వేయిసంవత్సరములు నిండఁ గానే, యింద్రుని శుశ్రూషకు దితి కడు సంతసమంది వేయి కన్నుల వేల్పగు నింద్రునితో నిట్లనెను. 'ఓ వేల్పుఱేఁడా, నేను మహాత్ముఁ డగు మా తండ్రిని యాచించితిని. వేయి సంవత్సరములు గడచిన పిదప నీకుఁ బుత్త్రుఁడు పుట్టు' నని నాకు వర మొసఁగెను. నేను తపము చేయ మొదలిడి యిప్పటికిఁ దొమ్మన్నూటఁ దొంబది యేండ్లు గడచి నవి. ఇఁకఁ బదియేండ్లు మిగిలి యున్నవి. ఈ పదేండ్లును గడచినవెంటనే నీకుఁ దమ్ముఁడు పుట్టఁగలఁడు. నీకు మేలు గలుగును. నిన్ను జయింపఁ గోరెడి నా కుమారుని నేను నీ నిమిత్తమై సమాధానపఱచెదను.' అని చెప్పి దితి మధ్యాహ్నకాలమునఁ బొన్నునందుఁ దల తట్టునకుఁ గాళ్ళు చాచుకొని పరుండి నిద్రించెను. అట్లే కాళ్ళతట్టు తలను బెట్టుకొని తల గడతట్టు కాళ్ళను జాఁచుకొని నిద్రపోవుచుండు నాదితినిఁ జూచి యామె మైలపడినది యని యెఱింగి, 'యీయామె మధ్యాహ్నమునఁ

బొన్నుపైఁ బరుండి నిద్రించినది. ఈమె మైలతాఁకినచో సంతతి గలుగ దని కశ్యపుఁడు చెప్పియున్నాఁడు గాన నాకోరిక నెఱవేరినది' యని పకపకనవ్వి మనసున నుప్పొంగెను.

అంతటితో నూరకుండక యెక్కువ ధైర్యశాలియైన యాతండు దితి కడుపులోఁ దూరి, గర్భము నేడు తునుకలుగ నఱికెను. అట్లు దేవేంద్రుఁడు తన నూఱంచుల కైదువగు వజ్రాయుధముతో నా గర్భ మును దునియలు సేయుచుండ నాగర్భములోని శిశువు బిగ్గఱగా గొం తెత్తి యేడ్వసాగెను. ఏడ్పు విని దితి తటాలున మేలుకొనెను. ఇంద్రుఁడు దితి కడుపులోపలనే యుండి, శిశువు 'నేడువవలదు. ఏడువవలదు.' అని చెప్పుచు, నా శిశువేడ్చుచున్నను దాని నేడుతునియలు చేసెను. అంత దితి తన కడుపులోని శిశువు నింద్రుఁడు చంపఁబూనుటయు, నది యేడ్చు టయు, నింద్రుఁడు శిశువును నేడువవలదని చెప్పుటయుఁ దెలిసికొని, 'ఓ యింద్రా! చంపవలదు; చంపవల'దని యింద్రునిఁ బిలిచి చెప్పెను. అప్పు డింద్రుఁడు తల్లిమాటయందు గౌరవ ముంచి యామె గర్భము నుండి వెలుపలికి వచ్చెను. అట్లు వచ్చి, యింద్రుఁడు వజ్రాయుధమును జేతఁ బట్టుకొని చేతులు జోడించి, దితిని జూచి, "యో తల్లీ, నీవు కాళ్ల కడఁ దలఁబెట్టి నిద్రపోయితివి గాన మైలపడితివి. అదియే నా సందు. నేను నీ కడుపులోపలికిఁ దూఱి, యుద్ధమున నింద్రుని (నన్ను) జంపునట్టి నీ గర్భము నేడు తునుకలుగా నఱికితిని. ఈ యపరాధము సైరింప వలయు" నని దితిని వేఁడుకొనెను.

## 47-వ సర్గము.

### విశ్వామిత్రుఁడు సుమతిని సంధించుట

ఇట్లింద్రుఁడు గర్భము నేడు తునియలుగా నఱకఁగా దితి మిగుల వగచి తరువాతఁ గొంత యూఱడిల్లి యింద్రునితో నిట్లనియె. 'దేవేంద్రా! ఈగర్భము నాయపరాధమువలననే యేడు శకలములుగాఁ ద్రుంపులు చేయఁబడినది. ఇందు నీతప్పేమియు లేదు. అయినను నే నీ యేడు గర్భపిండములకును మేలు గావింపఁ గోరుచున్నాను. ఈ తునుక లేడును నేడ్గురు దేవతలై మరుత్తుల లోకములఁ బాలింతురు కాక. ఈ నా

గర్భమువలన నేర్పడిన యేడ్గురు పుత్త్రులకును మారుతులను పేరు గలుగును గాక. వీరిలో నొకఁడు బ్రహ్మలోకమునను, మఱియొక్కఁ డింద్రలోకమునను, వాయు వని ప్రసిద్ధిఁ గాంచి మూఁడవవాఁ డాకసమునను, దక్కిన నల్వురును నీయాజ్ఞవలన దేవతలై, నాలుగు దిక్కులందును సంచరింతురుగాక" యని ప్రార్థించెను.

అంతట దేవేంద్రుఁడు దితి చెప్పినమాటలు విని చేతులు జోడించి, దితిని జూచి, 'తల్లీ, నీవు చెప్పినయట్లే కాఁగలదు. అది తప్పదు. దీనికి సంశయమువలదు. నీకుమారులును దేవతలై లోకములందు సంచరింతురు.' అని పలికెను. ఇట్లాతల్లికొడుకు లా తపోవనమున నిర్ణయము చేసికొని, కృతార్థులమైతిమని స్వర్గలోకమునకుఁ జనిరి యని చెప్పఁగా నేను వినియున్నాను.

ఓ కాకుత్థ్సా, యీ దేశము మునుపు తపస్సు చేయుచుండిన దితికి దేవేంద్రుఁడు శుశ్రూష చేసిన చోటు.

అంతియకాక, పూర్వకాలమునందు నిక్ష్వాకు వను మహారాజునకు అలంబుస యనుపత్నియొక్క గర్భమున విశాలుఁ డను నొకఁడు పుట్టెను. అతఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడు. అతఁ డీ పట్టణము నిర్మించుటచే దీనికి విశాల యనుపేరు గలిగెను. ఆ విశాలునికి మిగుల బలముగలవాఁడగు హేమచంద్రుఁ డనువాఁడు పుట్టెను. వానికి సుచంద్రుఁడు కుమారుఁడు. సుచంద్రుని కొడుకు ధూమ్రాశ్వుఁడని పేరు వహించినవాఁడు. వాని కొడుకు సృంజయుఁడు. ఆ సృంజయుని పుత్త్రుఁడు ప్రతాపముగల సహదేవుఁడు. ఆ సహదేవుని పుత్త్రుఁడు కడు ధార్మికుఁడైన కుశాశ్వుఁడు. కుశాశ్వునికొడుకు ప్రతాపవంతుఁడగు సోమదత్తుఁడు. ఆసోమదత్తునికొడుకు కాకుత్థ్సుఁడని ప్రసిద్ధికెక్కినవాఁడు. ఆయన కుమారుఁడయిన సుమతియనువాఁ డెక్కువ సౌందర్యముచే దేవతలఁ బోలి, శత్త్రువులకు లోఁబడనివాఁడై యిప్పు డీ విశాలానగరముఁ బాలించుచున్నాఁడు. వీరందఱును విశాలానగరము నేలు రాజులై యిక్ష్వాకు ననుగ్రహమువలన దీర్ఘాయుష్మంతులును, మహాత్ములును, వీర్యవంతులును, బరమధార్మికులునై యుండిరి.

"ఓ రామా మన మీ రేయి యిచ్చట సుఖముగానుండి యుద యమున లేచి జనకమహారాజుం జూడఁ బోవచ్చును" అని విశ్వామిత్రుఁడు రామునితోఁ జెప్పెను.

ఆ పట్టణమునకుఁ ఱేఁడగు ప్రతాపవంతుఁడైన సుమతి విశ్వామిత్రుఁడు వచ్చియున్నాఁడని యెఱిఁగి తన పురోహితుని, మంత్రులను, జుట్టములను వెంటఁబెట్టుకొనిపోయి, విశ్వామిత్రునకి గొప్ప మర్యాదలు సల్పి, చేతులు మోడ్చి క్షేమమడిగి, సంతుష్టునిం జూచి, "మహాత్మా! మీరు మా దేశమున నడుగుపెట్టితిరి. కాన నేను ధన్యుఁడ నైతిని. అనుగ్రహింపఁబడితిని. తమ దర్శనము లభించెను. నాకంటె ధన్యాత్ముఁడు లేఁడు." అని విశ్వామిత్రుని పొగడెను.

## 48 - వ సర్గము.

### సుమతి రామలక్ష్మణుల సంగతిఁ దెలిసికొనుట

ఇట్లు సుమతి విశ్వామిత్రులొండొరుల యోగక్షేమములను విచారించుకొనిన పిదప సుమతి మహామునిని జూచి "మహాత్మా! దేవతలకు సాటియయిన పరాక్రమమును, మదపుటేనుఁగుల యొక్కయు, సింహములయొక్కయు నడకవంటి నడకను, పులియొక్కయు నెద్దుయొక్కయు స్వభావముఁ బోలు గంభీరమగు స్వభావమును, తామరఱేకులవలె విశాలములైన కన్నులును గల యీ యిద్దరు పిల్లవాం డ్రెవరు? ఈ యిద్దఱు విల్లమ్ములను, ఖడ్గమును ధరించి యుద్ధమునకుఁ బోవు వీరుల చందమునఁ దోఁచినను, పసిబాలురగుటచే నాకాశమునుండి భూలోకమునకు దిగివచ్చిన యశ్వినీ దేవతలో యని చెప్పఁదగియున్నారు. మఱియు వీరు స్వేచ్ఛగా స్వర్గమునుండి భూలోకమునకు వచ్చిన దేవతలో యనఁదగియున్నారు. వీరి పేరేమి? వీ రెవరి కొడుకులు? ఏపనిని దలపెట్టి కాలి నడకతోఁ నిక్కడికి వచ్చియున్నారు? సూర్యచంద్రులాకాశమును వెలుఁగజేయునట్లు వీరీ ప్రదేశమును వెలుఁగొందఁ జేయుచున్నారు. ఒకనినిఁజూచిన మఱియొకనిని జూడవలసిన యక్కరలేదని చెప్పఁదగినట్లు, వీరు రూపము నందును, అవయవములందును, నడకలందును, పనులందును నొకరి నొకరు బోలియున్నారు. వీరి సంగతిఁ దెలిసికొనవలె నని మిక్కిలి వేడుకపడియున్నాను" అని యడిగెను.

అంతట విశ్వామిత్రమహాముని రామలక్ష్మణులను గూర్చియు వారు సిద్ధాశ్రమమునకుఁ దన యాగముఁ గాపాడుటకై వచ్చుటయు, నచ్చట వారు రాక్షసులను సంహరించుటయు మున్నుగాఁగల జరిగిన యన్ని సంగతులను సుమతికిఁ జెప్పెను.

అంతట సుమతి విశ్వామిత్రమహాముని చెప్పిన పలుకులు విని, తన గృహమునకు విందులుగా వచ్చిన మహాబలశాలులగు దశరథుని కొడుకులును, పూజార్హులును, అయిన రామలక్ష్మణులకు దగిన మర్యాదలు సల్పెను. రామలక్ష్మణు లా సుమతి తమ కొనర్చిన గొప్ప మర్యాదలఁ బడసి, యచ్చట నొకరాత్రి యుండి యుదయమున లేచి మిథిలకుఁ బయనమైరి.

ఇట్లు విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులతోడను, ఋషిసమూహములతోడను గూడి, మిథిలకు సమీపమునకుఁ బోఁగానే, ఋషులందఱు విశ్వామిత్రుని రామలక్ష్మణులను జూచి "చూచితిరా యీ మిథిలాపురి? ఎంత వేడుకగా నున్నదో!" యని మిథిలాపురిం బొగడిరి. వా రట్లు పోవునపుడు, మిథిలకు దాపుననే, పాడుపడినదియు, జన సంచారము లేనిదియు, నందమైనదియు నైన యొక్క యాశ్రమముం జూచి, దానిని రాముఁడు విశ్వామిత్రమునీంద్రునికిఁ జూపుచు, "మునిశ్రేష్ఠా, యిది యందమయిన యాశ్రమం బని తోఁచుచున్నది. దీనియందు మును లెవరు గానరారు. ఓ భగవంతుఁడా! యీ యాశ్రమమునను మునుం దెవ రుండిరి? ఇపు డిది యేల పాడుపడియున్నది? నాకు సవిస్తరముగా నెఱుఁగఁజెప్పవే" యని యడిగెను. ఆమాట విని మాటలలో నేర్పరియైన విశ్వామిత్రమహాముని సంతోషముతో రామునికి బదులు చెప్పెను.

"ఓ రాఘవా! యీ యాశ్రమ మెవరిదైనదియు, మహాముని కోపముచే నీవనమునకు శాపంబు సోఁకుట నిది యెట్లు పాడుపడినదియుఁ జెప్పెద నాలకింపుము. ఓనరశ్రేష్ఠా యిది మునుపు మహాత్ముఁడయిన గౌతముని యాశ్రమము. ఇది స్వర్గలోకముంబోలినది. ఇచ్చటికి దేవతలు నైత మప్పుడప్పుడు వచ్చుట వాడుక గలదు. అట్టి యీయాశ్రమంబున గౌతముఁడు తన పత్నియగు నహల్యతోఁ గూడి, యేండ్లు పూండ్లు దప మొనరించుచుండెను. ఒకనాఁడు గౌతమమహాముని యాశ్ర

మమున లేనపుడు దేవేంద్రుఁడు మునివేషంబు ధరించి, యహల్య దగ్గ ఱకు వచ్చి, "ఓసుందరీ, చక్కనినడుముగలదానా, కాముకులు ఋతు కాలమువఱకు వేచియుండక యిచ్చవచ్చినపుడు క్రీడింతురు. నేను నీతో రమింపఁగోరి వచ్చితిని" యని చెప్పఁగా, చెడిపెయగు నహల్య యతఁడు ముని వేషముదాల్చిన యింద్రుఁడని యెఱిఁగి, 'దేవేంద్రునితో సంగ మంబు తనకుఁ గలుగుట మెచ్చుగదా' యని యెంచి, దానికి సమ్మతించి, యతనితోఁ గొంత తడ వుండి, పిదప నిండు మనఃబుతో నింద్రునిఁ జూచి, 'వేల్పుఁ ఱేడా! నా జన్మము పావనమయ్యె. మునీంద్రుఁడు వచ్చు వేళ యయ్యెను. వేగ నిటనుండి పొమ్ము. ఈ రహస్యము లెవ రికిఁ దెలియనీక, నన్ను నిన్నుఁ గాపాడుకొనుము' అని చెప్పెను. అందు లకు దేవేంద్రుఁడు నవ్వుచు 'నో గొప్ప పిఱుఁదులుగలదానా, నేను పట్ట రాని సంతసము నందితిని. నేఁ బోయివచ్చెదను' అని యహల్యతోఁ బలికి, గౌతమ మహాముని యెక్కడ వచ్చునో యను దిగులుతోఁ గడు వేగముగఁ దడఁబడుచు బర్ణశాలనుండి వెడలివచ్చుచు దేవదానవులకుఁ గూడ గెల్వఁగూడనివాఁడును, విశేషతపోబలముగలవాఁడును, నది యందు స్నానంబుఁజేసి తడిబట్టలతో నున్నవాఁడును నై యగ్ని హోత్రునిమాడ్కిఁ దేజరిల్లుచు, సమిధలు, దర్భలు చేతఁబట్టుకొని యెదుట వచ్చుచుండు గౌతమమహామునిని జూచెను. అట్లు వచ్చిన యాచారసంపన్నుఁడైన గౌతముఁడు మునివేషము దాల్చి చెడునడత నటించిన వేయికన్నుల వేల్పును జూచి, యడఁగింపరాని కోపము నొంది, 'ఓ చెడ్డబుద్ధిగలవాఁడా! నీవు నా రూపమును దాల్చి చేయరానిపని చేసితివిగాన, నీకు వృషణము లూడిపడిపోవునుగాక" యని శపించెను. మహా రోషముతో నిట్లు గౌతముండు శపింపఁగనే, యింద్రుని వృష ణము లూడి క్రిందఁబడెను. గౌతమమునియు నింద్రుని కిట్లు శాపం బొసఁగి, పర్ణశాలలోపలికిఁ జని, 'యోసీ నీవు గాలిదిండివై, యాహా రంబులేక, తపించుచు బూడిదలోఁబ్రుంగి పెక్కేండ్లెవ్వరికిఁ గనఁబడ కుందువుగాక' యని శపించి పదపడి 'శత్రుసంహారియైన దశరథుని పుత్త్రుఁడు రాముఁడు భయంకరమగు నీ యరణ్యమున కెప్పుడు రాఁ గలఁడో యప్పుడు నీవు శాపమునుండి విడువఁబడుదువు. లోభ మోహ

ములం బాసి, యాశ్రముని బూజింతువేని నాసన్నిధిని సంతసముతో నిజరూపమును బొల్పగలవు.' అని చెప్పి బ్రహ్మతేజస్సుగల గౌతమ మహాముని చెడుపనిచేసిన యాయహల్య నిట్లు శపించి, యీ యాశ్రమము విడిచి, సిద్ధులు, చారణులు నుండు పవిత్రమైన హిమవంతము శిఖరమున తపము సేయఁబోయెను.

## 49 - వ సర్గము.

### అహల్యాశాపవిమోచనము

అంతట నింద్రుఁడు గౌతముని శాపమువలన వృషణహీనుఁడై, మిక్కిలి విచారము నొంది, యగ్నిహోత్రుండు మొదలగు దేవతలను, సిద్ధులను చారణులను, ఋషి సమూహములను జూచి, 'ఓ వేల్పులారా! మహానుభావుఁడగు గౌతమ మహామునికిఁ గోపము గలిగించి, యాతని తపమునకు విఘ్నము గావింప నీ దేవకార్యము చేసితిని. అంత నా మహాముని మిక్కిలి కోపగించి, నన్ను వృషణహీనునిగా శపించెను. అహల్యను గూడఁ బరిత్యజించెను. ఇట్లు మహాముని గొప్ప శాపం బొసఁగుటచే నతని తపస్సునంతయు నే నపహరించితిని. మీకందఱికి సాహాయ్యము చేయఁబోయి, నే నింత యాపదఁ దెచ్చుకొంటిని. కావున వేల్పులారా, మీ రందఱును ఋషీశ్వరులును, సిద్ధులును నాలోచించి, నన్ను వృషణసహితునిగాఁ జేయుఁడు' అని ప్రార్థించెను. అంతట వేల్పు లందఱు దేవేంద్రుని పలుకులు విని, యగ్నిదేవుని ముం దుంచుకొని, సకల మరుద్గణముతోఁ గూడ, పితృదేవతల సన్నిధి కేఁగి యిట్లనిరి. 'ఓ పితృదేవతలారా, యీ కసఁబసు మేషమునకు వృషణము లున్నవి. ఇంద్రునికి గౌతముని శాపమువలన వృషణము లూడిపోయినవి. కావున నీ మేఁకపోతుయొక్క వృషణములఁ గొనిపోయి, దేవేంద్రున కిండు. మేక వృషణహీనముగాఁ జేయఁబడినను, మీ కెక్కువ సంతోష మును గలిగించును. మిమ్ము సంతోషపెట్టఁగోరి, వృషణములులేని మేఁక నెవరిత్తురో, వారును మీ కెక్కువ సంతోషమును గలిగింతురు' అని దేవతలు చెప్పిరి. అగ్నిహోత్రుఁడు మొదలగు దేవతలు చెప్పిన యీమాట విని, హవిర్భాగములఁ గైకొనవచ్చిన పితృదేవత లందఱు గూడి మేకవృషణములఁ బెఱికి యింద్రున కిచ్చిరి. ఓ కాకుత్థ్సుఁడా, పితృ



అహల్యాశాపవిమోచనము—పుట. 122. బాల.

దేవతలు యాగములందు వృషణములు లేని మేకలను భుజించుచుందురు. అయినను వారు వృషణహీనములగు మేకల నొసంగువారికి వృషణములతోఁ గూడిన మేకల నొసంగువారి కిచ్చునంత ఫలంబుల నిత్తురు. అదిమొద లింద్రుఁడును మహాత్ముఁడయిన గౌతమమునియొక్క తపోమహిమవలన మేకవృషణములు గలవాఁడయ్యెను.

"ఓ యెక్కువ కాంతిగల శ్రీరాముఁడా! పవిత్ర కార్యములఁజేసిన యీ గౌతమమహాముని యాశ్రమములోనికిఁ బోవుదము రమ్ము. దివ్యరూపిణియు భాగ్యశాలినియునైన యహల్యకు శాపవిమోచనము గలిగించి, యామెను సద్గతి నొందింపుము." అని విశ్వామిత్రమహాముని రామునితోఁ జెప్పెను.

అంత విశ్వామిత్రమునీంద్రుని పలుకులు విని, రాముఁడు లక్ష్మణునితోఁగూడి, విశ్వామిత్రమహాముని ముందు నడచుచుండఁగా, ఆయనను వెంబడించి గౌతముని యాశ్రమము సొచ్చి, యా యహల్యను జూచెను. ఆ మహాత్మురాలు నహల్య తపోబలముచే వెలుఁగుచున్నదియు, దేవతలు, అసురులు, సకలలోకమువారు గూడి వచ్చినను జూచుట కలవికానిదియు, బ్రహ్మదేవుఁడు కడు ప్రయాసతో నిర్మించినందున మోహినీదేవత యో యనఁదగియున్నదియు, మేఘములు గ్రమ్మి, మంచుచేఁ గప్పఁబడిన నిండు చంద్రునికాంతిని బోలు మేనికాంతి గలదియు, నీటినడుమఁ జూచుట కలవికాకయుండు సూర్యబింబము మాడ్కిఁ గన్నులు చెదరఁజేయునదియు నై వెలుఁగుచుండెను. ఆ యహల్య గౌతమమహాముని శాపమువలన రాముని దర్శనమగువఱకు ముల్లోకంబులవారికిఁ గానరాకుండెను. ఆ రాముని జూచినంతనే, ఆ యహల్య శాపమునుండి విడువఁబడి, యందఱకుఁ బొడసూపెను. అంత రామలక్ష్మణు లామె పాదములఁ బట్టికొని మ్రొక్కఁగా, నా యహల్య గౌతముఁడు చెప్పినమాటను దలఁచికొని యా రామలక్ష్మణుల పాదములను దాను మరలఁబట్టుకొని, యర్ఘ్యపాద్యాద్యతిథి సత్కారములను శాస్త్రప్రకారముగఁ జేసెను. రాముఁడును నహల్య చేసిన యుపచారంబుల నెల్లఁ గైకొని పరమానంద భరితుఁడయ్యెను. అప్పుడు దేవతలు పుష్పవర్షము గురిపించిరి. దేవదుందుభులు మ్రోఁగి

నవి. గంధర్వులు పాటలం బాడిరి. అప్సరసలు నాట్యమాడిరి. అహల్యయు శాపవిమోచనము నొందఁగనే, గౌతముఁ డక్కడికి వచ్చి యామెను బరిగ్రహించెను. అట్లు తపోమహిమవలనఁ బాపమునుండి విడువఁబడి గౌతమ మహామునితోఁగూడియున్న యహల్యను దేవతలందఱు 'బాగు బాగ'ని కొనియాడిరి.

ఎక్కువ తపఃప్రభావముగల గౌతమమహామునియుఁ బత్నితోఁ గూడినవాఁడై, రామలక్ష్మణులను విశేషముగా గారవించి, యా వనముననే సుఖంబు లనుభవింపుచుఁ దపంబు సేయుచుండెను.

రాముఁడును లక్ష్మణసమేతుఁడై గౌతమమహామునివలన గొప్ప మర్యాదను బడసి, విశ్వామిత్రునితోడ మిథిలాపురంబునందుఁ బ్రవేశించెను.

## 50-వ సర్గము.

### విశ్వామిత్రుఁడు జనకునిసమీపము చేరుట

శ్రీరాముఁడు లక్ష్మణసమేతుఁడై, విశ్వామిత్రుని వెంబడించి యట నుండి యీశాన్యముగ నడిచి జనక మహారాజు యాగశాలయందుఁ బ్రవేశించి, యమ్మునివర్యునిఁజూచి, "మహామునీ జనకనృపాలుని యాగవైభవంబు మిక్కిలి బాగుగానున్నది. ఇచ్చట సకల దేశములనుండి వచ్చిన బ్రాహ్మణోత్తములనేకు లున్నారు. వీ రందఱు వేదములను సాంగముగాఁ జదివినవారలు. అగ్నిహోత్ర సంభారవాహకములైన వేలకొలఁది బండ్లతోనిండియున్న ఋషినివాసములు కనఁబడుచున్నవి. ఇచ్చట మన ముండుటకుఁ దగిన ప్రదేశ మేదో చూడుఁ" డని రాముఁడు చెప్పఁగా విని విశ్వామిత్రమహర్షి నీటివసతి గలిగి యేకాంతమైయున్న యొక ప్రదేశమునందు రామలక్ష్మణులతోడ నివసించెను

అంత జనకమహారాజు విశ్వామిత్రమహాముని రాక యెఱిఁగి, యోగ్యుఁడయిన తన పురోహితుఁడగు శతానందుని ముందిడికొని, వినయముతో నమ్మహామునియొద్దకు బోయెను. మహాత్ములగు ఋత్విజులును, పూజాద్రవ్యములను గైకొని చని విశ్వామిత్రునకు, మంత్రపూర్వకముగా నర్ఘ్యపాద్యాదు లొసఁగిరి.

అంత విశ్వామిత్రుఁడు జనకమహారాజొనర్చిన పూజను గైకొని, యారాజును సేమ మడిగి నిర్విఘ్నముగా యజ్ఞము సాగుచుండుట నడిగి తెలిసికొని పిదపఁ దనకుఁ బూజలొనరించిన యా మునులను, ఋత్విక్కులను, పురోహితులను వరుసప్రకారముగా క్షేమమడిగి, వారితోఁగూడి కడు సంతసించెను. అంతట జనకమహారాజు విశ్వామిత్రమునిని, వారితోఁ గూడ వచ్చిన ఋషుల నందఱిని పీటలమీఁద గూర్చుండఁ బ్రార్థించెను. జనకుని పలుకులు విని విశ్వామిత్రమునీంద్రుఁ డారా జొసఁగిన యాసనముపయి గూర్చుండెను. వెంటనే పురోహితుఁడగు శతానందుఁడును, యాగముఁ జేయించుచున్న ఋత్విజులును గూర్చుండిరి. అందఱు గూర్చున్నపిదప, రాజును మంత్రులతోఁగూడ గూర్చుండెను.

అవ్విధంబున నందఱు వారివారి మర్యాదలకుఁదగిన యాసనంబులందుఁ గూర్చుండఁగానే, జనకనృపాలుఁడు విశ్వామిత్రమహామునిని జూచి యిట్లనియె.

"ఓ మహామునీ, నేఁడు తమ దర్శనముఁవలన నా యజ్ఞము సమగ్రముగా నెఱవేఱినది. దేవతలచే సఫలము చేయఁబడినది. యజ్ఞము చేసినందువలనఁ గలిగెడు ఫలము నేఁడు తమదర్శనము వలన సమకూరినది. ధన్యుఁడ నైతిని. అనుగ్రహింపఁబడితిని. మహాత్మా! తాము మునులతోఁ గూడ నాయజ్ఞమునకు దయచేసితిరి. ఓ బ్రహ్మర్షీ! యిఁక నీ యాగమునకుఁ బండ్రెండుదినములు మాత్రమే మిగిలియున్న వని ఋత్విజులు చెప్పిరి. తా మంతవఱకుండి, యాగమునందు హవిర్భాగముఁ గొనిపోవ వచ్చెడు వేల్పులను జూతురుగాక" యనిచెప్పి, వినయముతోఁ జేతులు జోడించి మరల నిట్లనెను. "ఓమహామునీ, తమకు మేలు గలుగుగాక. దేవతలంబోలు పరాక్రమశాలులయిన యీ రాజపుత్రు లెవరు? వీరి నడక యేనుఁగుగున్నలయు, సింహములయు నడకను బోలియున్నది. వీరు పులులను, నెద్దులను బోలు గంభీరస్వభావము గలవారును, తామరఱేకులవలె విశాలమయిన కన్నులుగలవారును, ఖడ్గములను, నమ్ములపొదులను, విండ్లను దాల్చినవారును, రూపమున నశ్వినీదేవతలను బోలువారును, వయస్సువచ్చినవారును, వేడుకగా స్వర్గమునుండి భూలోకంబునకు దిగివచ్చిన వేల్పులో యనఁదగువారును నై

యున్నారు. ఈపసివారం డ్రిద్ద ఱెట్లింతదూరము నడవఁగలిగిరి? ఎందుల కిట కేతెంచిరి? వీర లెవ్వరు? ఈమేటి యాయుధములఁ దాల్చిన వీర లెవ్వరికుమారులు? సూర్యచంద్రు లాకసమును వెలుఁగఁజేయునట్లు వీరు నా యాగశాల నంతయుఁ దమ కాంతిచేఁ బ్రకాశింపఁజేయుచున్నారు. వీరియొక్క యొడ్డు పొడువులను, తలఁపులను, పనులను జూడ నిరువురకుఁ గొంచెమయినను భేదము దెలియకున్నది. ఈ బాలురు కాకపక్షములను ధరించికొని యున్నారు. వీరి వృత్తాంతమును నాకు విస్తరించి చెప్ప వలయునని విశ్వామిత్రుని జనకమహారాజు అడిగెను.

ఆపలుకులు విని విశ్వామిత్రుఁడు జనకమహారాజుం జూచి, "నృపాలా! యీబాలురు దశరథమహారాజు పుత్రులు. వీరిని నా యాగ రక్షణార్థమై సిద్ధాశ్రమమునకుఁ బిలుచుకొని వచ్చితిని. అచ్చట వీరు రాక్షసు లందఱిని జంపి నా యాగము కొనసాగించిరి. అటనుండి మేము మిథిలాపురంబునకు రాఁగోరి, నడిదారియందు విదేహాపురముఁ జొచ్చి, యచ్చటి విశేషములను జూచి, యహల్యను గని, యామె శాపవిమో చనముఁ గావించి గౌతముని దర్శనము చేసికొని, యచ్చటనుండి యిచ్చటి కేతెంచితిమి. ఇక్కడికి వచ్చుటకు ముఖ్యహేతువు తమకడ నున్నవింటిని జూచి, యది వంచుటకు శక్యమగునేమోయని ప్రయ త్నించుటకే." అని పరాక్రమ వంతుఁడయిన జనకమహారాజుతోఁ జెప్పి యూరకుండెను.

## 51 - వ స ర్గ ము.

శతానందుఁడు రామునికి విశ్వామిత్రుని వృత్తాంతంబుఁ దెల్పుట

ఇట్లు జ్ఞానియగు విశ్వామిత్రుఁడు చెప్పిన పలుకులు విని యెక్కువ బ్రహ్మవర్చస్సు గలవాఁడును, తపస్సంపన్నుఁడును, తన తపో బలముచేత దిక్కుల నెల్ల వెలిగించువాఁడును నైన గౌతమునియొక్క పెద్దకుమారుఁడగు శతానందుఁడు రాముని జూచినంతనే (తనతల్లికి శాపవిమోచనము చేసినందుచే) పులకితగాత్రుఁడై సుఖాసీనులై యున్న రాజపుత్రులఁ జూచి, విశ్వామిత్రమహామునితో నిట్లనియెను. "మునీం ద్రా! చిరకాలమునుండి తపము జేయుచు యశస్విని యైన మాతల్లిని శ్రీరామునికిఁ జూపితివా? సకల లోకములకును బూజార్హుఁడైన శ్రీరా

మునికి మాతల్లి వన్యములైన కందమూలఫలాదులచే నతిథిపూజ సల్పి నదా? మాతల్లియొక్క ముందటిశాపవృత్తాంతము నంతయు సవిస్తరంబుగా రామునకు వినిపించితిరా? రామునిదర్శనమువలన మాతల్లి శాపవిమోచనము బొంది, మాతండ్రిగారిఁ జేరెనదా? కుశికనందనా, యెక్కువ తపఃప్రభావముగల మాతండ్రి రాముని కతిథిపూజ లొనరించెనా? ఈరాముఁ డడకువతో మాతండ్రికి నమస్కరించెనా?" అని యడిగెను. మాటాడ నేర్పుగల విశ్వామిత్రమహాముని యాశతానందుని పలుకులు విని, మాటలలో నేర్పరియగు శతానందునిఁ జూచి, "మునిశ్రేష్ఠుఁడా, యేదియు మఱవలేదు. చేయవలసినవియెల్లఁ జేసి వచ్చితిమి. రేణుక భృగువంశమునఁ బుట్టిన జమదగ్నితోఁ గలిసినట్లు మీ తల్లియగు నహల్య గౌతమునిఁ గలిసికొనెను" అనెను.

అంత మహాతేజస్వియైన శతానందుఁడు విశ్వామిత్రునిపలుకులు విన్నపదంపడి రాముఁ జూచి, "ఓ నరశ్రేష్ఠా, పరాజయ మెఱుఁగని విశ్వామిత్రుని తోడ దైవయోగముచే నేతెంచితివి. నీకిదే స్వాగతము. ఈ విశ్వామిత్రుఁడు అచింత్యకర్ముఁడు. తపస్సుచే బ్రహ్మర్షి యైనవాఁడు. అతులప్రభావంతుఁడు. మహాతేజస్వి. ఇట్టి యతని నీవు పరమహిత ప్రదునినిగా గుర్తెఱిఁగితివో? రామా! నీకంటె నీప్రపంచములో ధన్యతరుఁడు మఱొకఁడు లేఁడు. ఏల యన? విశ్వామిత్ర మహర్షిచే రక్షితుఁడవైతివి. ఇమ్మహర్షి మిక్కిలి ఘోరతప మొనర్చినవాఁడు. ఓ రాజపుత్రా! యీ మహాత్ముఁడైన కౌశికుని వృత్తాంతమునంతయు సవిస్తరముగాఁ జెప్పెద నాలకింపు"మని రామునకు విశ్వామిత్రమహాముని మొదట రాజర్షియైయుండి పిమ్మట బ్రహ్మర్షియైన వృత్తాంతము చెప్పఁ దొడఁగెను.

శ్రీరామా! యీ విశ్వామిత్రమహామునిని జాలకాలమువఱకు, సకలధర్మముల నెఱిఁగినవాఁడును, విద్యల నన్నింటిని జదివినవాఁడును, ప్రజల మేలుగోరినవాఁడును, శత్రువుల నణఁచువాఁడు నైన క్షత్రియుఁడుగా నుండెను.

బ్రహ్మదేవుని కుమారుఁడయిన కుశుఁడను నొక రాజుండెను. ఆకుశునికి మిక్కిలి ధర్మాత్ముఁడయి బలవంతుఁడగు కుశనాభుండను రాజు

పుట్టెను. ఆ కుశనాభునికి గాధియను నొక ప్రసిద్ధుఁడైన కొమరుఁడు గలిగెను. ఈ బ్రహ్మతేజస్సుగల విశ్వామిత్ర మహాముని యాగాధి రాజునకుఁ బుత్త్రుఁడు. ఈ విశ్వామిత్త్రుఁడు తండ్రి యనంతరము పెక్కు వేలయేండ్లు రాజ్యము నేలుచు, ప్రజలను సంతోషపఱచుచుండెను.

ఇట్లుండఁగా నొకప్పుడు విశ్వామిత్త్రుఁ డొక యక్షౌహిణి సంఖ్య గల సేనను గూర్చికొని, భూమియంతయుఁ దిరుగఁబోయెను. ఇట్లితఁడు గొప్ప సేనతోఁగూడి, యనేకపట్టణములను, దేశములను, నదులను, కొండలను, ఋషుల యాశ్రమములను, ఒక్కటివెంబడి నొక్కటిగాఁ జూచుచుఁబోయి వసిష్ఠమునీంద్రునియొక్క యాశ్రమము జూచెను. ఆవసిష్ఠమహాముని యాశ్రమము సకలవిధంబులగు వృక్షములతోడను పక్షులగుంపులతోడను గూడినదై, దేవతలు, దానవులు, గంధర్వులు, కిన్నరులు, సిద్ధులు, చారణులు మొదలగువారిచే సేవింపఁబడుచుండెను. అందెచ్చటఁ జూచినను జింకలు నిర్భయముగాఁ దిరుగుచుండును. అయ్యాశ్రమము బ్రహ్మర్షులయు, దేవర్షులయు గుంపులతో వెలుఁగు చున్నది. ఆయాశ్రమమునందుఁ దపస్సు చేసి కోరికల నొందినవారును, నగ్నిహోత్త్రునివలెఁ వెలుఁగుచుండువారును, నీరుద్రావి కాలముపుచ్చు వారును, గాలి యాహారముగాఁ గొనువారును, పండిరాలినయాఁకులఁ దినువారును, పండ్లు, దుంపలు మొదలగునవి భక్షించువారును, లోపలి యింద్రియములను (మనస్సు) వెలుపలి యింద్రియములను (కన్నులు), (చెవులు మొదలగువానిని) స్వాధీనపఱచుకొన్నవారును, రోషము నణఁచుకొన్నవారునునై, జపము, ఔపాసనము, హోమము మొదలగు కార్యములే ముఖ్యముగాఁ జేయుచున్న ఋషులును, వాలఖిల్యులనెడి మహామునులును, మఱియు వైఖానసవృత్తి నవలంబించినమునులు పలు వురును తపోవనమంతయునిండి, యాశ్రమమునకు సొంపును గలుగఁ జేయుచుందురు. అట్లు సకలమునిగణములతోఁగూడి, రెండవ బ్రహ్మ లోకమో యనఁదగియున్న యావసిష్ఠాశ్రమమును బలవంతుఁడును, జయించువారిలో నుత్తముఁడును నయిన విశ్వామిత్త్రుఁడు చూచి యందుఁ బ్రవేశించెను.

## 52-వ సర్గము.

వసిష్ఠుఁడు విశ్వామిత్రునికి విందుపెట్టఁ దలఁచుట

అట్లు మహాబలశాలియైన శూరుఁడగు విశ్వామిత్రుఁడు మంత్రముల జపించువారిలో నుత్తముఁడైన వసిష్ఠమునీంద్రునిఁ జూచి, యడఁకువతో మ్రొక్కఁగా మహానుభావుఁడైన వసిష్ఠమహాముని, నీ కిదే స్వాగత మని చెప్పి యాసనంబిచ్చి కూర్చుండ నియమించెను. విశ్వామిత్రుఁడు గూర్చున్నతర్వాత వసిష్ఠమహాముని యథోచితముగా ఫలమూలముల నొసఁగి సత్కరించెను. అంత రాజశ్రేష్ఠుఁడు వసిష్ఠమహాముని యొసఁగిన సత్కారమును స్వీకరించి వసిష్ఠమహామునింజూచి, "మునీంద్రా, తమ తపస్సును, నుదయకాల సాయంకాలోపాసనాదులగు నగ్నిహోత్రములును నిరాటంకముగా జరుగుచున్నవిగదా? శిష్యులు కుశల మున్నవారుగదా! తమ యాశ్రమమున నున్న వృక్షము లన్నియు నాయా ఋతువులలోఁ జిగిరించి, పుష్పించి, కాయలతోఁ బండ్లతో నొప్పుచున్నవియే? యని యడిగెను. అందులకు వసిష్ఠుఁ డారాజశ్రేష్ఠునితో "అన్నింటను గుశలమే" యనిచెప్పి సుఖాసనాసీనుఁడై యున్న విశ్వామిత్రుని జూచి బ్రహ్మమానస పుత్రుఁడును, మంత్రవేత్తలలో నెల్ల నుత్తముఁడును నైన యా వసిష్ఠమునీంద్రుఁడు విశ్వామిత్రుని నివ్విధంబున గుశలప్రశ్న చేసెను.

"ఓ మహారాజా! నీకు క్షేమముగదా? న్యాయమార్గముచే జనులను సంతోషపెట్టుచు, *రాజధర్మముఁ దప్పక, దుష్టులను దండించుచు, శిష్టులను బోషించుచు రాజ్యముఁ బాలించుచున్నాఁడవు గదా? కొలువుకాండ్రకు నెలబత్తెములు తప్పక యిచ్చుచున్నాఁడవు గదా? వారు నీమాట మీఱక లోఁబడి నడుచుకొనుచున్నారుగదా? శత్రునాశకుఁడా! నీవు శత్రువులు లొంగి, నీవు చెప్పినట్లు నడుచుకొనుచున్నారు గదా? నీ సేనలలో నేమియుఁ గొఱఁత లేకున్నదిగదా? ఓ నరవ్యాఘ్రా! బొక్కసమున సొమ్ము దండిగా నున్నదిగదా? నీ స్నేహితులందఱు

---

* రాజధర్మము నాలుగు తెఱఁగులు:-1. న్యాయమున ధనము సంపాదించుట. 2. సంపాదించిన దానిని వృద్ధినొందించుట. 3. వృద్ధినొందినదానిని గాపాడుట. 4. అట్లు కాపాడినదానిని యోగ్యులకు దానముచేయుట.

నీయెడఁ జెలిమిగలిగి నడుచుకొనుచున్నారుగదా? నీకొడుకులు కూఁతులును, మనుమలు మనుమరాండ్రును క్షేమముగా నున్నారుగదా" యని వసిష్ఠమునీంద్రుఁడు విశ్వామిత్రు నడుగఁగా, నెక్కువతేజస్సుగల యప్పుడమిఱేఁడు వినయపూర్వకముగా నన్నిటికిని బదులు సెప్పెను.

ఇట్లు ధర్మవేత్తలయిన వసిష్ఠ విశ్వామిత్రు లొండొరుల క్షేమముల విచారించుకొని, వింతలైన యాయా కథలను జెప్పుకొనుచుఁ బరస్పరము సంతోషించిరి.

అంత భగవంతుఁడగు వసిష్ఠమహాముని తమ సంభాషణము ముగిసినపిదపఁ జిఱునవ్వు నవ్వుచు విశ్వామిత్ర నరేంద్రుని జూచి, "మహారాజా! నీవు నాకరాక మాయాశ్రమమునకు వచ్చితివి. నీవు అతిథులలో గొప్పవాఁడవు. అందును మహారాజవు. నిన్ను విశేషముగ సత్కరింపఁ దగినవాఁడవు. కావున నీకును నీ సేనలకును దగిన చొప్పున విందు పెట్టఁగోరితిని. నీవు నామాటఁ ద్రోసివేయక యంగీకరింపవలయును" అని చెప్పెను.

వసిష్ఠమహాముని చెప్పిన మాటలు విని జ్ఞానవంతుఁడయిన విశ్వామిత్రుఁడు, "మహాత్మా, తా మతిథిపూజ వేఱుగఁ జేయనక్కఱలేదు. ఇప్పుడు తా మొసంగిన ఫలమూలాదులును, నర్ఘ్యపాద్యాచమనీయములును విందులే. వేయేల? తమదర్శనమే మాకు గొప్పవిందు. పూజకుఁ దగిన యా దర్శనముచేతనే యన్నివిందులు పెట్టినంత ఫలము గలిగె. తమకు మ్రొక్కుచున్నాఁడను. పోయివచ్చెదను. నన్ను స్నేహదృష్టితోఁ జూచుచుండ వలసిన" దని చెప్పి పయనమయ్యెను. అయినను, నుదారమయిన బుద్ధిగలవాఁడు ధర్మపరుఁడునగు వసిష్ఠమహాముని విశ్వామిత్ర నృపాలుని మాటిమాటికి నిర్బంధించి, నిలుమని చెప్పఁగా, విశ్వామిత్ర నృపాలుఁడును మునిమాటఁ ద్రోయఁజాలక, "మునిపుంగవా! మీ కెట్లు చేసినఁ బ్రియమో యట్లే కానిం"డని యొప్పుకొనెను.

అటుపిమ్మటఁ దపస్వులలో మొదటివాఁడును, విశేషమయిన బ్రహ్మవర్చస్సు గలవాఁడును, పాపములేనివాఁడును నైన వసిష్ఠుఁడు మిక్కిలి యుప్పొంగి, చిత్రవర్ణములుగల కామధేనువుం బిలిచి, "ఓ శబలా! వేగిరముగ రమ్ము. నా మాట వినుము. నే నీ విశ్వామిత్ర నృపాలునికిని

నతని సేనలకును, విందుఁబెట్ట నిశ్చయించితిని. నీ వీ క్షణముననే షడ్రసోపేతములయిన యాహారపదార్థముల నాయితపఱుపుము. ఎవని కెవని కేయే పదార్థములు గావలెనో, ఎవని కెవని కేయే రసమున నిష్టమో, ఆ యా రసములతోఁగూడిన పదార్థములను సిద్ధపఱుపుము. నీవు కోర్కులను బిదుకుదానవు గదా. నీవు నానిమిత్తమై, భక్ష్యభోజ్య లేహ్య చోష్య పానీయములతోఁ గూడిన మధురాన్న రాసులను సృజింపుము. జాగు సేయకుము" అని కామధేనువుతోఁ జెప్పెను.

## 53-వ సర్గము.

### వసిష్ఠుఁడు విశ్వామిత్రునకుఁ గామధేనువు నియ్యమనుట

ఇవ్విధమున వసిష్ఠుఁడు కోరినంతనే, కోర్కులఁ బిదుకునట్టి కామధేను వెవరెవరి కేది యిష్టమో, వానినెల్లను సమకూర్చెను. సకల విధములైన మద్యములను, బేలాలను, జెఱకుపాలను, మైరేయము లనెడి యాసవములను, నింక ననేకవిధములైన పానీయములను, నానావిధములైన భక్ష్యములను, బర్వతములం బోలు వేఁడి వేఁడి యన్నరాసులను, కలవంటకములను, సూపములను, విశేషముగఁ బెరుగును, ననేకవిధములైన రసములను, షడ్రసోపేతములయిన భక్ష్యములను, బెల్లముతోఁ జేయఁబడిన భక్ష్యములను, వెండి, బంగారుమయములగు పళ్లెరములను నాయితపఱచెను.

విశ్వామిత్ర నృపాలుఁడును, అతని యంతఃపురస్త్రీలు, మంత్రులు, పురోహితులు, బ్రాహ్మణులు, సేవకులు, సైనికులు, అందఱును వసిష్ఠ మహాముని తమ కిడిన మృష్టాన్నముల నిష్టముగాఁ గుడిచి యెక్కువ తృప్తిని బొందిరి. ఇట్లు వసిష్ఠమహాముని చేసిన విందుచే విశ్వామిత్ర నృపాలుఁడు సంతసించి, యతనిని జూచి, "ఓమహర్షీ, పూజ్యులయిన తా మొనర్చిన యతిథి పూజకు నెక్కువ తనివి జెందితిని. నా కొక కోరిక యున్నది; విన్నవించెదను. తమకు లక్ష గోవుల నిచ్చెదను. ఈ శబలను నా కిండు. ఇది శ్రేష్ఠమయినది. శ్రేష్ఠమగు వస్తువు రాజునకుఁ జేరవలయును. న్యాయ్యముగా నీ కామధేనువు నాది. నా వస్తువును నా కిప్పింపవలయును" ననెను.

ఆ విశ్వామిత్రుని మాట విని వసిష్ఠుఁ డాతనితో నిట్లనెను. "ఓ మహారాజా! నీవు దీని కీడుగ లక్ష యావులనిచ్చినను, దీని నీయను. నూఱుకోట్ల యావుల నిచ్చినను నేను దీనిని నీయను. నీవు బంగారు, వెండి రాసులు కాసులుగాఁ బోసి, దీని నిమ్మనినను నేను దీని నీయను. ఇది నా కడనే యుండవలెను. ధైర్యవంతునికిఁ గీర్తి యెట్లావశ్యకమో, అట్లీకామధేనువు నా కావశ్యకము. నా హవ్యకవ్యములును, జీవనమును, ఔపాసనములును, బలి, హోమములు మొదలగు నన్ని పనులు నిది లేనిచో నేమియు జరుగనేరవు. ఓ రాజర్షీ, మఱియు స్వాహాకార వషట్కారములనెడు మంత్రములును, విద్యలన్నియు దీనియందే యిమిడి యున్నవి. దీని కే సంశయమును లేదు. వాస్తవము చెప్పెదను. నాకుఁగల యావద్ధనము నిదియ. అనేక కారణములనుబట్టి, నేను దీనిని నీకీయజాలను." అని వసిష్ఠమహాముని రాజర్షియగు విశ్వామిత్రునితోఁ జెప్పఁగా, మాటలలో నేర్పరియగు నా విశ్వామిత్ర నృపాలుఁడు మఱింత నిర్బంధముతో నమ్మునివరుని కిట్లు చెప్పెను.

ఓ మహామునీ, బంగారుమయములైన నడిమికిఁ గట్టు పట్టెలును, మెడలోఁగట్టు మోకులును గలవియు, బంగారుతోఁ జేసినయంకుశము లతోఁ గూడినవియు నైనపదునాలుగువేల యేనుఁగుల నొసఁగెదను. ఈ కామధేనువును నా కిప్పింపవలయును. కాదేని, నాలుగేసి తెల్లగుఱ్ఱములఁ గట్టినవియు, పసిఁడి చిఱుగజ్జెలు గట్టినవియునైన యెనిమిదివందల బంగారు తేరుల నిచ్చెదను. ఈ కామధేనువును నా కిమ్ము. కాదేని, సింధు సౌరాష్ట్రాది దేశములందుఁ బుట్టినవియు, లక్షణము లన్నిటితోఁ గూడినవియు, నెక్కువ బలిమిగలవియు నైన పదివేలగుఱ్ఱము లిచ్చెదను. ఈ కామధేనువును నాకిమ్ము. లేదా, పలు వన్నెలుగలవియు మంచివయసులో నున్నవియునైన కోటి యావుల నిచ్చెదను. ఈ యావును నా కిమ్ము. అందులకు సమ్మతి లేదేని, యెంత బంగారముఁ గోరినను లేక యెన్ని రత్నములఁ గోరినను నెంత ధనమును గోరినను నంతయు నిచ్చెదను. ఈ కామధేనువును నాకిమ్మని యనెను.

ఇట్లెన్ని విధములుగ నడిగినను, వసిష్ఠమహాముని మాత్రము "ఓ మహారాజా! యీ కామధేనువే నా కన్ని రత్నములు. ఈ కామ

ధేనువే నాకు ధనము. ఈ కామధేనువే నా యాస్తియంతయును. ఈ కామధేనువే నాప్రాణము. ఈ కామధేనువే దర్శ పూర్ణ మాసములనెడి యిష్టులును, బూర్తిగా దక్షిణలిచ్చిన యాగములును, నేను జేయు సకల క్రియలును, ఈ కామధేనువే మాకార్యముల కన్నింటికిని నాధారము. ఓ మహారాజా! వట్టిమాటలు వేయేల? ఈ కామధేనువు కావలసిన కోర్కులొసఁగునది గాన, దేనిని నీవిచ్చినను, దీనిని మాత్రము నీ కీయను. ఇది దృఢమైన సంగతి" యని మాఱు పలికి యూరకుండెను.

## 54-వ సర్గము.

### విశ్వామిత్రుని యుద్ధము

ఎప్పుడు వసిష్ఠమహాముని కామధేనువునిచ్చుట కొప్పుకొనలేదో, అప్పుడు విశ్వామిత్రనృపాలుఁడు తానే యాకామధేనువు నీడ్చికొని పోవఁ జొచ్చెను. ఇట్లాబలశాలియగు విశ్వామిత్రుఁడా కామధేనువు నీడ్చుకొని పోవుచుండఁగా, నది మిక్కిలి దుఃఖించి, బిట్టుగ నఱచుచు, "అయ్యో! మహాత్ముఁడైన వసిష్ఠమునీంద్రుఁడు నన్నేల విడిచి పెట్టెను? ఈ రాజభటులు నన్ను బట్టి కట్టి యీడ్చుకొని పోవుచున్నారే! ఈ కష్టము నా కేల వచ్చెను? ఆత్మజ్ఞానియగు నా మహర్షి కేమియపకారము నేసితిని? సకల ధర్మముల నెఱిఁగి, వానిని నడపుచుండువాఁడయ్యును, తప్పులేనిదానను, తనయెడ భక్తిగలదానను నయిన నన్నేల యిమ్మహాముని విడిచెను." అని మనమునఁ బలుమాఱు వగచి, నిట్టూర్పు నిగిడించి, తన్నీడ్వవచ్చిన యా రాజభటుల నందఱను గ్రుమ్మి వాయు వేగంబుంబోలు వేగముతో నమ్మహాముని పాదములకడకు వచ్చి, యేడ్చుచు మేఘమువలెను దుందుభివాద్యమువలెను నఱచుచు, ముని పుంగవునిం జూచి, "ఓమహాత్మా! బ్రహ్మపుత్రుఁడా, తమరు సకల ధర్మముల నెఱింగినవారయి యుండియు, నిరపరాధనైన నన్నేల విడిచితిరి? లేకున్న నీ రాజభటులు తమకడనుండి నన్నెట్లు లాగికొనఁగలిగిరి?" యని మొఱలిడఁగా, వసిష్ఠుఁడు దుఃఖముచే మనమునఁ గుందుచు నేడ్చుచుండు కామధేనువుం జూచి, "ఓ కామధేనువా! నేను నిన్ను విడువను లేదు. నీవు నా కేమి యపకారముఁ జేయలేదు. ఈ విశ్వామిత్రుఁడు బలవంతుఁడు గనుక, బలాత్కారముగా నావద్దనుండి నిన్నుఁ గొనిపోవు

చున్నాఁడు. ఈతనితో సాటివచ్చు బలము నాకు లేదు. అందును నతఁడిప్పుడు మనదేశమునేలు రాజు, బలవంతుఁడు, భూమికిఁ బ్రభువు. ఈ యక్షౌహిణి సేన యతనిది. దీనియందు లెక్కలేని రథములు, గుఱ్ఱములు, ఏనుఁగులు, కాల్బంటులు నున్నారు. కావున నితఁడు మిక్కిలి బలశాలి. ఇతని నే నేమి చేయఁగలను?" అని చెప్పఁగా, మాటలందు నేర్పరియయిన కామధేనువు బ్రహ్మతేజస్సుచే దేదీప్యమానుఁడై యుండు బ్రహ్మర్షియగు వసిష్ఠునితో "మహాత్మా, క్షత్రియునకు బల మెక్కడిది? బ్రాహ్మణుఁడే యందఱికంటె బలవత్తరుఁడు. బ్రహ్మబలమే క్షత్రియబలమునకంటె బలవత్తరమైనది. తమయెడ నమితమగు బ్రహ్మబల మున్నది. విశ్వామిత్రుఁడు తమకంటె బలవంతుఁడుగాఁడు. విశ్వామిత్రుఁడు మహాప్రతాపముగలవాఁడయినను తమతపస్సువలనఁగలిగిన బలము నోర్వఁజాలఁడు. తపోబలము పరులకు సైరింపరానిది. ఓమహాత్మా! నన్నుఁ దమ తపోబలమున ననుగ్రహించి, నా కానతి యొసఁగిన నీ దురహంకారియగు విశ్వామిత్రుని గర్వమును, బలమును నాశము చేసెదను." అని చెప్పఁగా, వసిష్ఠమహాముని "కామధేనువా! శత్రుబలమును నాశముచేయఁగల సేనను సృజింపు" మని యానతిచ్చెను. వెంటనే యా కామధేనువు 'హుంబా' యని యఱవఁగనే యా యఱపునుండి యనేకులు పప్లవులనెడు మ్లేచ్ఛులు పుట్టి, విశ్వామిత్రుఁడు చూచుచుండఁగనే, యతని సైన్యమునంతయు నుగ్గునేసిరి. అట్లు పప్లవులచేఁ దన సైన్యమంతయుఁ జంపఁబడుచుండుట చూచి, రథముమీఁదఁ గూర్చుండి కోపముచేఁ విప్పారిన కన్నులతో నానా విధాస్త్రములను బ్రయోగించి యా పప్లవుల నందఱను సంహరించెను.

ఇట్లు తనచే సృష్టింపఁబడిన పప్లవుల నందఱిని విశ్వామిత్రుఁడు సంహరింపఁగాఁ, గామధేను వత్యాగ్రహముతో, మరల యవనజాతిలోఁ జేరిన శకు లనెడి మ్లేచ్ఛులను సృజించెను. ఆ శకు లనెడివారు తళతళమని మెఱయుచుండువారును, విశేషమైన వీర్యము గలవారును, సంపంగిపూల కేసరములంబోలు దేహచ్ఛాయగలవారును, నిడుదలయిన కత్తులను, పట్టసములను దాల్చినవారును, పసిఁడి చాయగల వస్త్రములఁ గట్టుకొన్నవారును నై యొఱియుచున్న యగ్నులువోలె, పుడమి

యంతయు వ్యాపించి, విశ్వామిత్రుని సైన్యము నంతయుఁ గాల్చివేసిరి. అంత ప్రతాపవంతుఁడయిన విశ్వామిత్ర నృపాలుఁడు తన సేనలను సంహరించిన శకులపై మిక్కిలి మండిపడి, దివ్యాస్త్రములఁ బ్రయోగించి వారిని జీకాకు పఱచెను.

## 55-వ సర్గము.

వసిష్ఠ విశ్వామిత్రుల యుద్ధము, విశ్వామిత్రుఁడు తపము సేయఁ బోవుట

ఇట్లు కామధేనువు సృజించిన పహ్లవులును, శకులును విశ్వామిత్రుఁడేయునస్త్రముల సైరింపఁజాలక పరవశులై చీకాకుపడి పరుగిడుచుండఁగా, వసిష్ఠమహాముని కామధేనువునుఁజూచి, 'యోగబలముచే నింకఁ గొందఱిని మ్లేచ్ఛులను బుట్టింపు' మని చెప్పెను.

అట్లు చెప్పఁగాఁ, గామధేనువు 'హుంబా' యని యఱచెను. ఆ యఱుపుతోఁగూడ సూర్యునివలె వెలింగెడి కాంభోజు లనెడివారు పుట్టిరి. దాని పొదుగునుండి శస్త్రములఁ దాల్చినవారైన పహ్లవు లనువారు పుట్టిరి. యోని నుండి యవనులు జన్మించిరి. గుదస్థానమునుండి శకులను వా రుద్భవిల్లిరి. రోమకూపములనుండి మ్లేచ్ఛులు, హారీతులు, కిరాతులుపుట్టిరి. వారందఱు విశ్వామిత్రుని సేనలపైఁబడి యతని రథములను, గుఱ్ఱములను, ఏనుఁగులను, కాలుబలములను ధ్వంసము చేసిరి.

ఇట్లు తనసేనయంతయుఁ గూలిపోవుటను చూచి విశ్వామిత్రుని కుమారులునూర్వురు తపస్విశ్రేష్ఠుఁడయిన వసిష్ఠమహాముని మీఁదికి నాయుధమును గైకొని పరువిడిరి. అటు తనపైకి వచ్చిన యా విశ్వామిత్రనృపాలుని కొడుకుల నందఱిని వసిష్ఠుఁడు హుంకారముచేతనే భస్మముచేసెను. అప్పుడు విశ్వామిత్రుఁడు తన పుత్రు లందఱు చతురంగబలముతోఁగూడ నమ్మహామునియొక్క హుంకారముచే బూడిదయై తన సేన లన్నియు నశించుటఁ జూచి, సిగ్గుపడి, వగపాలయి, యలలులేని సముద్రముచందమునను, కోఱలు పీకిన పామువగిదియు, రాహువుచే మ్రింగఁబడిన సూర్యునిచాడ్పునను వెంటనే తేజోహీనుఁడయ్యెను. మఱియు నావిశ్వామిత్రుఁడు తన కొమరులను సేనను బోఁగొట్టుకొని, ధైర్యము క్రుంగి ఱెక్కలుద్రుంచిన పక్షిపగిదిఁ జలికిలఁబడి, గర్వముఁబాసి, ఉత్సాహము లేనివాఁడై, మిక్కిలి వేదననొందెను. అంత నా విశ్వామి

త్రుఁడు తన కొడుకులలోఁ జావక మిగిలియున్న యొక కుమారునిపై రాజ్యభారముంచి, క్షత్రియధర్మముఁ దప్పక రాజ్యపరిపాలనము సేయుమని చెప్పి, తాను బయలువెడలి కిన్నరగంధర్వ పన్నగాదు లుండెడి హిమవత్పర్వత ప్రదేశమునకుఁ జని యీశ్వరుని యనుగ్రహముఁ బొందఁ గోరి యెక్కువ పూనికతోఁ దపస్సుచేసెను.

అంతఁ గొంతకాలమునకు వృషభధ్వజుఁడగు శంకరుఁడు బలవంతుఁడయిన విశ్వామిత్రునికిఁ బ్రత్యక్షమై, 'మహారాజా! యేల తపముసేయుచున్నాఁడవు? ఏమి నీకోర్కె? నీవు కోరిన వరంబుల నీయ వచ్చితిని నీకేమివరము కావలెనో కోరు' మని యడిగెను. విశేషమైన తపస్సు చేయుచున్న విశ్వామిత్రుఁడు పరమేశ్వరుని పలుకులు విని, యమ్మహాదేవునికి మ్రొక్కి "మహాదేవా, తమరు నాతపమునకు మెచ్చితిరేని, ధనుర్వేదము సాంగోపాంగముగను, ఉపనిషద్రహస్య సహితముగను నా కుపదేశింపవలయు. మఱియు దేవత లధిదేవతలుగాఁగల యస్త్రములన్నియు, నసురదేవతాకములైన యస్త్రము లన్నియు, గంధర్వులు, యక్షులు, రాక్షసు లధిదేవతలుగాఁగల యస్త్రము లన్నియు నాకు స్ఫురించును గాక. దేవదేవా! తమ రనుగ్రహించి నా కీ వరము నీయవలయు"నని శంకరుని బ్రార్థించెను. అంతట నమ్మహాదేవుఁడు విశ్వామిత్రుఁ డడిగిన వరము లొసఁగి యంతర్ధానము నొందెను.

అంత బలవంతుఁడయిన విశ్వామిత్రరాజర్షి మొదటనే రాజని గర్వించియుండియు నిప్పుడు సకలాస్త్రముల లాభముచే మఱింత గర్వించినవాఁడై పర్వకాలములందలి సముద్రునివలె బలిమిచే నుప్పొంగుచు వచ్చి వసిష్ఠమహాముని దనచే హతుఁడయ్యె ననియే తలఁచి వసిష్ఠాశ్రమము సొచ్చి, తాను బడసిన దివ్యాస్త్రముల నన్నింటినిఁ బ్రయోగించెను. అప్పు డా రాజర్షి ప్రయోగించు నస్త్రముల వేఁడిమికి వనమంతయు మంటల మాఁడిపోయెను. అట్లు విశ్వామిత్రరాజర్షి ప్రయోగించు నస్త్రములం జూచి వసిష్ఠమహాముని, "భయపడవలదు. భయపడవలదు. సూర్యుఁ డుదయించి మంచుఁ బోకార్చునట్లే గాధినందనుఁడగు విశ్వామిత్రుని నాశముచేసెదను" అని చెప్పుచున్నను, అతనిమాటలను సరకుగొనక మును లందఱు, వసిష్ఠమునీంద్రుని శిష్యులును మూఁకలు

మూలకుఁ బరుగెత్తిరి. అచ్చటి పక్షులును, మృగములును జడిసి చెల్లాచెదరై పరుగిడినవి. క్షణకాలములో వనమంతయుఁ జవిటినేల వలె శూన్యమాయెను.

అపుడు మంత్రవేత్తలలో శ్రేష్ఠుఁడయిన బ్రహ్మవర్చస్సుగల వసిష్ఠమహాముని విశ్వామిత్రునిగూర్చి రోషసహితముగా నిట్లనియె. "ఓరీ మూఢుఁడా, మేము పెక్కేండ్లుగాఁ బెంచిన తపోవనము బాడు సేసితివి. కావున నీవు పెద్దకాలము జీవింపవు" అని చెప్పి, మిగుల నాగ్రహముతో పొగలేని ప్రళయాగ్నివలెను, రెండవ యమదండమువలెను వెలుఁగుచున్న తన బ్రహ్మదండము నెత్తుకొనెను.

## 56-వ సర్గము.

### బ్రహ్మబలమే బలము

ఇట్లు వసిష్ఠమునీంద్రుఁడు పలుకుచుండ, విశ్వామిత్రుఁడాగ్నేయాస్త్రమును గైకొని యమ్మునీంద్రుని 'నిలు నిలు' మని బెదరించెను. అంత వసిష్ఠమహాముని రెండవ యమదండమో యనఁదగియున్న బ్రహ్మదండమును నెత్తికొని, "ఓరీ! క్షత్రియాధమా, యిదిగో నిలిచితిని. నీబల మేమో చూపుము. ఇప్పుడే నీశస్త్రదర్పము నడఁగించెదను. నీ క్షత్రియబల మెక్కడ? మహత్తరమైన బ్రహ్మబల మెక్కడ? ఓక్షత్రియాధమా! దివ్యమైన నాబ్రహ్మబలమును జూడుము." అని చెప్పునప్పుడే విశ్వామిత్రుఁ డతనిపై నాగ్నేయాస్త్రమును బ్రయోగించెను. అది బ్రహ్మదండమును సమీపించిన వెంటనే, యగ్నిని నీరు చల్లార్చునట్లు, బ్రహ్మదండము దానిని జల్లార్చెను. దానిని గని విశ్వామిత్రుఁడు మిక్కిలి వ్యసనపడి తా నీశ్వరునివలనఁ బడసిన వారుణము, రౌద్రము, ఐంద్రము, పాశుపతము, ఐషీకము, మానవము, మోహనము, గాంధర్వము, స్వాపనము, జృంభణము, మాదనము, సంతాపనము, విలాపనము, శోషణము, దారణము, జయింప నలవికాని వజ్రము, బ్రహ్మపాశము, కాలపాశము, వరుణపాశము, శివునకి మిక్కిలి ప్రియమగు పినాకము, శుష్కాశని, ఆర్ద్రాశని, దండము, పైశాచము, క్రౌంచము, ధర్మచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము, వాయవ్యము, మథనము, హయగ్రీవము, శక్తిద్వయము, కంకాళము, ముసలము, విద్యాధరాధి

దేవతాకమయిన మహాస్త్రము, మిక్కిలి దారుణమయిన కాలము, ఘోరమైన త్రిశూలము, కాపాలము, కంకణము మొదలగు నస్త్రములనన్నింటిని నొకటి వెంబడి మఱియొకటిగా నాయామంత్రములను జపించి ప్రయోగించెను. విశ్వామిత్రుఁడు ప్రయోగించిన యస్త్రములన్నియు వేగముగ వచ్చి యాబ్రహ్మదండమునకుఁ దాఁకి, యేమియుఁ జేయఁజాలకపోవుచుండినవి. ఆ వసిష్ఠమహాముని యా యస్త్రముల నన్నింటిని దన బ్రహ్మదండముచే మ్రింగుచుండెను. విశ్వామిత్రుఁడు తాను బ్రయోగించిన యస్త్రము లన్నియు వసిష్ఠుని నేమియుఁ జేయక, యా బ్రహ్మదండమునకుఁ దగిలి నశించుచుండ, మిగుల నలిగినవాఁడై, బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. అటు విశ్వామిత్రునిచేఁ బ్రయోగింపఁబడినదై వేగనేతెంచుచుండు బ్రహ్మాస్త్రమును జూచి, యగ్ని మొదలగు దేవతలు, దేవర్షులు, గంధర్వులు పన్నగులు మొదలగువారు తత్తఱపడిరి. ఆబ్రహ్మాస్త్రముయొక్క వేఁడిమికి మూఁడు లోకములవారును మలమల మాఁడిరి. మహా భయంకరమయిన రూపముతో వచ్చుచున్న యా బ్రహ్మాస్త్రమును వసిష్ఠుఁడు బ్రహ్మోపాసనమువలన వృద్ధినొందిన బ్రహ్మదండముయొక్క సాయముచే మ్రింగనారంభించెను. అటు బ్రహ్మాస్త్రమును మ్రింగుచున్న యా వసిష్ఠమహామునియొక్క రూపము ముల్లోకములవారికిని మైమఱపు గలిగించునంత భయంకరముగ నుండెను. అగ్నిహోత్రుఁడయిన వసిష్ఠ మునీంద్రుని రోమరంధ్రములనుండి, పొగతోఁగూడిన మంటలుగల యగ్నిహోత్రునినుండి వెడలునటులు మిణుఁగురులు వెడలినవి. ఆ వసిష్ఠ మునీంద్రుఁడు చేతఁ బట్టియున్న బ్రహ్మదండము పొగలేక మండుచుండ ప్రళయకాలాగ్నియో యనునటులును, రెండవ యమదండమో యను నటులును విశేషముగా మండెను.

అపుడు మునులందఱు మంత్రవేత్తలలో శ్రేష్ఠుఁడగు వసిష్ఠునిఁ జూచి, "ఓ బ్రహ్మర్షిసత్తమా? నీ బల మమోఘమయినది. నీ తేజస్సు నెవ్వరును సైరింపఁజాలరు. ఈ తేజస్సును నీ లోపలనే యడఁగించుకొనుము. విశ్వామిత్రుఁ డెక్కువ తపమునేసి పడసిన యస్త్రములన్నియు నీ బ్రహ్మదండమునకు లోఁబడినవి. ఓ తాపసవర్యుఁడా, శాంతింపుము. జనులందఱు నీ కోపమునకు వెఱచియున్నారు. వారియందఱి దిగులు

దీర్పుము" అని ప్రార్థనసేయఁగా, గొప్పతాపసుఁ డగు వసిష్ఠుఁడు తన కోపమును శాంతింపఁజేసెను.

విశ్వామిత్రుఁడు తాను గొప్ప తపస్సుచేసి సంపాదించిన యస్త్రములన్నియు విఫలములయిపోవుటకు మిక్కిలి వగచి నిట్టూర్పు విడిచి, "ఛీ! క్షత్త్రియబల మెందుకు? బ్రహ్మ తేజోబలమే బలము. వసిష్ఠుఁ డొక్క బ్రహ్మదండముతో నాసర్వాస్త్రములను నాశము చేసెను. ఈతారతమ్యము తెలిసెను. ఇఁక నేను యింద్రియములను మనస్సును శుద్ధపఱచికొని, బ్రాహ్మణ్యసంపాదకమైన గొప్ప తపస్సు చేయఁ బూనెదను" అని మనస్సునఁ దలఁచెను.

## 57 - వ స ర్గ ము.

విశ్వామిత్రుఁడు తపస్సుచేయుట, త్రిశంకువుయొక్క సంభాషణము

రాఘవా! అంత విశ్వామిత్రుఁడు తన యవమానమును దలఁచి తలఁచి, మనంబునఁ గలవరపడి, పలుమాఱు గొప్ప నిట్టూర్పులు విడిచి, మహాత్ముఁడైన వసిష్ఠమునీంద్రునితోఁ బగపట్టినవాఁడై, యామునీంద్రుని వలెనే తానును బ్రహ్మతేజస్సును బడయఁగోరి, భార్యాసమేతుఁడై, దక్షిణదిశల కేఁగి, ఘోరమయిన తపస్సు చేసెను. అట్లా విశ్వామిత్రుఁడు తపస్సు చేయుచుండఁగా, నతనికి హావిష్యందుఁడు, మధుష్యందుఁడు, దృఢనేత్రుఁడు, మహారథుఁడు నను పేళ్లు గలవారును, ఎల్లప్పుడు సత్యము పలుకుట, ధర్మమార్గము దప్పకుండుట యను రెండుగుణములు విడువనివారునైన నలువురు కుమారులు పుట్టిరి.

ఇట్లు విశ్వామిత్రుఁ డా దక్షిణదిశయందు వేయి యేండ్లు తపస్సు చేసి నిండినంతనే సకల లోకములకుఁ దాతయైన బ్రహ్మదేవుఁడు తపస్సే ధనముగా నెంచియుండుట విశ్వామిత్రునికి బ్రత్యక్షమై తిన్నని పలుకులతో నింపుగా నిట్లనియె:—'ఓ కుశికనందనా! నీవు నీ తపోబలముచే రాజర్షు లుండెడి లోకములను స్వాధీనపఱచుకొంటివి గాన నిఁకమీఁద నిన్ను రాజర్షి యని మే మెంచెదము' అని విశ్వామిత్రునితోఁ జెప్పి, లోకములకెల్ల నధీశ్వరుఁడగు బ్రహ్మదేవుఁడు దేవతలతోడ స్వర్గమునకుఁ బోయి, యచ్చట దేవతలను విడిచి, తాను బ్రహ్మలోకంబునకుఁ బోయి చేరెను.

విశ్వామిత్రుఁడును బ్రహ్మవరంబును విని, సిగ్గుచేఁ గొంచెము తల వంచి, నే నింతతపస్సుచేసినను, బ్రహ్మర్షి యనుపేరు రాకపోయెఁగదా యను పట్టరానివ్యసన మొకప్రక్కను, నే నింత తపస్సుచేసినను, దానిని గమనింపక బ్రహ్మదేవుఁడు బ్రహ్మర్షియని వరం బొసఁగక, రాజర్షి యని వరంబొసఁగెఁ గదా యను కోపం బొక ప్రక్కను బాధింపుచుండ నిట్లని చింతించె. "నేను విశేషమయిన తపస్సును జేసితిని. అయినను, దేవతలును, ఋషులును నన్ను 'రాజర్షి' యని పిలుచుచున్నారు కాని బ్రహ్మర్షి యని పిలువరైరి. కాన నేను జేసిన తపస్సునకు సరియైన ఫలము గలుగలేదని తలఁచెదను" అని మనస్సునందు నిశ్చయించికొని, యింతకుముందే యెక్కువ తపస్సుచేసినవాఁడయినను, మఱింత ప్రయత్నముతో మఱలఁ దపముచేయఁ దొడఁగెను.

ఆకాలమునసే యిక్ష్వాకువంశమునకు వృద్ధికరుఁడయిన త్రిశంకు వనెడి యొకరా జుండెను. అతఁ డెల్లప్పుడు సత్యము పలుకువాఁడు. ఇంద్రియములను లోఁబఱచుకొన్నవాఁడు. ఆ త్రిశంకు వొక సమయమున 'తాను యాగముచేసి, బొందితోడ స్వర్గమునకుఁ బోవలయు' నని తలంపుగలవాఁడయ్యెను. అంత నా త్రిశంకువు తన కుల గురువగు మహాత్ముఁడయిన వసిష్ఠుని కడకేఁగి, యతనితోఁ దన కోరికను దెలుపఁగా, నా మునీంద్రుఁడు "బొందితోడ స్వర్గమున కేఁగుట యసాధ్యము" అని చెప్పెను. ఇట్లు వసిష్ఠుఁడు తన కోరికను నిరాకరించుటచే నతని పుత్రులైనను ఆకోర్కెను నెఱవేర్పఁగలరేమో యని తలఁచి, వారినిమిత్తమై దక్షిణదిశ కేఁగెను. ఇట్లుపోయిపోయి, వసిష్ఠమహామునిపుత్రు లెచ్చటఁ దపంబుసేయుచున్నారో, ఆచోటు చేరి, యచ్చటఁ గీర్తి వడసినవారును, దీర్ఘకాలమునుండి తపస్సు చేయుచుండుటచేఁ గలిగినట్టి తేజస్సుచే మిక్కిలి వెలుఁగుచుండువారును నైన వసిష్ఠపుత్రులను నూఱుగురిని జూచెను. అంత నాతఁడు గురుపుత్రుల నందఱిని హెచ్చరించుకొని, వరుసప్రకారము వారికి మ్రొక్కి సిగ్గుతోఁ గొంచెము తలవాల్చి, చేతులు జోడించి తనయభిప్రాయము నమ్మహాత్ములగు వసిష్ఠపుత్రుల కిట్లు తెలుపఁ దొడఁగెను. "ఓ మునీంద్రులారా! నేను శరణుఁగోరి వచ్చితిని. మీరారు శరణుఁజొచ్చినవారిని గాపాడువారలు గదా. మహాత్ముఁడయిన

మీ తండ్రిగారు నన్నుఁ దిరస్కరించిరి. మీరు నన్నుఁ గావవలయును. నాకోర్కె నెఱవేర్పవలయును. నేనొక్క మహాయాగము చేయఁదలచితిని. గురు పుత్రులరయిన మిమ్ములందఱ నమస్కరించి వేఁడెద. తపస్సునందే కాలముపుచ్చు మీకు నందఱకేకిని సాష్టాంగముగాఁ బ్రణమిల్లి యొక్కకోరికఁ గోరెదను. మీరు మఱింత మెలఁకువ గలిగి, నా యాగమును నెఱవేర్చి నేను శరీరముతోడ స్వర్గమునకు పోవులాగున మీరు చేయవలయును. గురువగు వసిష్ఠమహాముని యీ కార్య మసాధ్యమని నిరాకరించెను. యాగము చేయించుటకు గురుపుత్రులగు మీరుతప్ప మఱొకగతి నాకులేదు. ఇక్ష్వాకు వంశస్థుల కందఱకి పురోహితుఁడేగదా పరమగతి! వివేకులయిన పురోహితులే గదా యెల్లప్పుడు రాజులను దరింపఁజేయుదురు. కావున మీ తండ్రి తిరస్కరించినతర్వాత నిఁక మీ రందఱేగదా మాకు దైవతములు" అని త్రిశంకువు వసిష్ఠమునీంద్రుని పుత్రులతోఁ జెప్పెను.

## 59-వ సర్గము.

### వసిష్ఠుని పుత్రులు త్రిశంకువును శపించుట

రామా! ఋషిపుత్రులు నూర్వురు త్రిశంకువు కోపముతోఁ జెప్పిన మాటను విన్నవారలై, యతనితో నిట్లనిరి.

ఓ దుర్బుద్ధీ, సత్యముఁ జెప్పునట్టి మాతండ్రి నిన్నుఁ దిరస్కరించి పొమ్మనెను గదా. అంతటితో నూరకుండక, యాయనమాటమీఱి యేల మఱొక్కకొమ్మ నాశ్రయించితివి. ఇక్ష్వాకువంశమువారికి పురోహితుఁడే గదా పరమగతి. అయినచో యథార్థవాదియైన గురుని వాక్యమును దాఁటవచ్చునా? సకల విషయముల నెఱింగిన వసిష్ఠమహర్షి శరీరముతోఁగూడ స్వర్గమును బొందించుట కష్టమని చెప్పెనుగదా. అట్టి నీయాగము మేము మాత్ర మెట్లు చేయింపఁగలము? ఓ నరేంద్రా, నీవు మూర్ఖుఁడవు. మరల నీ పురమున కరుగుము. ఓ నృపాలా! పూజ్యుఁడైన యీ వసిష్ఠమునియే ముల్లోకంబులందును యాగంబులు చేయింపఁగలవాఁడు. అతఁడుతప్ప మఱొక్కఁ డంతటివాఁడు లేఁడు. అంతియ కాక, యాయన కాదనినదానిని మేము జరిపించి, యీ వసిష్ఠమునీంద్రుని

కెట్లవమానము గలిగింప నోపుదుము? అది మావలన నయ్యెడు పని కాదు. పోయిరమ్ము" అనిచెప్పిరి.

వసిష్ఠపుత్రు లాగ్రహముతోడఁ జెప్పిన పలుకులు విని, త్రిశంకువు మఱల "అయ్యలారా, మీ తండ్రి నా ప్రార్థన నంగీకరింపఁడయ్యె. గురుపుత్రులయిన మీరును మావలనఁ గాదని చెప్పితిరి. ఇఁక నాగతి యేమి? నేను మఱియొక్క గతి వెదకుకొనెదను. ఓ తపోధనులారా, మీకు మేలయ్యెడుఁగాక. నేఁబోయి వచ్చెదను" అని వసిష్ఠమునీంద్రుని పుత్రులతోఁ జెప్పి బయలుదేఱఁగా, ఋషిపుత్రులా త్రిశంకువు మనసున నొక్కటి యుంచుకొని పై కీలాగు జెప్పినమాటను విని మిక్కిలి యలిగినవారై, "ఓ త్రిశంకూ, నీవు మమ్ము దూషించితివి గనుక చండాలుఁడ వగుదు" వని శపించి, తమ యాశ్రమములోఁ బ్రవేశించిరి.

అంత నారేయి గడచి తెల్లవాఱునప్పటికి, త్రిశంకువు చండాలత్వము నొంది, బిరుసైన నల్లని రూపము గలిగి, నల్లని బట్టదాల్చి, జుట్టు విరియఁబోసికొని, కాటిపూలను దురిమి, కాటి గంధమును బూసికొన్నవాఁడై, యినుపసొమ్ములు ధరించిన వాఁడయ్యెను.

అట్లు చండాలరూపంబుఁ దాల్చిన త్రిశంకువును జూచి మంత్రులందఱును, వానివెంబడిఁ దిరుగు పురజనులును నానా దిశలకుఁ బరుగెత్తిరి. త్రిశంకు వొక్కఁడే యెక్కువ ధైర్యముఁ దెచ్చుకొని రేయింబవళ్లు ఆలోచనచేసి, వసిష్ఠమహామునికి విశ్వామిత్రుఁడు విరోధి గనుక, నతనిఁ బ్రార్థించినఁ దన కోరిక నెఱవేఱఁగలదని తలఁచి యాతనికడకుఁ బోయెను.

తన కోరిక నొందక, మిక్కిలి వికారమయిన చండాలరూపమును దాల్చి తన కడకేతెంచిన త్రిశంకువును జూచి, భూతములం దెక్కువ దయయు, విశేషకాంతియుఁగల విశ్వామిత్రుఁ డతనితో నిట్లనెను. "మహాబలవంతుఁడవగు ఓ రాజపుత్రుఁడా, నీకు శుభమగుఁ గాక! నీ విచ్చటికి వచ్చిన పనియేమి? శూరుఁడవగు అయోధ్యాధిపతీ, నీవు శాపమువలనఁ జండాలుఁడ వైతివి. ఎవరు నీకింత దారుణంబైన శాపం బొసగిరి." అని యడిగెను.

చండాలత్వము నొందిన త్రిశంకువు, తాను మాటలలో నేర్పరి గనుక, నా విశ్వామిత్రుని పలుకులు విని, దోసిలియొగ్గి మాటల యభిప్రాయముల నెఱింగెడి విశ్వామిత్రునితో నిట్లనియెను.

"ఓ విశ్వామిత్రుఁడా, నేను శరీరముతోడ స్వర్గమునకుఁ బోఁదలఁచి, యట్టియాగంబు నొక్కటి చేయింపు మని నాకులగురువగు వసిష్ఠమునీంద్రుని, ఆతని పుత్రులను బతిమాలితిని. కాని వారు నాప్రార్థన నెఱవేర్పక పోవుటేకాక నాకీ చండాలత్వమనెడి యొక జాతిభ్రంశరూపమగు దోషమును గలుగంజేసిరి. ఓసౌమ్యుఁడా! నేను నాకు శరీరముతోఁగూడ స్వర్గమునకుఁ బోవలయు నని కోరిక. ఆ కోరిక నెఱవేఱుటకై నూఱు యజ్ఞములు చేసితిని. అయినను నాకోరిక నెఱవేఱదయ్యె. ఓ సౌమ్యా, నాకెట్టి యిడుములు వచ్చినను, నింతవఱకు నసత్యము చెప్పలేదు. ఇఁకమీఁద నే నెప్పటికినిఁ జెప్పను. నాక్షత్రధర్మము సాక్షిగాఁ జెప్పుచున్నాను. ఇపుడు నీముందర నబద్ధ మాడుదునా? నేను నానావిధములైన యజ్ఞములను జేసితిని. ప్రజలను ధర్మముతోఁ బాలించితిని. మహాత్ములగు గురువులను నా మంచినడవడికతో సంతోష పెట్టితిని. అయినను ధర్మమువిషయములోఁ బ్రయత్నించి యజ్ఞము చేయఁదలఁచిన నాయెడ గురువులు సంతోషింపరైరి. ఈ విషయములో దైవమే (అనఁగాఁ బ్రారబ్ధము) బలవత్తర మైనదిగాని, పౌరుషము (అనఁగా నిప్పుడాచరించిన ధర్మానుష్ఠానము) నిరర్థకమే యని తలఁచెదను. సర్వము దైవము (అదృష్టము) చేతనే యన్నియు నగుచున్నవి. అన్నిటికిని దైవమే శరణము. మహాత్మా! చేసిన కర్మమంతయు దైవోపహతమై పోవఁ బరమార్తుఁడనై నీయనుగ్రహమును గోరుచున్న నన్ననుగ్రహింపుము. నీకు శుభ మగుగాక! నా కింకొక దిక్కులేదు. నీవే నాకు రక్షకుఁడవు. పురుషప్రయత్నముచేత నీవు నా దురదృష్టమును నివారింపఁదగుదువు." అని చెప్పెను.

## 59-వ సర్గము.

విశ్వామిత్రుఁడు వసిష్ఠమహాముని పుత్రులను శపించుట

విశ్వామిత్రుఁడు త్రిశంకువు చెప్పిన మాటను విని, మిక్కిలి జాలి నొంది, సాక్షాత్తుగా, జండాలజాతియందుఁ బుట్టినవానివలె నుండు త్రిశంకువుతోఁ దిన్ననైన యింపు మాటల నిట్లనియె.

"ఓ యిక్ష్వాకునందనా! నీవు ధర్మము విపత్తయినను దప్పనివాఁడవని నే నెఱుఁగుదు. నరశ్రేష్ఠా, నీవు వెఱవకుము. నీకు నే నాదరవు. నేను నీచే యాగంబుఁ జేయించి, నిన్ను సశరీరముగా స్వర్గమున కేఁగునట్లు చేసెద. ఓ పుడమిఱేఁడా! పరుల కుపకారము సేయు స్వభావము గలవారును, యజ్ఞమునకుఁ దోడ్పడువారునైన మహర్షుల నందఱిని నే నిదిగో రప్పించెదను. వారి సాయముచే నీచేత యాగముచేయించి, నిన్ను స్వర్గము నొందించెదను. గురుశాపమువలన నీకు సంప్రాప్తమయిన యీ చండాల రూపముతోనే స్వర్గమును బొందున ట్లొనరించెదను. నరాధిపా, నీవు కుశికవంశమునఁ బుట్టిన విశ్వామిత్రుని నెప్పుడు శరణుఁ జొచ్చితివో యప్పుడే స్వర్గము నీచేతిలో నున్నట్లు తలంపుము" అని త్రిశంకువుతోఁ జెప్పి, పుణ్యకార్యముల బాగుగాఁ జేయువారును, యెక్కువ తెలివిగలవారునైన తనకొడుకులను, బిలిచి, యజ్ఞమునకుఁ గావలసిన సామగ్రుల నన్నింటిని దెప్పింపు" డని యానతి యొసఁగి మఱియు, శిష్యుల నందఱను పిలిచి, "నాయనలారా! నేను బిలుచుచున్నానని, ఋషుల నందఱిని, వారిశిష్యులను, వారి స్నేహితులను, విశేషముగా ననుభవముగల ఋత్విజులను యజ్ఞమునకుఁ బిలువుఁడు. మీరు పిల్చినపు డెవ్వఁడైన నామాటను దిరస్కరించి, యేదియైనఁ జెప్పునేని, ఆ మాటలను మఱువక నాతోవచ్చి చెప్పుఁడు" అని యుత్తరవుసేసెను. అంత శిష్యులు విశ్వామిత్రుని యాజ్ఞను గొని, నాలుగు దిక్కులకుఁ బోయి, మహర్షుల నందఱని బిలిచిరి. వెంటనే బ్రహ్మజ్ఞాను లందఱు సకల దేశములనుండి పయనమై వచ్చిరి. ఆశిష్యులందఱు మఱలివచ్చి, తపఃప్రభావముచే వెలుఁగుచున్న యావిశ్వామిత్ర మహామునితో బ్రహ్మవేత్తలగు ఋషులందఱు చెప్పినమాటను విన్నవించి మఱల "ఓమునీంద్రా, తమ మాట విన్న మాత్రాననే మహోదయుఁడు దక్కఁ దక్కిన ఋషు లందఱు సకల దేశములలోనివారును వచ్చిరి. ఓ మునిశ్రేష్ఠా, వసిష్ఠుని కుమారులు నూఱువురును కోపమునఁ దడఁబడుచున్న మాటలతోఁ జెప్పిన సంగతిని వినిపించెదము, ఆలకింపుము. మేము పోయి, వసిష్ఠ పుత్రులను బిలిచినంతనే, వారు మమ్ముఁ జూచి, "యేమిరా! విశ్వామిత్రులు యాజకులా! త్రిశంకువు యాగము చేయువాఁడా!

యాగము చేయించువాఁడు క్షత్రియుఁడు. యాగము చేయువాఁడు చండాలుఁడు. అన్నియు బాగుగనే సమకూడినవి! ఈ యాగమున నెట్లు దేవతలు ఋషులు తమ హవిర్భాగములఁ గైకొందురో! విశ్వామిత్రునికి లోఁబడి యాయనచేఁ గాపాడఁబడునట్టి బ్రాహ్మణోత్తములు చండాలుని యన్నము భుజించి యెట్లు స్వర్గము నొందఁగలరో! చూడ వలెను." అని కన్నులెఱ్ఱచేసి మాతో నిష్ఠురపుమాటలాడిరి." అని చెప్పిరి.

మునిశ్రేష్ఠుఁడయిన విశ్వామిత్రుఁడా వసిష్ఠపుత్రులు చెప్పిన మాటలరీతిని విని, కోపముచేఁ గన్నులెఱ్ఱచేసి, నిప్పులు రాల్చుచు, రోషముతోడ నిట్లని శపించెను. ఉగ్రమయిన తపంబు సేయుచు, నిర్దోషినై యుండు నన్నెవరు దూషింపుచున్నారో, ఆ దుష్టస్వభావముగలవారందఱు భస్మమై పోవుదురు. నిస్సంశయము. ఆ వసిష్ఠపుత్రులను యముఁడు కాలపాశముతో నిప్పుడు తన మందిరమున కీడ్చికొని పోవుచున్నాఁడు. వీ రిఁక నేడునూఱుల జన్మములవఱకు శవములఁ దినువారగుదురు గాక! మఱియు వారు ముష్టికు లనెడి హీనజాతులందుఁ బుట్టినవారలై, దయమాలి, కుక్కలమాంసము ప్రధానమైన యాహారముగాఁ దినుచు లోకవిరుద్ధములైన నడతలును, రోఁతపుట్టించు రూపములును గలిగి యీ లోకములందుఁ దిరుగుచుందురు గాక! మహోదయుఁ డన్ననో, దూషణ చేయఁదగని నన్ను దూషించెను గాన నతఁడు సకల లోకంబులందు నమర్యాదనొంది, బోయకులమునఁ బుట్టి, దయమాలి, యెల్లప్పుడు జంతువుల ప్రాణములఁ దీయుటయందే తలంపుపెట్టి, నాకోపమునకు ఫలముగాఁ జిరకాలము నీచవృత్తిచే జీవించుచుండునుగాక!" అని గొప్పతాపసుఁడైన విశ్వామిత్రుఁడు ఋషులనడుమ నీలాగునఁ జెప్పి యంతటితో విరమించెను.

## 60-వ సర్గము.

**విశ్వామిత్రుఁడు త్రిశంకువును స్వర్గమున కెక్కించుట**

విశేష తేజస్సుగల విశ్వామిత్రుఁడు మహోదయుని, వసిష్ఠపుత్రుల నందఱిని దన తపోమహిమచే నధోగతిం బొందించి, ఋషులనడుమ నిలిచి "ఓ మునీంద్రులారా! ఇతఁ డిక్ష్వాకువంశస్థుఁడు. ఇతని

పేరు త్రిశంకు వనిప్రసిద్ధమైనది. ఇతఁడు ధర్మముఁ దప్పనివాఁడును; దాతయు. ఇతఁడు శరీరముతోడనే స్వర్గలోకము నొందఁగోరి నన్ను శరణు చొచ్చినవాఁడు. ఎట్లితఁడు శరీరముతోడనే స్వర్గమున కేఁగునో యట్లు మీరు నాతోడ నుండి యజ్ఞము నడిపింపవలయును" అని చెప్పెను.

అప్పుడు ధర్మజ్ఞులగు మహర్షు లందఱు విశ్వామిత్రుని మాటలు విని యందఱు గలసి, ధర్మార్థములకుఁ గొఱఁతపడకుండునట్లు తమలోఁ దా మిట్లనుకొనిరి. "ఓ మునులారా! ఈ కుశికపుత్త్రుఁడయిన విశ్వామిత్రుఁ డమితకోపిష్ఠుఁడు. ఇతనిమాట కడ్డముగ నేదేనిఁ జెప్పితిమేని, యితఁడు తప్పక మనలను శపించును. కావున నితఁ డేది చెప్పిన దాని నెల్ల సరి యని యొప్పుకొని యతఁడు చెప్పినరీతిం బోవలసినది. ఆవిషయమున సంశయపడరాదు. అతఁడు నిప్పుతో సాటియైనవాఁడు. కొంచెము తప్పి యతని కాగ్రహంబుఁ గలిగించితిమేని, మనల నితఁడు గాల్చివేయును. కావున నీ త్రిశంకువు విశ్వామిత్రుని తపస్సుయొక్క బలిమివలన శరీరము తోడనే స్వర్గమును బొందుటకుఁ దగిన యజ్ఞంబు నతఁడే నడిపించును. మనము కూడ నుండి యాయన చెప్పినపనులు చేయుచుఁ జూచుచుంద మని వారు తమలోఁ దా మిట్లనుకొని, విశ్వామిత్రుఁడు యాగము చేయించుచుండఁ బైపనులు చేయుచుండిరి. మంత్రవేత్తలగు ఋత్విక్కు లందఱు వరుస దప్పక యన్నికర్మలను గల్పమందుఁ జెప్పఁబడినతీరున విధిఁ దప్పక చేయుచుండిరి.

అంతఁ జాలసేపటికి తపస్వియయిన విశ్వామిత్రుఁడు యజ్ఞము నందు హవిర్భాగములను గొనిపోవుటకై, దేవతల నందఱిని నావాహనముచేసెను. అట్లు విశ్వామిత్రుఁడు మంత్రములచేఁ బిలిచినను దేవతలు రానందులకుఁ జింతించి, స్రువము నెత్తిపట్టుకొని దేవతలు హవిర్భాగములు దీసికొన రారైరి గదా యని మఱింత యలిగినవాఁడై, త్రిశంకువుం జూచి యిట్లనెను.

"నరేంద్రా! నేను శ్రమపడి సంపాదించిన తపశ్శక్తియున్నది. ఇదిగో ని న్నిప్పుడే నా తపోమహిమచే స్వర్గము నొందించెదను; జూడుము. ఇతరుల కెవ్వరికిని బొంద శక్యముగాని స్వర్గమును నీ వీశరీర

ముతోఁ బొందుము. నేను గష్టపడి సంపాదించిన తపఃఫల మే కొంచెమేని గలదేని దానితో నీవు సశరీరుఁడవై స్వర్గమునకుఁ బోయి చేరుము” అని విశ్వామిత్రుఁడు చెప్పినంతనే త్రిశంకువు శరీరముతోఁగూడ నా మును లందఱు చూచుచుండ స్వర్గమునకేఁగెను. త్రిశంకువు స్వర్గలోకమునకుఁ బోయి చేరినతోడనే దేవేంద్రుఁడు సకల దేవతలతోఁగూడి వచ్చి, యా త్రిశంకువుతో నిట్లనియెను :

“ఓ త్రిశంకూ! నీవు మఱలిపొమ్ము. నీకు స్వర్గమునందు తావులేదు. మూఢుఁడా, నీవు గురునిశాపంబువలనఁ బరిశుద్ధుఁడవు గావు. కావునఁ దలక్రిందై, నీవు భూలోకంబునఁ బడుదువుగాక” యని యచ్చటినుండి యింద్రుఁడు త్రిశంకువును ద్రోసెను. ఇట్లు త్రోయఁబడి క్రిందికి వచ్చుచు వెక్కి వెక్కి యేడ్చుచు ‘మహాత్మా నన్నుఁ గాపాడుము’ అని తపస్సే ధనముగాఁగల యా విశ్వామిత్రునిగూర్చి యతఁ డఱచెను. అట్లఱచు చుండు త్రిశంకువుయొక్క ఆక్రోశమును విని, యాపరాని కోపముగల వాఁడై విశ్వామిత్రుఁడు త్రిశంకువుం గూర్చి, ‘నిలు, నిలు’ మనిచెప్పి ఋషుల మధ్యమున రెండవబ్రహ్మదేవుఁడువలె వెలుఁగుచు దక్షిణదిశను ప్రత్యేకముగా సప్తర్షులను సృజించి, కోపముచే నొడలు దెలియనివాఁడై దక్షిణ దిక్కునఁ గ్రొత్త నక్షత్రములను సృజించెను. ఇట్లమ్మునీంద్రుఁడు క్రొత్త నక్షత్రములను సృజించి, యింక నెక్కువ కోపముఁ దాల్చి, “నేను మఱొక్క యింద్రుని సృజించెదను. లేదేని, నేను సృజించు లోకంబున కింద్రుఁడే యక్కఱలేనట్లు చేసెదను” అని దేవతలను గూడ సృజించుట కారంభించెను.

అప్పుడు దేవతలు, అసురులు, ఋషులు మిక్కిలి వెఱఁగుపడిన వారలై, మహాత్ముఁడగు విశ్వామిత్రుని కడకు వచ్చి, యూరడించుచు నిట్లనిరి. “తపస్సే ధనముగాఁగల యో మునీంద్రా! యీ త్రిశంకువు గురుశాపంబువలన జాతిభ్రష్టుఁడై యున్నాఁడు. శరీరముతోఁగూడ స్వర్గము నొందుటకుఁ దగనే తగఁడు.” అని దేవతలు చెప్పఁగా, మునీంద్రుఁ డా దేవతల మాటలను విని, వారితో మఱింత గొంతెత్తి యిట్లనియె. “ఓ వేల్పులారా! యీ త్రిశంకువును శరీరముతోడ స్వర్గము నొందించెద నని చెప్పితిని. అది యిప్పుడు తప్పించుట నా కసాధ్యము.

కావున నీభూపాలునికి శరీరముతోడ శాశ్వతస్వర్గము గలుగుఁగాక. ఈ లోకంబు లెంతవఱకుండునో, అంతవఱకు నేను సృజించిన నక్షత్రము లాకసంబున వెలుఁగుచుండును గాక. ఈ రెండింటిని మీ రనుగ్రహించితిరేని, నేను దేవతల సృజింపనున్న యీ కార్యమును మానుదు” నని మునీంద్రుఁడు దేవతలతోఁ జెప్పెను.

దేవతలందఱు విశ్వామిత్ర మునీంద్రుని పలుకులు విని “ఓ మునీంద్రా! యట్లె కానిమ్ము. నీకు మేలగు. నీచే సృజింపఁబడిన నక్షత్రములన్నియు ననాదిజ్యోతిశ్చక్రమునకు వెలుపట నుండును గాక. ఈ త్రిశంకువుగూడఁ దలక్రిందై యీ నక్షత్రముల నడుమ దేవతలతో సమానుఁడుగ వెలుఁగుచుండునుగాక. తన కోరిక నొందినవాఁడును, కీర్తిగలవాఁడును నైన యీ త్రిశంకువును స్వర్గలోకమున నున్నవానిం బోలె నా సకలనక్షత్రములు వెంబడించి పోవుచుండును గాక!” అని మునీంద్రునితోఁ జెప్పిరి.

అంత ధర్మాత్ముఁడగు విశ్వామిత్రుఁడు సకల దేవతలును, ఋషులును గొనియాడుచుండ, మీరు చెప్పినట్లు ‘నేను నా సృష్టిని జాలించెద’ నని తన సృష్టిని నిల్పెను. ఓ శ్రీరామా, దేవతలును, తపోధనులగు మహర్షులును యజ్ఞము పూర్తికాఁగానే, వచ్చినట్లు వెడలిపోయిరి.

## 61-వ సర్గము.

### ఋచీకుఁడు శునశ్శేఫుని విక్రయించుట

త్రిశంకువునిమిత్తము తాను నడపించిన యాగమునకు వచ్చిన ఋషు లందఱు తమ నివాసములకుఁ జనినపిమ్మట, విశ్వామిత్రుఁ డయ్యరణ్యమున వసించుచున్న ఋషుల నందఱిని జూచి, “మన మీ దక్షిణదిక్కునఁ దపంబు సేయ వచ్చియు, మన తపస్సున కెన్నియో విఘ్నములు చేకూరినవి. కాఁబట్టి మనము మఱియొక్క దిక్కునకుఁ బోయి, తపం బొనరించెదము. ఓ మహాత్ములారా! పడమటిదిక్కునఁ బుష్కర మని ప్రసిద్ధికెక్కిన విశాలమైన తపోవన మొకటి గలదు. అది యన్ని తపోవనములలోను నుత్తమమైనది. మిగుల సొంపయినది. మన మచ్చటికిఁ బోయి, యేలాటి విఘ్నములేక, మన తపస్సులను నడపుదము” అని చెప్పెను. ఇట్లు మునులతోఁ జెప్పి, వారిని గూడఁ దీసికొని

యా పుష్కర మను తపోవనమును జేరి, యచ్చట దుంపలను, పండ్లను భుజించుచు నమ్మునీంద్రుఁడు తీవ్రమగు తపము సేయుచుండెను.

ఈ సమయముననే, అయోధ్యాపురిం బాలించు నంబరీషుఁడని కీర్తివహించిన యొక చక్రవర్తి యొక గొప్ప యజ్ఞంబు చేయఁదలఁచెను ఆతఁడు యాగమునకై యుంచిన పశువును దేవేంద్రుఁ డపహరించుకొని పోయెను. అపుడు పురోహితుఁడు రాజును జూచి, "ఓ మహారాజా! యాగపశు వపహరింపఁబడినది. అది నీ యశ్రద్ధచేతనే జరిగినది. ఏ రాజు యాగపశువును రక్షింపఁజాలక పోఁగొట్టుకొనుచున్నాఁడో, ఆరాజా దోషముచే నాశము నొందుచున్నాఁడు. కావున పోఁగొట్టుకొనిన పశువునైనను మరల వెదకి తేవలెను; లేదేని, దానికి బదులుగా నొక మనుష్యునిఁ బశువుగాఁజేసి, వానిని వధించి యాగమును బూర్తిచేయవలెను. ఇదియే దానికిఁ బ్రాయశ్చిత్తము. కావున మఱల యాగమును సాగించుటకు పూర్వమే పశువును గొనిరమ్ము" అని చెప్పెను.

ఇది విని, యా బుద్ధిమంతుఁడగు అంబరీషుఁడు వేలకొలఁది గోవులను తీసికొని నరపశువుకొఱకు వెదకఁబోయెను. ఆతఁడు క్రమముగ దేశములు, పట్టణములు, ఆశ్రమములు, గ్రామములు మొదలగు చోట్లను నల్లాడి తిరిగితిరిగి చూచెను. తుద కారాజు భృగుతుంద మనెడి కొండప్రదేశము చేరి యచ్చట భార్యతోను బిడ్డలతోను గూడి వసించుచుండు ఋచీకుఁడను మునిని దర్శించెను. తపఃప్రభావముచే నగ్నివలెఁ బ్రకాశించుచున్న యమ్మునిశ్రేష్ఠుని కాయంబరీషమహారాజు మ్రొక్కి, యా మునీంద్రుని యోగక్షేమము లడిగి, యాతనిఁగూర్చి "ఓ భృంగవంశమునఁ బుట్టిన మహామునీ, నేను యాగముచేయ నారంభించి, పశువును మళ్ళఁదోలి పెట్టితిని. అది కనఁబడకపోయినది. ఎంత ప్రయాసపడి వెదకినను గానరాకున్నది. నా యాగము పాడై పోవునట్లున్నది. నేను నూఱువేల పశువుల నియ్య నొప్పుకొనియున్నాను. వానిని దా మంగీకరించి, తమ పుత్రులలో నొక్కని నిప్పించిన నా యాగము పూర్తియగును. నా కోరికయు సిద్ధించును" అని యడిగెను.

ఇట్లంబరీషమహారాజు జడుగఁగా, విశేషమయిన బ్రహ్మతేజస్సు గల ఋచీకుఁడు రాజుం జూచి, "నరాధిపా, నీ వెంత సొమ్మిచ్చినను, నేను బెద్దకొడుకును విక్రయింపను" అని చెప్పెను. అప్పుడు ఋచీకుని మాట విని, మహాత్ములగు నా బిడ్డలయొక్క తల్లి యంబరీష నరేంద్రునిఁ జూచి, "నృపాలా! పూజ్యుఁడైన ఋచీకమహాముని పెద్దకొడుకు నమ్ముటకు వీలుపడ దని చెప్పెను. నాకును గడఁగొట్టుబిడ్డనిపై నెక్కువ మక్కువ. మహారాజా, లోకమునఁ దఱచుగాఁ బెద్దకొడుకులు తండ్రుల కిష్టులు. కడపటికొడుకులు తల్లుల కిష్టులు. కావున నృపాలా, నేను జిన్న కొడుకు నీయఁజాల" ననెను. అట్లు ఋచీకుఁడు పెద్దకొడుకును, నతని పత్ని చిన్నకొడుకును నియ్యఁజాల మని చెప్పఁగా, శ్రీరామా, నడిమి వాఁడయిన శునశ్శేఫుఁడు తానే యంబరీషనృపాలునితో నిట్లనియెను.

"ఓ రాజేంద్రా! మాతండ్రి పెద్దకొడుకును విక్రయింపననియుఁ, దల్లి చిన్నకొడుకు నియ్యఁజాల ననియుఁ జెప్పిరి. దానివలన వారు నడిమివాఁడనైన నన్ను విక్రయింప సమ్మతించినట్లున్నది. మహారాజా, నన్ను వారు నీకు విక్రయించినట్లె. ఆ మాట వారు రన నక్కరలేదు. నన్నుఁ గొనిపొమ్ము." అని శునశ్శేఫుఁడు చెప్పగా నంబరీషుఁడు లక్ష గోవులను ఋచీకుని కిచ్చి, యా శునశ్శేఫునిఁ గొని, మహాసంతోషముతో నతనిని దన రథంబునఁ గూర్చుండఁబెట్టుకొని, వేగిరముగాఁ దన పట్టణమునకుఁ బ్రయాణమాయెను.

## 62-వ సర్గము.

### విశ్వామిత్రుఁడు శునశ్శేఫుని వదలించుట

ఓ నరశ్రేష్ఠుఁడవయిన రఘునందనా, ఓ శ్రీరామా, యెక్కువ కీర్తిగల యంబరీష నృపాలుఁడు శునశ్శేఫుని గైకొని మఱలివచ్చుచుండఁ బుష్కరతపోవనంబు చేరునప్పటికి మిక్కిలి యెండ నడినెత్తికిఁ దగుల నారంభించెను. అంతట నంబరీషుఁడు మిక్కిలి డస్సి యా పుష్కరమున నలసటఁ దీర్చుకొనుటకై యచ్చట నిలిచెను. మహాకీర్తి సంపన్నుఁడగు నంబరీషుఁ డలసట దీర్చుకొనుటకై యొకచోటఁ గూర్చుండియుండఁగా, ఎక్కువ తపోమహిమగల శునశ్శేఫుఁడు మిక్కిలి యాత్రముతో నచ్చట మునులతోడఁ దపమొనర్చుచున్న తన మేనమామయైన విశ్వామిత్రునిఁ

జూచెను. అట్లమ్మహాముని జూచినంతనే, శునశ్శేఫుఁడు మోమునఁ గళదప్పి, యాఁకలిచేతను దారిబడలికచేతను డస్సి, యమ్మహాత్ముఁడైన ముని యొడిలో దటాలునఁ బడి యిట్లనియె.

"ఓ మునిశ్రేష్ఠుఁడా, నాకుఁ దల్లి లేదు; తండ్రి లేఁడు; దాయాదులు లేరు; ఇఁకఁజుట్టా లెక్కడనుండి వత్తురు? మహాత్మా, నన్ను రక్షింప వలయును. మునీంద్రా, నీవే యందఱిని గాపాడువాఁడవు. నీవే యందఱికి మేలు గలుగఁజేయువాఁడవు. మా తలిదండ్రులు నన్ను నంబరీషునికిఁ బశువునుగా విక్రయించిరి. అంబరీష నృపాలుఁడు యాగము నెట్లు నెఱవేర్చి, తన మనోరథంబుఁ బూర్తి గావించుకొనునో, యెట్లు నేను దీర్ఘాయువు గలిగి, నాశములేక యీలోకమున గొప్ప తపమొనర్చి, స్వర్గము నొందుదునో, యట్లు చేయవలయును. నేను దిక్కులేనివాఁడను. నీవు గొప్ప మనసుచేసి, యనాథుఁడనైన నాకు దిక్కు గావలయును. ఈ యాపదనుండి తండ్రి కొడుకును దప్పించునట్లు నన్నుఁ దప్పింపవలయును" అని శునశ్శేఫుఁడు విశ్వామిత్రుని వేఁడెను.

విశేషతపస్సుతోఁగూడిన విశ్వామిత్రుఁడు ఆ శునశ్శేఫుని యా మాట విని, పలువిధముల వాని నూరడించి, తనపుత్రులఁ బిలిచి, "నాయనలారా! దేని నిమిత్తమై తండ్రులు తమ మేలుగోరి సుగుణులయిన పుత్రులఁ గనుదురో, యా పని యిప్పుడు వచ్చినది. ఈ పసివాఁడయిన శునశ్శేఫుఁడు నన్ను శరణుఁజొచ్చి, తన ప్రాణములఁ గాపాడు మని వేఁడుచున్నాఁడు. నాయనలారా, మీ ప్రాణముల నితనికి బదులుగ నిచ్చి యితనికి మేలు చేయుఁడు. మీ రందఱు సత్కర్ములఁ జేయువారలు; ధర్మమునందే యెక్కువ తలం పుంచి యుండువారలుగదా. మీ రంబరీషునియాగమునఁ బశువులై యగ్నిదేవునికిఁ దనివి గావింపుఁడు. ఇట్లు మీరు చేయుదురేని, శునశ్శేఫుని ప్రాణములు గాపాడిన ట్లగును. అంబరీషుని యాగంబు నిరాటంకముగా జరిగి నట్లగును, దేవతలును దనివినొందుదురు. నా మాటయు నిలుచును" అని చెప్పెను.

పురుషశ్రేష్ఠుఁడవగు శ్రీరాముఁడా, విశ్వామిత్ర మునీంద్రుని మాటలు విని, మధుష్యందుఁడు మొదలగు నతని పుత్రులు గర్వము

తోను సలక్ష్యముతోను గూడినవారయి "ఓ తండ్రీ, నీవు నీ పుత్రులను విడిచి యొరునికొమరుని గావ బూనెదవు. 'తన్ను మాలిన ధర్మము, మొదలు చెడ్డ బేర'మను సామెతకిది యొప్పియున్నది. మంచి యన్నంబుఁ బెట్టికొని యెవఁడు కుక్కమాంసమును దిన నపేక్షించును? ఇది చేయఁదగనిపని యని తలంచెదము." అని తనపుత్రులు సెప్పఁగా విశ్వామిత్రుఁడు కోపముచేఁ గన్నులెఱ్ఱచేసి, తనకొడుకులం జూచి యిట్లనియె: "ఓ పుత్రాధములారా, నా మాట మీఱితిరి. అంతియకాక, కొంచెమయినను భయములేకుండను, ధర్మమార్గమునకు నిందితముగను, గగురుపాటు పుట్టునట్లుగను నింతటి మొగమోటమిలేనిమాట చెప్పితిరి. మీరును వసిష్ఠపుత్రులవలెనే ముష్టికు లనెడివారి జాతులందుఁ బుట్టి, కుక్కమాంసముఁ దినుచు వేయియేండ్లు నిండునంతపర్యంతము భూలోకమునఁ దిరుగుచుందురుగాక" అని తన పుత్రులను విశ్వామిత్రుఁడు శపించెను.

అట్లు మునివరుఁడగు విశ్వామిత్రుఁడు తన పుత్రులను శాపముతోఁగూడినవారింజేసి, దిగులుపడియున్న శునశ్శేఫునికి విభూతి మొదలగునవి మంత్రించి, యేమియు వ్యాధి రాకుండునట్లు రక్ష యిడి యిట్లనియె: "ఓ శునశ్శేఫా, నీకు నెఱ్ఱని గందమువూసి, యెఱ్ఱనిబట్టలం గట్టనిత్తురు. పిమ్మట నిన్ను దర్భత్రాళ్లతో విష్ణుప్రీతికరమగు యూపస్తంభమునకుఁ గట్టుదురు. నీ వప్పుడు నే నుపదేశింపఁబోవు రెండు మంత్రములతో నాయగ్నిహోత్రుని స్తోత్రముసేయుము. ఓ మునిపుత్రుఁడా! అంబరీషుని యాగమంబున నిన్ను వైష్ణవయూపంబునకుఁ గట్టినపుడు నీ వీ రెండు మంత్రములను జపింపుము. నీ కోరిక తీరును" అని చెప్పి యా శునశ్శేఫునికి రెండు మంత్రముల నుపదేశించెను.

అంత శునశ్శేఫుఁడు మిక్కిలి జాగ్రత్తతో నా రెండుగాథలను గ్రహించి, త్వరితముగా రాజశ్రేష్ఠుఁడైన యంబరీష నృపాలునికడకేఁగుదెంచి, "రాజశ్రేష్ఠుఁడా, యేమి యాలస్యము చేయుచున్నాఁడవు? లే లెమ్ము. వేగముగ యాగశాలకు నేఁగుదము. యజ్ఞదీక్షయందుఁ గూర్చుండు"మని రాజుతోఁ జెప్పెను.

అట్లు శునశ్శేఫుఁడు సెప్పిన వాక్యమును విని, యెక్కువ మక్కువతోడఁ గూడి, నృపాలుఁడు వేగనేఁగి యేమఱుపాటులేక యజ్ఞశాలను బ్రవేశించెను.

అంత నంబరీషుండు సదస్యుల యనుమతి వడసి, యా శునశ్శేఫుని దర్భలతోఁ గట్టి, యెఱ్ఱని బట్టను ధరింప నొసఁగి, వైష్ణవమగు యూపస్తంభమునకుఁ గట్టిరి. అట్లు శునశ్శేఫుఁడు యూపస్తంభమునకుఁ గట్టఁబడినవాఁడై శ్రేష్ఠములైన మంత్రములతో నింద్రుని, నింద్రునితమ్ముఁడగు నుపేంద్రుని విశ్వామిత్రుఁ డుపదేశించిన తెఱఁగున స్తోత్రము చేసెను. రఘునందనా, అంత వేయికన్నుల వేల్పగు నింద్రుఁడు శునశ్శేఫుఁడు రహస్యముగాఁ జేసిన స్తోత్రములచే సంతసించినవాఁడై, యా శునశ్శేఫున కప్పుడు దీర్ఘాయువు నొసఁగెను. నృపాలురలో శ్రేష్ఠుఁడవైన యోరామచంద్రా! అంబరీషనృపాలుఁడును దేవేంద్రుని యనుగ్రహమువలన యాగమునకుఁ బలుమడుఁగు లెక్కువయయినఫలమును బొందెను.

రాజశ్రేష్ఠా, గొప్ప తాపసుఁడును, ధర్మాచరణమే స్వభావముగాఁ గలవాఁడునునగు విశ్వామిత్రుఁడును పుష్కర క్షేత్రములందు మరలఁ వేయియేండ్లు తపస్సు సేసెను.

## 63-వ సర్గము.

### విశ్వామిత్రుఁ డుత్తరదిక్కునఁ దపస్సు చేయుట

వేయిసంవత్సరములు నిండగనే, వ్రతమొనర్చి కృతార్థుఁడయిన విశ్వామిత్రునకు దేవతలందఱు నతనితపంబునకు ఫలంబు నియ్యఁగోరి, యతనికడకువచ్చిరి. అప్పుడు మితిలేని కాంతిగల బ్రహ్మదేవుఁడు విశ్వామిత్రుఁ గూర్చి, "నీకు మంగళమగుఁగాక! నీవుచేసిన పుణ్యప్రదములగు శుభకర్మములచేత నీవు 'ఋషి' యను బిరుదము నొందితివి" యని చెప్పి, స్వర్గమునకుఁ బోయెను. ఎక్కువ తపఃప్రభావము గలిగియున్న విశ్వామిత్రుఁ డంతటితోఁ దనివినొందక, మరల నతి తీవ్రమైన తపము సేయఁ దొడఁగెను.

పురుషశ్రేష్ఠుఁడవగు శ్రీరామా, యట్లు విశ్వామిత్రుఁడు తపము సేయుచుండఁగాఁ, బెక్కేండ్లకుఁ బిదప మేనక యను పేరుగల యంద

కత్తెయగు నొకయప్సరస పుష్కరతీర్థములందు జలకమాడవచ్చెను. అట్లు వచ్చి యాతీర్థమునందు జలకమాడుచుండు సౌందర్యవతియగు నాయప్సరసను, మేఘముల నడుమఁ దళతళ మని మెఱయు మెఱుపువలె వెలుఁగుచున్నదానిని విశ్వామిత్రుఁడు చూచెను. అట్లు విశ్వామిత్రుఁడా మేనకను జూచి, మోహించి, "ఓ యప్సరసా, నీకిదె స్వాగతము. నీవు నా యాశ్రమమున నుండుము. మన్మథునిబారింబడిన నన్ననుగ్రహింపుము. నీకు మేలయ్యెడు" నని చెప్పెను. అతని మాటప్రకారమే యుత్తమాంగనయగు మేనక యాతని యాశ్రమమున నుండెను. రఘువంశోద్భవా, విశ్వామిత్రుఁడును మేనకయుఁ గూడి సర్వసుఖముల ననుభవింపుచుండ పదియేండ్లు గడచిపోయెను.

అట్లు పదియేండ్లు గడచినతర్వాత విశ్వామిత్రమహర్షి ముందటి స్థితిని జ్ఞప్తికిఁ దెచ్చుకొని, సిగ్గుపడి "యయ్యో! వ్యర్థముగా నేను చేయుచున్న తపమునకు భంగము వచ్చెనుగదా" యని మనసున విచారపడెను. రఘునందనా! అంత నమ్మహాముని పశ్చాత్తాపముతోఁ గొంత తడవు చింతించి, "యిదియెల్లను నా తపస్సును హరించుటకై దేవతలు చేసినపని. ఈ పదియేండ్లు నొక్క యహోరాత్రమువలెఁ గడచినవి. నేను కామమునకును మోహమునకును లోఁబడుటచే నింతటి విఘ్నము తటస్థపడినది" యని మిక్కిలి వగచుచు, జరిగిన పనికి దుఃఖించుచు, వేఁడి నిట్టూర్పులు నిగిడించుచుండెను. అప్పుడు మేనక "విశ్వామిత్రుని మనసు తనమీఁదనుండి మఱలినది. తన్నుఁ బ్రేమతోఁ జూడక, తన పొరబాటునకై చింతింపుచున్నాఁడు. కోపముచే నెక్కడ శపించునో" యని వెఱచి, వణఁకుచుఁ జేతులు గట్టికొని, నిలువఁబడి యుండెను. అప్పు డట్టి మేనకను జూచి, విశ్వామిత్రుఁడు "ఓసుందరీ, మేనకా, యిది నీ తప్పిదము గాదు. నాయొక్క పొరబాటువలనఁ గలిగినది. కావున నీవు వెఱవ నక్కఱలేదు, నీవు పోయిరమ్ము" అని తిన్ననిమాటలచే దానిని సాగనంపి, తాను హిమవంతముఁ జేరెను. అట్లు మిగులఁ గీర్తిగల విశ్వామిత్రుఁడు హిమవంతముఁ జేరి, కౌశికీనదీతీరమున నివసించి, నిశ్చలబుద్ధి పూని, యింద్రియములనెల్ల గెల్వఁగోరి యతిదారుణమగు తపంబు సేసెను.

రామా! ఇట్లు విశ్వామిత్రుఁడు హిమవంతమున వేయి సంవత్సరము లతికఠినమయిన తపంబు జేయుచుండ, దేవతలందఱు నతని తపమునకు మెచ్చి, ఋషు లందఱితోఁ గూడివచ్చి యితనిముందట నిలఁబడి, యీకుశికనందనుఁ డిఁక 'మహర్షి' యను బిరుదుపొందుట కర్హుఁడని తమలోఁ దా మనుకొనిరి. దేవత లన్న యామాటవిని, బ్రహ్మదేవుఁడు తపస్సే ముల్లెగాఁగల విశ్వామిత్రుని జూచి, "ఓ మహర్షీ, నీ యుగ్రమయిన తపమునకు మేము సంతసించితిమి. కుశికనందనా, నీ కింతకు ముస్తు కేవలము 'ఋషి' యనుబిరుదు నిచ్చితిమి. ఇప్పుడు నీకు 'మహర్షి' యను పట్టము నిచ్చెదము" అని చెప్పెను.

లోకముల కన్నింటికిని ప్రభువయిన బ్రహ్మదేవుఁ డానతిచ్చిన మాటను విని, తపోధనుఁడగు విశ్వామిత్రుఁడు సంతోషముగాని దుఃఖముఁగాని చెందక, చేతులు జోడించి, యాబ్రహ్మదేవునికి నమస్కరించి యడఁకువతోడ నిట్లనియె.

"ఓ భగవంతుఁడా! నే నొసఁగూర్చిన పుణ్యపుఁ బనులచే నాకు సాటిలేని మహర్షి యను బిరుదము నిచ్చితివి. ఇఁక నేను జితేంద్రియుడనని యెన్నఁ దగుదును గదా" యని విశ్వామిత్రుఁడు నలుమోముల వేలుపుం బ్రార్థింప, నా బ్రహ్మదేవుఁ డతనింగూర్చి, "మునిశ్రేష్ఠుఁడా, యింతలోపలనే జితేంద్రియుఁడవు గానేరవు. జితేంద్రియుఁడ వగుట కింకను బ్రయత్నపడుము" అని చెప్పి స్వర్గలోకమునకు జనెను.

ఇట్లు బ్రహ్మమొదలగు దేవత లందఱు పయనమయి పోయినతరువాత మహర్షియగు విశ్వామిత్రుఁడు చేతులు పైకెత్తి యంతరాళంబున నిలిచి, యాహారంబు మాని, గాలితిండియై గ్రీష్మర్తువునందు (ఎండకాలమునందు) నాలుగుప్రక్కల నగ్ని నుంచుకొని పైన సూర్యుని జూచుచు, వర్షర్తువునందు (వానకాలమునందు) నాలు బైటనుండు వానకుఁ దడియుచు, శిశిరఋతువునందు (చలికాలమునందు) రేయింబవళ్లు నీటినడుమ నుండుచు, వేయి సంవత్సరములకాల మతిభయంకరమగు తపస్సు చేసెను.

మహామునియగు విశ్వామిత్రుఁ డవ్విధంబునఁ దపంబు సేయుచుండ, దేవతలకును, దేవేంద్రునకును మనసునం దారాటము పుట్టెను.

అప్పుడు దేవేంద్రుఁడు సకల దేవతలతోడఁ గొలువుండి, రంభయను నప్సరసతో తమకు మేలు గావించునదియు, విశ్వామిత్రునకుఁ గీడు దెచ్చునదియు నైన వాక్యమును బలికెను.

## 64-వ సర్గము.

విశ్వామిత్రుఁడు రంభను శపించి యత్యుగ్రతపంబు చేయుట

ఇంద్రుఁడు రంభను జూచి "ఓ రంభా! యిప్పుడు దేవతల కొక గొప్పపని నీ వలనఁ గావలసియున్నది. అదేది యనఁగా, విశ్వామిత్రుఁడు హిమాలయమున నత్యుగ్రముగఁ దపం బొనర్చుచున్నాఁడు. నీ వతని కడకుఁ బోయి, యతనిని మన్మథబాణములకు లోఁబఱచి, నీయందు మోహపడునట్లు చేసి యాతని వంచించి, యాతనితపస్సునకు భంగము గావింపవలయును" అనిచెప్పెను.

ఆ బుద్ధిమంతుఁడయిన వేయికన్నులవేల్పు చెప్పినమాట విని రంభ సిగ్గుపడి, చేతులు జోడించి, యా వేలుపుఱేనితో "దేవేంద్రా, మహాముని యయిన యీ విశ్వామిత్రుఁడు చండప్రచండుఁడు. ఓ ప్రభూ, యితఁ డెఱుఁగునేని నాపైఁ దన కడిఁదికోపంబుఁ గ్రక్కఁగలఁడు. దీనికి సంశయములేదు. దేవా, యాయన కోపగించి యెక్కడ శాపం బొసఁగునో యని వెఱచుచున్నదానను. నాయందు దనుగ్రహింపవలయును" అనెను. ఓ రామా, ఇట్లు రంభ యపుడు వెఱపుతోఁ జెప్పినమాటను విని, గడగడవణఁకుచు, దోసిలి గట్టుకొని నిలఁబడియుండు నా రంభనుగూర్చి దేవేంద్రుఁ డిట్లనెను.

"ఓ రంభా! వెఱవకుము. నీకు మేలు గలుగును. నా యానతిని జేయుము. చక్కఁగాఁ జిగిరించిన చెట్లు గలిగి కంటికింపైయుండు వసంతర్తువునందు నేను మన్మథుని దోడ్కొని, నీ ప్రక్కన నొక్కచెట్టునందు మనోహరంబుగాఁ గూయు కోయిలరూపు దాల్చియుండెదను. నీ వన్నినో యనేక శుభలక్షణములు గలదియు, మెఱపుమాడ్కిఁ దళతళ మెఱయుచుండునదియు నైన రూపముఁదాల్చి, తపస్సుచేయుచుండు నా విశ్వామిత్రమహర్షి మనంబును మోహింపఁజేయుము" అని యింద్రుఁడు చెప్పినమాట లాలకించి, సొగసుకత్తెయగు రంభ రమణీయమగు రూపమును దాల్చి, చిఱునవ్వు నవ్వుచుఁ బోయి, విశ్వామిత్రుని

చేరువను నడయాడుచుండెను. ఇంద్రుఁడును రంభతోఁ జెప్పినట్లె తాను మన్మథుని దోడ్కొని, యా తపోవనమునకుఁ జని యొక కోయిల రూపముతో నా రంభకు దాపున నొకచెట్టునఁ గూర్చుండి, మనోహరముగాఁ గూసెను. మహామునియు నా కోయిలకూఁత విని, గగుర్పాటొందిన మేనితోఁ గూడి, యెదుట నిలఁబడియున్న రంభను జూచెను. అంత విశ్వామిత్రుఁ డా కోయిలకూఁతచేతను, రంభ పాడినయసమానమగు పాటచేతను, రంభను సమక్షమునఁ జూచుటచేతను గొంచెము మనంబునఁ జపలపడి, పిమ్మటఁ దెలిసికొని, 'యేమి యిప్పుడు మనమనస్సు చలించుటకుఁ గారణ' మని యించుక శంకించెను. అట్లు శంకించి, మునిశ్రేష్ఠుఁడగు కౌశికుఁ డిది తన్ను వంచించుటకై యింద్రుఁడు పన్నిన యుపాయమని యెఱింగి, కోపముచే రంభను జూచి, "ఓసీ రంభా, కామక్రోధముల జయింపఁ గోరుచున్న నా మనస్సును వంచింపఁ బూనితివి గాన నో దురదృష్టవంతురాలా, నీవు పదివేలయేండ్లు ఱాయివై యుందువుగాక. అంతియ కాక, మిక్కిలి గొప్ప తేజస్సుగలవాఁడును, తపోబలముతోఁ గూడినవాఁడును నైన బ్రాహ్మణుఁడు నాశాపముచే నిట్టి వికారరూపంబు నొందిన నిన్నుద్ధరింపఁ గలఁ" డని శాప ప్రతివిమోచనంబుల రెంటిని నొసఁగెను.

విశేషతేజస్సుగల విశ్వామిత్రమహాముని తనకోపంబు నెవ్విధంబునను మనస్సున నాఁపుకొనఁజాలక, రంభ నిట్లు శపియించి, 'యేల యిట్లు కోపము నాఁపుకొనలేక, రంభను శపించితిని?' అని పశ్చాత్తాపము నొందెను. ఆ విశ్వామిత్రుని ఘోరశాపముచే రంభ ఱాయి యయ్యెను. విశ్వామిత్రుఁడు రంభకు శాపమిచ్చిన సందడి గనుఁగొని, "మనమిచ్చటనున్న మహర్షి మనలను గూడ శపించునేమో" యని వెఱచి, రంభతో మాట్లాడు సందర్భములోనే యిదే సందని యింద్రుఁడును, మన్మథుండును దూసికొనిరి.

రాముఁడా, యెక్కువ తపోమహిమగల విశ్వామిత్రుఁడు కోపముచేఁ దనతపస్సంతయు విఫలమై పోయినందులకు వగచి, యింకను ఇంద్రియనిగ్రహము గలుగలేదు గదా యని విచారపడఁదొడఁగెను. ఇట్లు తడవతడవకుఁ దనతపస్సు కోపముచేఁ గొట్టుపడిపోవుటకు మిక్కిలి విచా

రము నొంది, "నే నీక నెవఁ డేమి చేసినను గోపపడను. ఎంత యిడుమ వచ్చినను నేమాటయు నుడువను. నూఱులకొలఁది వత్సరములయిన నూపిరి విడువకయు, లోపలికిఁ బీల్చుకొనకయు, నేలాటి యాహారము భుజింపకయు, ఇంద్రియముల నెల్ల నడఁగించికొనియు, శరీరము నెండింపఁ జేసెదను. నే నెంతవఱకుఁ దపస్సుచే సంపాదింపఁదగిన బ్రాహ్మణత్వము సిద్ధించునో యంతవఱకు నుచ్ఛ్వాస నిశ్శ్వాసములు లేక, యాహారము మాని, యనేక సంవత్సరంబు లుండెదను. నే నివ్విధమునఁ దపస్సుచేయు చున్నను, నాయంగములు చిక్కిపోవు." అని తలంచి మునిశ్రేష్ఠుఁ డయిన విశ్వామిత్రుఁడు వేయి సంవత్సరములు దీక్షవూని, రఘునందనా, యితరులు చేయనలవికాని వంతము చేసెను.

## 65-వ సర్గము.

### విశ్వామిత్రుఁడు తూర్పుదిక్కున దపంబు సేయుట

శ్రీరామా! విశ్వామిత్రమహాముని యుత్తరదిక్కును విడిచి, తూర్పుదిక్కుఁ జేరి, వేయియేండ్లు మౌనమనెడి యుత్తమవ్రతం బూని, యితరులచేఁ జేయుట కలవికాని తపస్సును జేయుచు, నీ వేయియేండ్లును గొయ్యవలె నిలఁబడి నిద్రాహారంబులు మానియుండెను. ఇట్లు చలనము లేకయుండు నా ముని కెంద ఱెన్ని విఘ్నములు చేసినను గోపమనుమాట యాతనియొద్దఁ జేరకయుండెను. ఆ మునీంద్రుఁ డొకటే నిశ్చయము చేసికొని తఱుఁగని తపము నేసెను.

ఓ రఘువంశపు రాజులలో శ్రేష్ఠుఁడా, విశ్వామిత్రుఁ డిట్లు వేయి సంవత్సరంబులు మౌనంబుతోను, కోపము లేకయు, నిద్రాహారంబులు వర్జించియుఁ దపస్సుచేసి, తన వ్రత సమాప్తిచేసి, యాదినంబున వ్రత పారణ చేయుటకై యన్నము సిద్ధముచేయ, నప్పుడు దేవేంద్రుఁడు బ్రాహ్మణుని రూపంబుఁ దాల్చి, విశ్వామిత్రునియెదుటనిలిచి, "మహాత్మా, యాఁకలి నన్నుఁ బీడించుచున్నది. నాప్రాణములు పోవునట్లున్నవి. నా కన్నము పెట్టి, నాప్రాణరక్షణ చేయు" మని యాచించెను.

అమితమైన తపం బొనర్చుచుండు విశ్వామిత్రుఁ డేమియు సంశయము నొందక, యాబ్రాహ్మణునికి సిద్ధమైయున్న యన్నము పెట్టెను. ఆతఁడు కొంచెమైనను మిగిలింపక యన్నము నంతయుఁ

బినివేయు, దాను భుజింపకయుండి, మౌనవ్రతము ధరించినవాఁ డగుటచే నా బ్రాహ్మణునితో నేమియుఁ బలుకక, మరల వేయిసంవత్సరము లుచ్ఛ్వాసనిశ్శ్వాసములు లేక తపంబుసేయఁ దొడఁగెను. అట్లు మునీంద్రుఁ డూపిరిగొనకయె తపస్సుచేయుచుండ నతని శిరస్సునుండి పొగవెడలెను. దానిని జూచి, మూడులోకములవారును తత్తఱపడి, మంటలో నుంచఁబడినవారివలెనైరి. అప్పుడు దేవతలు, గంధర్వులు, పన్నగులు, అసురులు, రాక్షసులు మొదలగువారందఱు మునీంద్రుని తపస్సుయొక్క వేఁడిమికిఁ దాళఁజాలక మూర్ఛిల్లి, గాంతిలేనివారలై విచారముతోఁ బ్రహ్మదేవుని గూర్చి యిట్లనిరి.

"ఓదేవా, విశ్వామిత్రమహాముని ననేక కారణములచేత వంచించితిమి; కోపమును గలిగించితిమి. అయిన నితఁడు తపస్సును వృద్ధిచేయుచునే యున్నాఁడు. ఇతనియెడల నావగింజంత దోషము సైతము గానిపింపదు.

కావున నీతఁడు మనంబున నేది తలఁచియున్నాఁడో, దానిని నెఱవేర్పుమేని, యితఁడు కదలునవి కదలనివియగు వస్తువులతోఁ గూడిన యీమూడులోకములను నశింపఁజేయును. దిక్కులెల్లఁ గలవరపడియున్నవి. కాంతియించుకయైనను లేదు. సముద్రము లన్నియుఁ గలఁతఁజెంది యున్నవి. పర్వతము లన్నియు బ్రద్దలగుచున్నవి. భూమి గడగడ వణఁకుచున్నది. గాలి దుమ్ములురేగ వీచుచున్నది. వాదించు నాస్తికులవలె జనులు గర్మలను విడిచియున్నారు. బ్రహ్మదేవుఁడా! దీనిని దొలఁగించుకొను నుపాయము కానరాకున్నది. జనులు నాస్తికులయిపోయిరి. ముజ్జగములవారును మనంబున నెక్కువ కలఁతఁ జెంది, మూర్ఛమునిఁగినట్లు కానిపించుచున్నవారు, సూర్యుఁడు సయితము మా విశ్వామిత్రమహర్షియొక్క తేజముచేత, దివిటిక్రింది దీపమువలె వెలుఁగులేక యున్నాఁడు. "ఓబ్రహ్మదేవుఁడా, యీమునీంద్రుఁడు లోకములఁ బాడుచేయ మనంబునఁ దలపెట్టునంతలోపలనె, యగ్నిహోత్రునివలె నెక్కువగ వెలుఁగుచున్న యీతని సమాధానపఱుపవలయును. ప్రళయకాలమందలి యగ్నిదేవుఁడు మున్నెట్లు మూఁడులోకంబులను దహింపఁజేసెనో, యట్లు విశ్వామిత్రుఁడు ముల్లోకములను గాల్చివేయును. స్వర్గ

మును సృజింపనైనను సృజించును. కావునఁ దామసముచేయక యతని కోరికను దీర్పవలయును” అని దేవతలు చెప్పిరి.

అంతట దేవతలందఱు బ్రహ్మను ముందుంచుకొని మహాత్ముఁడైన విశ్వామిత్రునికడ కేఁగుదెంచి, విన నింపయిన మాటలతో విశ్వామిత్రు నుద్దేశించి, “ఓ బ్రహ్మర్షీ, నీకు క్షేమము గలుగునుగాక! నీవు తీవ్రతరమైన తపస్సుచేసి, బ్రాహ్మణత్వమును సంపాదించితివి. ఓ బ్రాహ్మణుండవయిన విశ్వామిత్రుఁడా, మేము దీర్ఘాయుస్సు నొసఁగుచున్నారము. మేలు పొందుము. నీకు శుభంబు గలుగునుగాక! సుఖముగఁ బొమ్ము” అని చెప్పిరి.

విశ్వామిత్రమహాముని బ్రహ్మాదిదేవతలందఱు చెప్పిన మాటలను విని, వారికందఱికిని బ్రణమిల్లి, సంతసముతో నిండినవాఁడై, దేవతలం జూచి, “యోవేల్పులారా! నేను బ్రాహ్మణ్యము నొంది దీర్ఘాయువు గలవాఁడ నయితినేని. నాకు బ్రణవమును, వషట్కారమును, వేదములును సిద్ధించి, నేను యాగము చేయుటకును, యాగము చేయించుటకును దగినవాఁడ నగుదునుగాక. దేవతలారా! క్షత్రియులకు యోగ్యమయిన యథర్వవేదముఁ జదివినవారిలోను, బ్రాహ్మణులకు యోగ్యములయిన ఋగ్యజుస్సామవేదములఁ జదివినవారిలోను నుత్తముఁడయిన వసిష్ఠుఁడు మీరు చెప్పినట్లు ‘నీవు బ్రాహ్మణుఁడవయితి’వని చెప్పునుగాక. దేవతలలో శ్రేష్ఠులారా, మీరీ నాగొప్పకోరిక నిత్తురేని, మీరు మీ తావులకు దయసేయుఁడు” అని చెప్పెను.

అంత దేవతలు మంత్రజ్ఞులలో మేటియైన వసిష్ఠమహాముని యొద్దకుఁ బోయి, “ఓ మునీంద్రా, నీవు బ్రహ్మర్షివి. బ్రాహ్మణులకు దీర్ఘవిరోధంబు దగదు కావున విశ్వామిత్రుఁడు చేసిన ముందటి యపరాధములను మన్నించి యతనితోఁ జెలిమిచేసి ‘విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి యయ్యె’ నని చెప్పుదువుగాక” యని వసిష్ఠమునీంద్రుని బ్రార్థించిరి. అంతనా బ్రహ్మర్షియగు వసిష్ఠుఁడును విశ్వామిత్రునితోఁ జెలిమియొనర్చి, “దేవతలు చెప్పినట్లు విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షియగుఁగాక” యని పలికెను. అంతట దేవతలందఱు, “ఓ విశ్వామిత్రా, నీవు బ్రహ్మర్షివే. దీని కేమియు సంశయము లేదు. బ్రహ్మర్షికిఁ గల యధికారము లన్నియు నీకుఁ గలు

కును." అని విశ్వామిత్రమునీంద్రునితోఁ జెప్పి, తమ నివాసములకు వచ్చినట్లు పోయిరి.

ధర్మాత్ముఁడయిన విశ్వామిత్రుఁడు నుత్తమ బ్రాహ్మణత్వము నొంది, మంత్ర వేదులలో నుత్తముఁడును, బ్రహ్మర్షియునగు వసిష్ఠుని బూజించి, తన కోరికను బడసి, తపస్సుచేయుచుఁ బుడమియందంతటను సంచారము చేసెను.

ఓ రామా! మహానుభావుఁడయిన యీ విశ్వామిత్రుఁ డివ్విధంబున బ్రాహ్మణత్వము నొందెను. రామచంద్రా, యీతఁడు మునులలో శ్రేష్ఠుఁడు. ఇతఁడు రూపము దాల్చిన తప స్సనఁదగినవాఁడు. ఇతఁ డెల్లప్పుడు ధర్మమునందే తలఁపుగలవాఁడు. వీర్యమున కితఁడు ముఖ్యమైనయునికిపట్టు" అని యెక్కువ బ్రహ్మతేజస్సుగల బ్రాహ్మణోత్తముఁడయిన శతానందుఁడు రామునికి విశ్వామిత్రుచరిత్రము నివ్విధంబున వినిపించి, యంతటితోఁ దనమాటలఁ జాలించెను.

జనకనృపాలుఁడు శతానందుని మాట లాలకించి, చేతులు జోడించి, రామ లక్ష్మణుల సమక్షమున కుశికనందనుఁడగు విశ్వామిత్ర మునీంద్రునితో నిట్లనియెను.

"మునిశ్రేష్ఠుఁడా! నేను ధన్యుఁడనయితిని. అనుగ్రహింపఁబడితిని. తమరు యజ్ఞమునకు విచ్చేయుట మహావిశేషము. అందును కకుత్థ్స వంశోద్భవులగు నీ రాజపుత్రులను గూడఁ దోడ్కొని నా యజ్ఞమునకు విచ్చేసితిరి. ఓ బ్రహ్మణ్యా! దర్శనమొసఁగి నన్నుఁ బునీతునిఁ జేసితివి. మహానుభావుఁడవయిన యుత్తములలో నుత్తముఁడవగు నో విశ్వామిత్ర మహాముని, బ్రహ్మర్షులలో నుత్తముఁడవైన నీ దర్శనమువలన నా కనేక విధములైన సద్గుణంబులు ప్రాప్తించినవి. బ్రాహ్మణోత్తమా, శతానంద ముని విస్తరించి చెప్పిన నీయొక్క గొప్పప్రభావంబుఁ దెలుపు చరిత్రము నంతయు మహానుభావుండయిన రాముఁడును, నేనును వింటిమి. కుశిక నందనా, నీతపము లెక్కింపనలవిగానిది. నీతపస్సువలని బలము నైతము గణింప సాధ్యముగానిది. నీయింతర సద్గుణములును నెల్లప్పటికిని నూహింప నలవియైనవిగావు. బ్రహ్మయొక్కయుఁ, బార్వతీపతియగు శంకరుని యొక్కయుఁ దపోబల సద్గుణము లెట్లు తెలియ నలవికానివో, యట్లు నీ

తపోబలసద్గుణము లూహించి తెలియఁ దగినవి కావు. చరిత్రముఁ జెప్పు వింతలైన కథలను వినుచుండ నాకుఁ దనివి గలుగలేదు. అయినను సంధ్యావందనాదులకుఁ గాలమయినట్లున్నది. సూర్యబింబము పడమటకు వ్రాలినది. మహాతేజస్సుగల యో విశ్వామిత్రమహామునీ, రేపటియుదయమున దర్శనం బిప్పింపఁ గోరెదను. నీకు సుఖముగా రాకయేకదా! నాకనుజ్ఞ యొసఁగుఁడు." అని జనకమహారాజు విశ్వామిత్రమునీంద్రుని వేఁడెను. ఆ మునివరుఁడును, సంతుష్టుఁడయి, పురుషశ్రేష్ఠుఁడయిన జనకమహారాజును బొగడి, సంతోషయుక్తమగు మనస్సుగలవాఁడై, జనకమహారాజునకు సెలవొసఁగెను. అంత మిథిలాధినాథుఁడైన జనకమహారాజు మునీంద్రుని యనుజ్ఞఁగొని పురోహితునితోడను, బంధువులతోడను గూడి విశ్వామిత్రునకుఁ బ్రదక్షిణము చేసెను. విశ్వామిత్రమునియు, రామలక్ష్మణుల వెంటఁదీసికొని, మహర్షు లందఱు మర్యాదలు చేయుచుండ, వానిం గొనుచుఁ దనవిడిదలకుఁ బోయెను.

## 66-వ సర్గము.

### జనకుఁడు శివునివింటిమహిమ వర్ణించి చెప్పుట

అటుపిమ్మటఁ దెల్లవాఱినంతనే, జనకనృపాలుఁడు స్నానము, సంధ్య,యాపాసనము మొదలగు ననుష్ఠానములను దీర్చుకొన్నవాఁడయి, మహానుభావుఁడయిన విశ్వామిత్రుని, నాతనితోడ వచ్చియున్న రామలక్ష్మణులను బిలిపించెను.

వారు వచ్చినవెంటనే ధర్మములు నడుపుటయే స్వభావముగాఁగల జనకనృపాలుఁడా విశ్వామిత్రుని నతని వెంబడి వచ్చిన బుద్ధిమంతులగు రామలక్ష్మణులను శాస్త్రమందుఁ జెప్పఁబడిన తెఱఁగునఁ బూజించి, విశ్వామిత్రునింగూర్చి యిట్లనియె.

"ఓమహాత్మా! నీకిదే స్వాగతము. పాపరహితుఁడవగు మునీంద్రా, తమకేమి నేఁ జేయవలయునో యానతిండు. తమరు నన్నాజ్ఞాపింపవచ్చును గదా?" అని యాయుదార స్వభావముగల జనకుఁడు పలుకఁగా, ధర్మపరాయణుఁడును, సమయోచితముగను, పొందికగను మాటలాడుటయందు నేర్పరియునైన విశ్వామిత్రుఁడు శూరుఁడయిన జనకనృపాలునితో నిట్లనెను.

"రాజేంద్రా! వీ రిరువురు దశరథమహారాజు కొడుకులు. క్షత్రియ వంశస్థులు. లోకమునఁ బరాక్రమశాలు లనిపేరుపడసినవారు. నీయొద్ద నుండు ధనుస్సును జూడఁగోరి యిచ్చటికి నావెంబడి వచ్చినవారు. వీరి కా ధనుస్సును జూపింపుము. వీరు దానిని జూడవచ్చినవారు గాన, దానిం జూచి, తమకోరికను బొందినవారలై స్వేచ్ఛగాఁ బోవుదురు." అని విశ్వామిత్రుఁడు చెప్పినమాటలను విని, రాజు మహామునింగూర్చి యి ట్లనియెను. "మునీంద్రా! యీ ధను స్సేపని నిమిత్తమై నాకడ నున్నదో చెప్పెదను. సావధానంబుగ వినవలయు.

నిమి చక్రవర్తి కాఱవతరమువాఁడు దేవరాతుఁడను ప్రసిద్ధుఁ డయిన యొక నృపాలుఁ డుండెను. ఆ దేవరాతుని చేతిలో నీశ్వరుఁడు దీనిని నిల్లడగా నుంచెను.

తొల్లి దక్షునియాగమును ధ్వంసముచేసినప్పుడు ప్రతాపము గల వాఁడగు రుద్రుఁ డీ విల్లును దాల్చి, కోపముతో దేవతలను దెగడుచు నిట్లనియె :

"వేల్పులారా! మీరు యజ్ఞమున హవిర్భాగములఁ గోరునట్టి నాకు హవిర్భాగంబుల నేర్పఱుపరైతిరి గావున శ్రేష్ఠములయిన మీ శిరంబుల నీ వింటితోఁ ద్రుంచెదను." అని యీశ్వరుఁడు చెప్పెను. మునిశ్రేష్ఠా, యీ మాటలు విని దేవతలు దిగులుపడి, శంకరుని బొగ డఁగా, నతఁడు ప్రీతినొంది, యీ వింటి నామహాత్ములగు దేవతల కొసం గెను. ఆ దేవదేవునిది యైనయీధనుస్సును బూర్వము మావంశీయుఁ డగు దేవరాతునకు దేవత లొసంగిరి. కావున నో ప్రభూ, యీశ్రేష్ఠ మైన విల్లు దేవదేవుఁడయిన శంకరునిది. ఇది మావంశమునఁ బెద్దలలోని వాఁడయిన దేవరాతునియొద్ద నాశంకరునిచే నిల్లడగా నుంచఁబడినది. దాని సంగతి యటుండనిమ్ము.

పిమ్మటఁ గొంతకాలమునకు యజ్ఞశాలనిమిత్తమయి భూమినిదున్ను చుండఁగా, నాగలికిఁ దగిలి యొకకన్యక పైకి లేచినది. దున్నునప్పుడు నాఁగటిచాలున దొఱకుటచే నేనాకన్యకకు సీత యని పేరిడితిని. భూమి నుండి నాయింటికిఁ గొనితెచ్చి, కన్నకూఁతునువలెనె పెంచితిని. అట్లుపుట్టిన యీకన్నియను మనుజుల యోనియందుఁ బుట్టినదికాదు గాన నీకన్యక

నెక్కువ వీర్యముగల రాజున కీయవలసినది యని నిశ్చయించితిని. ముని శ్రేష్ఠా, భూమినుండి పుట్టి పెరుగుచున్న యీ నాకన్యకను బెండ్లాడఁ గోరి యనేకులు రాజపుత్త్రులు వచ్చిరి. ఓ భగవంతుఁడా! ఆ వచ్చిన రాజుల కందఱికి, 'ఈ కన్య వీర్యమే సుంకముగాఁగలది. ఏ రాజపుత్త్రుఁ డెక్కువ వీర్యవంతుఁడో, వాని కీ కన్య నిత్తు'నని నేను జెప్పిపంపుచుంటిని. అంతట నాన్నృపాలు రందఱు గుమిగూడి, మిథిలాపురికి వచ్చి తమ వీర్యమును దెలిసికొనఁగోరఁగా వారి కీ ధనుస్సు తెప్పించి చూపఁబడెను. అంత నారాజులంద ఱా ధనువెత్తలేకపోయిరి. ఎత్తలేకపోయినను కదలింపనైనఁ జాలకపోయిరి. అందుచే మునీంద్రా, వీర్యవంతులైన యా రాజపుత్త్రులవీర్యము స్వల్పమని తెలిసి, వారినందఱిని బోయి రమ్మంటిని. మునిశ్రేష్ఠుఁడా, రాజపుత్త్రు లందఱు వీర్యవిషయమున సంశయము గలవారగుటచే నందఱు గలిసి, మహాకోపముతో మిథిలాపురమును ముట్టడించిరి. వారు తమకుఁ గన్యక నీయక నేను దిరస్కరించినాఁడ నను సంగతిని గనుఁగొని, యత్యాగ్రహము గలవారయి, మిథిలాపురమునందలి జనులను దొందర పెట్టిరి.

అట్లు వారొక సంవత్సరకాలమువఱకు నాపట్టణమును ముట్టడించి, సేనలను నుగ్గుసేయుచు, జనులను బాధించుచున్నందున, యుద్ధసాధనము లన్నియు నశించిపోయిన 'మనగతి యింక నేమి' యని మిక్కిలి వ్యసనపడి, దేవతల నందఱఁగూర్చి తపస్సుసేసి, వారిని సంతోషపఱచి, వారి వలనఁ జతురంగములు గలసేనలను బడసితిని. ఆసేనలు నా పట్టణమును ముట్టడించియున్న రాజపుత్త్రుల నెదిర్చి నుగ్గునూచముగఁ బడఁ దన్నినవి. అప్పుడు చెడ్డవారయిన రాజపుత్త్రు లంద ఱిదివఱకు వీర్యవిషయమున సందియముగలవారైయున్నను, నిప్పుడు వీర్యము లేనివారై, తమ మంత్త్రులతో నానాదిక్కులకుఁ బరుగెత్తిరి. గొప్పవ్రతము లొనర్చినవాఁడవగు మునీంద్రా, మిక్కిలి ప్రకాశమానమైన యీ ధనుస్సే యిది. దీనిని రామలక్ష్మణులకు సయితము చూపెదను. ఈదశరథపుత్త్రుఁడయిన రాముఁ డీధనుస్సును వంచి, యెక్కుపెట్టునేని, యీరామున కీయయోనిజయగు నా కూఁతును సీత నిచ్చెద"నని జనకమహారాజు విశ్వామిత్త్రమునీంద్రునితోఁ జెప్పెను.



శ్రీరాముఁడు శివుని వింటిని ద్రుంచుట. బా—165

## 67 - వ సర్గము.

### శ్రీరాముఁడు శివుని వింటిని ద్రుంచుట

విశ్వామిత్రమహాముని జనకమహారాజుమాటవిని, "మహారాజా, శ్రీరామున కావింటిని జూపు"మని చెప్పెను. వెంటనే జనకమహారాజు మంత్రులను బిలిచి, "మీరు పట్టణములోనికిఁ జని, గంధము, పూలు మొదలగు వానిచే నలంకరింపఁబడియున్న దేవతలవయిన ధనుస్సును దెండని యుత్తరువు చేసెను. ఇట్లు జనకనృపాలుఁ డానతీయఁగా, మంత్రు లందఱు రాజు నుత్తరవుప్రకారము వింటిని దమ ముందెత్తించి కొని, తాము వెనుకప్రక్కన నడచివచ్చిరి. మిక్కిలి పొడుగైనవారును, బలశాలులునైన యైదువేలమంది యా విల్లుంచియుండు నెనిమిది చక్రములు గల పెట్టెను గొనివచ్చిరి. అట్లు మంత్రులు ధనుస్సుంచిన యినుప పెట్టెను దెప్పించి దేవతలనుబోలు మిథిలాపురీశుఁడగు జనకమహారాజు చూచి, "రాజేంద్రా, రామునికిఁ జూపుటకై మీరు తెమ్మనినదియు సకల రాజులచేతను బూజింపఁబడినదియు, రమణీయమును నగు ధనుస్సును దెచ్చితిమి. ఇదిగో చిత్తగింపుఁడు" అని రాజు ముందట నిలిపిరి. జనక నృపాలుఁడు వారిమాటల విని, చేతులు జోడించి, విశ్వామిత్రమహా మునిని, రామలక్ష్మణులను జూచి యిట్లనిరి.

"ఓ బ్రహ్మజ్ఞానీ! ఇదిగో ధనుశ్శ్రేష్ఠము. దీనిని జనకవంశమునఁ బుట్టిన పరాక్రమవంతులగు రాజులందఱు వంచి యెక్కుపెట్టఁజాలక, పూజించుచుండిరి. దీనిని వంచుటకు దేవత లందఱును జాలరు. అసురులును జాలరు. రాక్షసులును జాలరు. గంధర్వ, యక్ష, కిన్నర, పన్నగులును జాలరు. వారికే సాధ్యపడనపుడు మనుష్యులు దీని నెక్కిడుట యెక్కడిమాట? దీని నెక్కిడుటయందుఁగాని, యీడ్చుటయందుఁ గాని, కదలించుటయందుఁగాని, పొరలించుటయందుఁగాని వారికి శక్తియే లేదు. మునిశ్రేష్ఠా, శ్రేష్ఠమయిన ఈ ధనుస్సును దెప్పించితిని. మహాత్మా, దీని నీ రాజపుత్రులకుఁ జూపుఁడు" అని జనకమహారాజు విశ్వామిత్రమహామునితోఁ జెప్పెను. అంత ధర్మములు నడపు స్వభావముగల విశ్వామిత్రుఁడు జనకనృపాలుని మాటను విని, "నాయనా, రాముఁడా, ధనుస్సును జూడు" మని రామునితోఁ జెప్పెను.

రాముఁడును బ్రహ్మర్షియగు విశ్వామిత్రుని మాట విని, ధనుస్సుంచియుండు పెట్టెను దెఱచి, ధనుస్సును బాఱఁజూచి, విశ్వామిత్రునిం జూచి, "ద్విజోత్తమా! మీయెదుటనె యీ ధనుశ్శ్రేష్ఠమును జేతితోఁ దాఁకి, దీనిని వంచుటకైనను, ఎక్కుపెట్టుటకైనను జాలుదునేమో ప్రయత్నపడి చూచెదను" అని యడిగెను. అందులకు జనకమహారాజును, విశ్వామిత్రమునియు 'సరి' యని సమ్మతించిరి.

విశ్వామిత్రమహాముని నోటినుండి మాట వచ్చినంతనే రాముఁడా ధనుస్సును సులువుగా నడుమఁ బట్టుకొనెను. అట్లు పట్టి పైకెత్తి వేలకొలఁది జనులు చూచుచుండ నా ధనుస్సును వేడుకతోడఁబోలె వంచి యల్లెత్రాటఁ గట్టెను. ధర్మపరుఁడయిన కీర్తిమంతుఁడగు రాముఁడిట్లు ధనుస్సును వంచి మోపెట్టి, బాణమును సంధించెను. అప్పుడా ధనుస్సు నడిమికి విఱిగెను. అది విఱుగునప్పుడు పిడుగుపడినప్పుడువలె గొప్ప ధ్వని గలిగెను. గొప్ప కొండ బ్రద్దలగునప్పుడువలెనె భూమి యదరెను. విశ్వామిత్రుఁడు, రామలక్ష్మణులు, జనకమహారాజు దప్పఁ దక్కినవారందఱును నా ధ్వని విని గుండె లదరి మూర్ఛిల్లిరి.

కొంతసేపటికి జనులందఱు తెప్పిరిల్లి కలఁకదేఱినంతనే, మాట్లాడ నేర్పుగల జనకుఁడు దిగులు దీఱినవాఁడై, చేతులు జోడించి, మునీంద్రునిం జూచి, "ఓ భగవంతుఁడా, దశరథుని పుత్రుఁడయిన రాముని వీర్య మిట్టిదని కనుఁగొంటిని. శివునివిల్లు ద్రుంచువాఁడొక్కఁడుండు నని నేను గలలోనైనఁ దలంపనైతిని. ఈరాముఁడు బాలుఁడయ్యు నింతపని చేయుట మిక్కిలి వింతగా నున్నది. దేవతలకుఁగూడ నీ విల్లు వంచుట యసాధ్యమయియుండెఁ గాన దీని నీ రాముఁడు విఱుచు నని మనస్సునఁగూడ నెంచలేదు. ఈ రాముని జూచిన పిదపఁగూడ నితఁడు బాలుఁడుగా నుండుటంబట్టి యితఁడు దీనిని విఱుచు నని యూహింపను లేదు. నాపుత్రికయగు సీత దశరథుని కొమరుఁడగు నీ రాముని భర్తనుగాఁ బొంది, జనకులవంశమునకుఁ గీర్తి తేనున్నది. కౌశికమునీ, "యీ కన్యను శౌర్యమె యుంకువగాఁగొని యిచ్చెద"నని ప్రతిజ్ఞ చేసితిని. అది నెఱవేఱినది. నా ప్రాణములకంటె హెచ్చుగాఁ జూచుచుఁ బెంచిన నా కూఁతురగు సీత రామున కీయఁదగినది. కావున తమ రాన

త్తెత్తురేని, నా మంత్రుల నయోధ్యాపురమునకుఁ బంపెదను. వారు రథము లెక్కి వేగిరముగాఁ బోవుదురు. నా మంత్రులు సవినయముగా నిచ్చటి వృత్తాంతము లెల్లను, ముఖ్యముగా శివునివిల్లు ద్రుంచి తన వీర్యము చూపువానికి జనకుఁడు దన కూఁతు నిచ్చునట్లు ప్రతిజ్ఞచేసె ననియు, రాముఁ డా వింటిని ద్రుంచెను. గాన నతనికి సీతనిచ్చి పెండ్లి చేయఁ గోరుచున్నాఁ డనియు, రామలక్ష్మణులు విశ్వామిత్రునియొక్క రక్షణమున సుఖముగా నిచ్చటికి వచ్చియున్నా రనియుఁ, దమరినిఁ బిలుచుకొనిరం డని యానతీయఁగా వచ్చితి మనియుఁ జెప్పి, దశరథ నరేంద్రుని నిచ్చటికిఁ దోడితెత్తురు" అని చెప్పెను. విశ్వామిత్రుఁడును "నట్లె కాని" మ్మని చెప్పెను.

వెంటనే ధర్మముఁ దప్పనివాఁడగు జనకమహారాజు మంత్రులను బిలిచి, వారిచేత శుభలేఖల నిచ్చి, "యో మంత్రులారా, మీ రిచ్చటి సంగతులనంతయు విస్తరించి చెప్పి, దశరథుని బిలిచికొనిరం"డని యయోధ్యాపురమునకుఁ బంపెను.

## 68-వ సర్గము.

### జనకుఁడు మంత్రులచే దశరథుని బిలిపించుట

జనకమహారాజి ట్లానతియొసఁగఁగా, నా దూతలు పయనమై, గుఱ్ఱము లలసినందున, దారిలో మూఁడు రాత్రులు మూఁడు మజిలీలుచేసి, నాలవదిన ముదయమున నయోధ్యాపురిఁ బ్రవేశించిరి. అట్లు పట్టణము చొచ్చి, రాచనగరునకుఁ బోయి, ద్వారమున నున్న కావలి వాండ్రను జూచి, "ద్వారపాలకులారా, మిథిలాపురీశుఁడగు జనకమహారాజుకడనుండి దూతలముగ మేము వచ్చియున్నార మని మీరాజునకుఁ దెల్పుఁడు" అని చెప్పిరి. ద్వారపాలురును దూతలు చెప్పినమాటలను రాజుగారి సముఖమున మనవిచేయఁగా, దశరథుఁడును 'వారిని లోనికిఁ బిలిచికొనిరం'డని ద్వారపాలురతోఁ జెప్పిపంపెను. ఆ కావలివారు వారికిటకిఁ బోయి, 'మీరు లోపలికిఁ బొండు. రాజుగారి యానతి యయ్యె' నని చెప్పిరి. ఆ ద్వారపాలురమాటఁ గైకొని, వారు చూపిన దారిని దూతలు లోపలికిఁ బోయి, దేవతలవలె వెలుఁగుచున్న ముదుసలియైన దశరథనృపాలునిఁ జూచి, చేతులు జోడించుకొని, భయంబు

విడిచి, పరిశుద్ధులై ధైర్యముతో మనోహరములగు మాటలతో నీ తీరునఁ జెప్పిరి.

"మహారాజా! మిథిలాపురాధీశుఁడగు జనకమహారాజు మిమ్ము లను జూచి, 'తమరు కుశలమా? తమ యగ్నిహోత్రకార్యములు చక్కఁగా జరుగుచున్నవా? తమ యుపాధ్యాయులు, పురోహితులు వారివారి పనులు చక్కఁగా జరుపుచు క్షేమముగా నున్నారా?' యని ప్రీతిపూర్వకములైన మాటలచే మాటిమాటికి నడుగఁగోరిరి. అంతియ కాక, మిథిలానాయకుఁడయిన జనకమహారాజు విశ్వామిత్రుని యను మతిని బడసి మిమ్ముఁగూర్చి యొకమాట చెప్పుమనిరి. అదేది యనఁగా; 'నా కొమార్తెయగు సీతను వీర్యముఁగలవానికే యిచ్చెదను' అని నేను మున్ను చేసిన ప్రతిజ్ఞయు, 'రాజులందఱు కోపముతో నా పట్టణంబు ముట్టడించి, వీర్యము లేమిచే నోడిపోయి రనునదియు తమ రెఱిఁగినదియె కదా! దశరథమహారాజా, తమ కుమారుఁడగు రాముఁడు విశ్వామిత్రుని తోడ దైవికముగా వచ్చి యీ నాకూఁతును జయించెను. మహారాజా, పసివాఁడయినను బలశాలియగు తమ పుత్త్రుఁడయిన రాముఁడు పలువురు జనులసమక్షమున నా ధనుస్సును విఱిచెను. కావున రాముఁడు దేవత లకుఁగూడ నెత్త నలవిగాని ధనుస్సును విఱుచుటచే, నితఁడు మహా వీర్యముగలవాఁడని తెలియవచ్చెను. నేను నా కూఁతును వీర్య మెక్కువఁ గలవానికే యిత్తు నని ప్రతిజ్ఞ చేసియుంటిని గాన రామునకు సీత నీయఁ దలఁచియున్నాను. తమ రనుగ్రహింపవలయును. మహారాజా! తమరు పురోహితులను, నుపాధ్యాయులను వెంటఁబెట్టుకొని, శీఘ్ర ముగా దయచేయవలయును. తమకు శుభ మగును. రామలక్ష్మణులను జూచి నాకుఁ బ్రియముఁ జేకూర్చి తమకుమారుల కల్యాణోత్సవము వలనఁ దాముసు సంతోషమును బొందనే పొందుదురు." అని జనక మహారాజు విశ్వామిత్ర శతానందుల యానతిం బడసి, మీతోఁ దిన్నని యింపుమాటలతోఁ జెప్పెను. మహాప్రభూ! పైనఁ దమచిత్తము" అని చెప్పిరి.

దశరథమహారాజును దూతలు చెప్పిన యా మాటలను విని, పరమ సంతోషమునొంది, గురుపాటులతోఁగూడినవాఁడై, తన గురువు

లగు వసిష్ఠ వామదేవులను, మంత్రుల నందఱిఁ బిలిచి, "కౌసల్యయొక్క సంతసము వృద్ధిచేయునట్టి యీ మన రాముఁడు విశ్వామిత్రుని రక్షణములో నుండుచుఁ, దమ్ముఁడగు లక్ష్మణునితోఁగూడ విదేహదేశము నందున్నాఁడు. జనకమహారాజు రాముని వీర్యమును గనిపెట్టినవాఁడై, రామునికిఁ దనకూఁతురగు సీత నిచ్చెద నని చెప్పి పంపినాఁడు. మహాత్ముఁడగు జనకుని నడవడి మంచిదనియు, మనము వారితో వియ్యమందుట యుక్తమనియు మీకుఁ దోఁచెనేని, మనము జాగుసేయక యచ్చటికిఁ బోదము" అని చెప్పెను. మంత్రులును, పురోహితులును, "మహారాజా మనకు జనకమహారాజతోడి సంబంధము మిక్కిలితగియున్నది" యని రాజుతోఁ జెప్పిరి. దశరథమహారాజు దన మంత్రుల యంగీకారమును బడసి, కడు సంతసించి, "రేపు బయలుదేఱుదము. ప్రయాణసన్నాహము సేయుఁ" డని తన మంత్రులతోఁ జెప్పి, మంత్రుల కుండవలసిన యన్ని గుణములతోఁ గూడియున్న జనకమహారాజుగారి మంత్రులకు సకలవిధంబుల మర్యాదల జరిపెను. ఆ జనకనృపాలుని మంత్రులును ఆ మర్యాదలం బొంది, సంతోషభరితులయి, యారాత్రి యచ్చట గడపిరి.

## 69-వ సర్గము

### దశరథుఁడు మిథిలాపురంబునకు వచ్చుట

అంతట నారేయి గడచి తెల్లవాఱఁగనే దశరథుఁ డుపాధ్యాయులను బంధువులను, మంత్రులను రప్పించి, సంతోషముతోఁ గూడినవాఁడై, సుమంత్రుఁడను మంత్రిని జూచి, "మంత్రిశ్రేష్ఠా, యిప్పుడు మొదలుకొని మన బొక్కసదారులందఱు పుష్కలముగ ధనమును, నానావిధములగు రత్నములను దీసికొని తగిన గావలి పెట్టికొని ముందుపోవలయును. మన చతురంగబలమంతయు వేగముగ ముందు బయలుదేఱు నట్లానతిమ్ము. నాయుత్తరవుతోడనే శ్రేష్ఠములయిన గుఱ్ఱములఁ గట్టిన తేరి నాయితపఱుపుము. వసిష్ఠ, వామదేవ, జాబాలి, కాశ్యపులును, చిరంజీవియగు మార్కండేయమహర్షియుఁ, గాత్యాయన మహర్షియు ననువీరందఱు ముందుగా బయలు వెడలుదురుగాక! ఈ జనకుని దూతలు నన్ను వేగిరపఱచుచున్నారు గావున నెట్లు తామసముగా కుండునో యట్లు త్వరితముగ నాకు రథము నాయితపఱుపుము" అని

చెప్పెను. వెంటనే సుమంత్రుఁడు మహారాజునానతిప్రకారము బొక్కస దారులను బంపి, సేనలనన్నిటిని క్షణములో ముందు బయలుదేఱునట్లు చేసెను. అట్లు బయలుదేఱిన సైనికులును ఋషులతోడఁ బోవుచుండు దశరథమహారాజును వెంబడించి పోయిరి. ఇట్లు దశరథనృపతి బయలు వెడలి నాలుగుదినములకు మిథిలఁ జేరెను. జనకమహారాజు దశరథుని రాక విని యెదురుగాఁ బోయి వృద్ధుఁడగు నమ్మహారాజును బూజించి పరమానందభరితుఁడై యిట్లు పలికెను. "మహారాజా! మీ కిదే స్వాగతము. దైవయోగమున మాయింటికి దయచేసితిరి. తమపుత్రు లిర్వురు పరాక్రమముచే సంపాదించిన ప్రీతిని తమరు పొందఁగలరు. సకల దేవతలచేతను వెంబడింపఁ బడినవాఁడై దేవేంద్రుండు వచ్చునట్లు పూజ్యుఁడయిన వసిష్ఠమహర్షియు వేదవిదులయిన బ్రాహ్మణశ్రేష్ఠులతోఁగూడి నా భాగ్యవశముననే యిచ్చటికి వచ్చెను. అదృష్టవశముననె యన్ని విఘ్నములు దొలఁగినవి. అదృష్టముచేతనే వీర్యవంతులలో గొప్పవారగు మహాత్ములయిన రఘువంశోద్భవులగు నృపులతో సంబంధము గలిగినది గావున నా కులంబున కెక్కువ ప్రసిద్ధి వచ్చినది. రాజులకు రాజవయిన దశరథనృపాలా, యీ యజ్ఞము నేటితోఁ బూర్తియగును గాన, రేపటి యుదయమున ఋషి సమ్మతమయిన యీ వివాహము నడిపించవలయును" అని జనకమహారాజు దశరథునితోఁ జెప్పెను.

మాటలాడ నెఱింగిన వారిలో నుత్తముఁడగు దశరథుఁడు జనక మహీవల్లభుఁడు సెప్పినపలుకులు విని ఋషులనడుమ నాజనకనృపాలునిం జూచి "ధర్మముల నెఱిఁగిన జనకనరేంద్రా, 'పుచ్చుకొనుట యిచ్చువారి యిష్టము ననుసరించియుండు' నని పూర్వము నేను పెద్దలు చెప్పఁగా వినియున్నాను. కావున నీ వెట్లు చెప్పెదవో యట్లు మేము చేయుదుము" అని చెప్పెను.

విదేహాధిపతియగు జనకనృపాలుఁడు ధర్మముతోఁ గూడినదియుఁ, గీర్తి నొసంగునదియునైన సత్యవాదియగు దశరథుని మాటలు విని యెక్కువ యాశ్చర్యము నొంది యట్లు చేయుటకు సమ్మతించెను. పిమ్మట ఋషు లందఱు తా మొండొరు లచ్చటఁ గూడినందులకై యెక్కువ సంతోషమును జెందినవారయి యారాత్రి గడపిరి. దశరథుఁడును దన

పుత్త్రులయిన రామలక్ష్మణులను జూచి, పరమానందము నొంది, జనకునిచే మర్యాదలు వడయుచు నా రేయి పరమానందముగా నుండెను. మహా ప్రతాపశాలియుఁ దత్త్వవేత్తయునైన జనకమహారాజు యజ్ఞమును బూర్తిచేసి, కూఁతుండ్రను పెండ్లికూఁతులను చేసి రాత్రిని గడపెను.

70-వ సర్గము.

వసిష్ఠమహాముని రామునివంశావలి వర్ణించి చెప్పుట

పిమ్మట మాటలందు నేర్పరియయిన జనకుఁ డుదయమున లేచి, యనుష్ఠానమునెల్లఁ దీర్చుకొని సకలమహర్షులును చుట్టుకూర్చుండియుండఁ, దన పురోహితుఁడగు శతానందునిఁ జూచి, "ఓ పురోహితోత్తమా, విశేషమగు శాంతిగలవాఁడును, ధర్మములు సల్పుటయం దెక్కువ శ్రద్ధ గలవాఁడును నై కుశధ్వజుఁ డని పేరువడసిన నాతమ్ముఁ డిక్షుమతి యనెడి నదిచేఁ జుట్టఁబడి, శత్రువులు లోపల రాకుండుటకై పాఁతఁ బడిన శూలములతోఁ గూడిన యగడ్తలు గలదై, స్వర్గలోకమువలెను, పుష్పక విమానము వలెను శోభిల్లుచున్న సాంకాశ్యమనెడు పట్టణము నందు నిక్షుమతీనదీజలముఁ ద్రావుచు నుండుట మీకుఁ దెలిసినదయే కదా. ఆతని నే నిప్పుడే చూడఁగోరి యున్నాను. ఆతఁడు నా యాగమునకు సంరక్షకుఁడు. మహా ప్రతాపశాలియైన యా కుశధ్వజుండును నాతోడఁగూడి, యీ పెండ్లి వేడుకయందుఁ బాలుపుచ్చుకొనును" అని చెప్పెను.

ఇట్లు జనకుఁడు చెప్పునపుడు, శతానందుని చేరువఁ గొందఱు చులుకైన పనివారు నిలువఁబడియుండిరి. జనకమహారాజు వారిని జూచి, "వెంటనే పోయి కుశధ్వజుని దోడ్కొని రం" డని యాన తిచ్చెను. వేల్పు లింద్రుని యానతిచేత విష్ణువును దోడ్కొనివచ్చురీతిగాఁ నా జనకునిభటులు వేగముగాఁ బాఱు గుఱ్ఱములమీఁద నెక్కి, నర శ్రేష్ఠుఁడైన కుశధ్వజునిఁ దోడ్కొనిరాఁ బోయిరి. అట్లు వారు పోయి, సాంకాశ్యపట్టణము చేరి, కుశధ్వజ నృపాలుని జూచి నడచిన సంగతి యంతయుఁజెప్పి జనకమహారాజు తలంపును దెలిపిరి.

కుశధ్వజమహీవల్లభుఁడు బలవంతులయిన శ్రేష్ఠులగు దూతల వలన జనకమహారాజు చెప్పి పంపిన మాటను విని, యతని యుత్తరవు

ప్రకారము వెంటనే పయనమై మిథిలకు వచ్చి శతానందునకును, ధర్మమునందే నిలుకడగల జనకమహారాజునకును నమస్కరించి, రాజులు గూర్చుండఁ దగినదియు, మిక్కిలి శ్రేష్ఠమైనదియునైన యాసనంబునఁ గూర్చుండెను. ఇట్లు ప్రతాపముగలవారును, శూరులునైన యా యన్నదమ్ములగు జనకకుశధ్వజమహారాజు లిరువురును గూర్చుండి తమ మంత్రులలోఁ బ్రధానుఁడయిన సుదామునుని బిలిచి, "మంత్రిశ్రేష్ఠా, యిక్ష్వాకువంశమునఁ బుట్టినవాఁడును, నెక్కువ పరాక్రమశాలియు, శత్రువులకు లొంగనివాఁడునైన దశరథనృపాలుని నతని కొడుకులతోఁ గూడను, మంత్రులతోఁగూడను, నుపాధ్యాయులతోఁగూడను బిలుచుకొనిరమ్ము" అని యానతిచ్చిరి. సుదామునుఁడా యానతినిఁగొని, దశరథుఁడు దిగియున్న విడిది కేఁగి, రఘుకులమునకు వన్నెదెచ్చు దశరథమహీకాంతునికి మ్రొక్కి, "శూరుఁడవగు నయోధ్యాధిపతీ, మిథిలాపురీశుఁడగు జనకనృపాలుఁడు తమరిని తమ పుత్రులతోను, నుపాధ్యాయులతోను, బురోహితులతోను, మంత్రులతోఁగూడను బిలుచుకొని రమ్మని యానతిచ్చెను. ప్రభువులవారిచిత్తము" అని చెప్పెను.

దశరథమహీకాంతుఁడును, మంత్రిశ్రేష్ఠుని మాటలు విని, ఋషులను, బంధువులను గూడఁ దోడ్కొని, జనకమహారాజుండెడు చోటికి కేతెంచెను. అట్లుపాధ్యాయ బంధు మిత్ర పురోహితుల తోడ నేతెంచి, మాటాడు నేర్పు గలవారిలో శ్రేష్ఠుఁడయిన దశరథుఁడు జనకమహారాజుం గూర్చి "మహారాజా! త్రికాలజ్ఞానియగు వసిష్ఠమునీంద్రుఁ డిక్ష్వాకువంశమునకుఁ గులదైవ మనియు, సకల కార్యములందును నతఁడు ముందు నిలిచి మాట్లాడువాఁ డనియు, మీకుఁ దెలిసినదియేకదా. తన ధర్మములను దప్పక నడపువాఁడయిన యీ వసిష్ఠమునీంద్రుఁడు విశ్వామిత్రుని యంగీకారముఁ బడసి, మహర్షులందఱు చుట్టు గూర్చుండి వినుచుండఁగాఁ గ్రమముగ నన్నిసంగతులను జెప్పెను" అని చెప్పెను.

నరశ్రేష్ఠుఁడయిన దశరథుఁడు బలశాలులగు రాజులనడుమ నివ్విధమునఁ బలికి, యూరకుండఁగా మాటలందు నేర్పరియైన భగ

వంతుఁడగు వసిష్ఠమహాముని జనకమహారాజునుగూర్చి యతని పురో హితుఁడు వినుచుండ నిట్లనియెను.

పరబ్రహ్మ మెవరినుండి పుట్టినది తెలియదు. ఆయన యెప్పటికి నుండువాఁడు; నిత్యుఁడు; నాశరహితుఁడు. ఆతనివలన మరీచి పుట్టెను. మరీచికిఁ గాశ్యపుఁడు పుట్టెను. కాశ్యపునివలన వివస్వంతుఁడు (సూర్యుఁడు) పుట్టెను. ఆ వివస్వంతునికి మనుచక్రవర్తి జన్మించెను. మనువు తొల్లి జనుల కెల్ల నధిపతిగా నుండెను. ఇక్ష్వాకువు మనువు యొక్క కుమారుఁడు. ఇక్ష్వాకు మహారాజే యయోధ్యానగరంబునకు మొదటి రాజని యెఱుఁగుము. ఇక్ష్వాకువునకుఁ గాంతిమంతుఁడైన కుక్షి యనురాజు జన్మించెను. కుక్షికి వికుక్షి యను శ్రీమంతుఁడగు కుమారుఁడు పుట్టెను. వికుక్షికి మితిమీఱిన కాంతియు, విశేష ప్రతాపమును గలవాఁడయిన బాణుఁడు పుట్టెను. బాణునకు ప్రతాపవంతుఁడగు ననరణ్యుఁడు పుట్టెను. ఆనరణ్యునివలనఁ బృథువు పుట్టెను. త్రిశంకువు పృథువుయొక్క కొమారుఁడు. త్రిశంకువునకు గొప్ప కీర్తిగల దుందుమారుఁడు పుట్టెను. అతనికే యువనాశ్వుఁ డని మఱియొక పేరును గలదు. ఆ యువనాశ్వునికిఁ జక్రవర్తియగు మాంధాత పుట్టెను. మాంధాతకు సంపదగల సుసంధి యనుకొమరుఁడు పుట్టెను. సుసంధికి, ధ్రువసంధి, ప్రసేనజిత్తు ననెడి యిరువురు కొడుకులు పుట్టిరి. ధ్రువసంధికి భరతుఁ డని పేరు వడసిన కుమారుఁడు పుట్టెను. భరతునివలన మహాతేజముగల యసితుఁడు పుట్టెను. ఆ యసితునికి హైహాయులు, తాలజంఘులు, శూరులగు శశిబిందువులును శత్రువులై యాతని పట్టణమును ముట్టడించిరి. అపు డసితుఁడు వారి నెదురుతాఁకి యుద్ధము సేయఁబోఁగా, వారందఱు గూడి యా యసితుని నూరినుండి వెడల నడఁచిరి. అసితుఁడు బలహీనుఁ డగుటం జేసి, తన యిరువురు భార్యలతోను, మంత్రులతోను గూడి, హిమవత్పర్వతముఁ జేరి, యచ్చట భృగుప్రస్రవణమను శిఖరమున నివసించుచుండెను. ఆ యసితుని భార్య లిరువురు గర్భముఁ దాల్చియుండిరట. ఆ యిరువురిలో నొకతె తన సవతియొక్క గర్భము కరఁగిపోవుటకై విషముతోఁగూడిన యొక భక్ష్యము నొసఁగెను. ఆ సమయమున భృగువంశమునఁ బుట్టిన చ్యవనుఁ

డను మహాముని మనోహరమయిన పర్వతశ్రేష్ఠమగు హిమవత్పర్వతము నకు వచ్చెను. అప్పు డసితుని భార్యలలో విషమును భక్షించిన భాగ్య శాలినియుఁ, దామరపూవుల తేకులంబోలిన కన్నులుగలదియు నైన కాళింది దాను పుత్త్రునిఁ బడయఁగోరి, వేల్పులవలె వెలుఁగుచున్న యా చ్యవనమహామునిని సమీపించి నమస్కరించెను. అప్పుడు చ్యవన మహాముని పుత్త్రునిగోరి తనకు మ్రొక్కిన కాళిందితో "ఓ భాగ్య వంతురాలా, మిక్కిలియెక్కువ బలిమియును, మగటిమియుఁ, గాంతియుఁ గలవాఁడగు నొక మంచి పుత్త్రుఁడు త్వరలో నీకుఁ బుట్టఁగలఁడు. అతఁడు విషముతోఁగూడఁ బుట్టును. కమలములంబోలు కన్నులు గలదానా, నీవు వ్యసనపడకుము" అని చెప్పెను. పతివ్రతయు, రాజ పుత్త్రియునైన యా యసితుని పట్టంపుదేవి యా చ్యవనునికి మ్రొక్కి, భర్తృవియోగ దుఃఖముచే నొచ్చినదై, యా చ్యవనుని యనుగ్రహము వలన నొక పుత్త్రునిఁ గనెను. గర్భమును బోఁగొట్టవలె నని యామె సవతి గరళము పెట్టి యుండుటచే నాశిశు వాగరళముతోఁ గూడఁ బుట్టి నందువలన నతఁడు సగరుఁడను పేరఁ బరగెను. ఆ సగరున కసమంజుఁడు, ఆ యసమంజునికి నంశుమంతుఁడు పుట్టిరి. ఆ యంశుమంతునివలన దిలీ పుఁడు పుట్టెను. దిలీపుని పుత్త్రుఁడు భగీరథుఁడు. భగీరథునికి కకు త్స్థుఁడు పుట్టెను. కకుత్స్థునికి రఘుమహారాజు పుట్టెను. రఘువునకుఁ గల్మాషపాదుఁడనువాఁడు పుట్టెను. ఇతఁడు మొదటఁ బ్రవృద్ధుఁడని పేరు గలిగియుండెను. పిదప వసిష్ఠుని శాపమువలన రాక్షసరూపమును బొంది, పురుషాదుఁడనెడి పేరు గలిగినవాఁ డాయెను. మఱల వసిష్ఠునికిఁ బ్రతి శాపం బిచ్చుటకై చేత జలమును గైకొని, భార్య యోదార్చినమీఁదట నా జలమును దన పాదములపై బోసికొనుటచే నాతఁడు కల్మాష పాదుఁడు (కశ్మలములైన పాదములు గలవాఁడు) ఆయెను. ఆ కల్మాష పాదునికి శంఖణుఁ డనెడువాఁడు పుట్టెను. శంఖణునికి సుదర్శనుండు జనించెను. ఆ సుదర్శనునికి నగ్నివర్ణుఁ డనెడివాఁడు పుట్టెను. అగ్నివర్ణునికి శీఘ్రగుఁడు, ఆ శీఘ్రగునికి మరువును, మరువునకుఁ బ్రశుశ్రుకుఁడును, బ్రశుశ్రుకునికి నంబరీషుఁడును పుట్టిరి. అంబరీషునికి భూమండల మెల్ల నేలిన నహుషుఁడు పుట్టెను. ఆ నహుషునకు యయాతి పుట్టెను.

నాభాగుఁడా యయాతికిఁ బుట్టెను. నాభాగుని కజుఁడను పుత్త్రుఁడు పుట్టెను. అజునివలన దశరథుఁడు పుట్టెను. ఈ దశరథునివలన నీ రామలక్ష్మణులను సోదరులు పుట్టిరి. వంశము మొదటినుండి పరిశుద్ధులును, ఎక్కువ ధర్మాత్ములును, ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవారును, శూరులును, సత్యముఁ దప్పనివారును నైన రామలక్ష్మణుల నిమిత్తమై నీ కూఁతులను వరించెదను. రూపలావణ్యములు గలిగియుండు నీ రాజపుత్త్రులకు సమానమయిన రూపలావణ్యములుగల నీ కూఁతుల నిద్దఱిని నిమ్మని వసిష్ఠమహాముని జనకమహారాజుతోఁ జెప్పెను.

## 71-వ సర్గము.

### జనకుఁడు తన వంశావళిఁ జెప్పుట

ఇట్లు చెప్పు వసిష్ఠమునీంద్రునితో జనకనృపాలుఁడు చేతులు జోడించుకొని యిట్లనెను: 'మహాత్మా, తమకు మేలయ్యెడు. మా వంశావళిని సయితము దెలిపెద నాలకింపుడు. మునీంద్రా, కన్యాదాన సమయమున రెండువంశములవారును నాయా కులములవారి వంశావళిని చెప్పవలసినదియేకదా. కావున మహామునీ! మా వంశావళిని జెప్పెద నాలకింపుడు.

మిక్కిలి ధర్మాత్ముఁడును, సకల ప్రాణులలో నుత్తముఁడునునైన నిమి యనుచక్రవర్తి తన పుణ్యకార్యములచే మూఁడులోకములందుఁ బ్రసిద్ధుఁడయి యుండెను. అతనికి మిథియను నొకకుమారుఁడు పుట్టెను. ఆమిథియే యీ మిథిలాపురి నిర్మించిన రాజు. అతఁడె మొదటి జనకుఁడు. ఆమిథికి నుదావసుఁ డనునతఁడు జన్మించెను. ఆ యుదావసునికి ధర్మాత్ముఁడైన నందివర్ధనుఁడను నృపాలుఁడు పుట్టెను. నందివర్ధనునకును సుకేతుఁడను వాఁడు జన్మించెను. సుకేతునికి ధర్మాత్ముఁడును, బలవంతుఁడునైన దేవరాతుఁడు జన్మించెను. దేవరాతుఁడను రాజర్షికి బృహద్రథుఁడనువాఁడు జన్మించెను. బృహద్రథునికి ధైర్యప్రతాపములు రెండును గలవాఁడగు మహావీరుఁ డనువాఁడు పుట్టెను. మహావీరునికి శ్రేష్ఠములయిన ధైర్యసాహసములు గల సుధృతి యను పుత్త్రుఁడు జన్మించెను. సుధృతికి ధర్మబుద్ధిగలిగి, వాని నడవడియందుఁ బట్టుదలగలవాఁడగు ధృష్టకేతువు పుట్టెను. ఆరాజర్షియగు ధృష్టకేతువునకు హర్యశ్వుఁ డని ప్రసిద్ధికెక్కిన

నృపాలుఁడు జన్మించెను. ఆ హర్యశ్వునకు మరువు పుత్త్రుఁడు. ఆమరువు యొక్క పుత్త్రుఁడు ప్రతింధకుఁడు. ఆ ప్రతింధకునకు ధర్మము నడపువాఁడగు కీర్తిరథుఁడు జన్మించెను. కీర్తిరథుని కుమారునిపేరు దేవమీఢుఁడు. దేవమీఢునికి విబుధుఁడు, విబుధునికి, మహీధ్రకుఁడు జన్మించిరి. మహీధ్రకునికి మహాబలుఁడగు కీర్తిరాతుఁడను నతఁడు జనించెను. రాజర్షియగు కీర్తిరాతునికి మహారోముఁడు పుట్టెను. మహారోమునికి ధర్మాత్ముఁడైన స్వర్ణరోముఁ డనువాఁడు జన్మించెను. రాజర్షియగు స్వర్ణరోమునికి హ్రస్వరోముఁడు జన్మించెను. మహాత్ముఁడును, ధర్మముల నెఱిఁగినవాఁడు నైన యా హ్రస్వరోముని కిరువురు పుత్త్రులు జన్మించిరి. వారిలోఁ బెద్దవాఁడను నేను. నా తమ్ముఁడయిన శూరుఁడగు కుశధ్వజుఁడు రెండవవాఁడు. మాతండ్రి పెద్దవాఁడయిన నాయందు రాజ్యము నుంచి, కుశధ్వజుని బోషించు భారమును నావశంబున నప్పగించి, తా నడవికిఁ జనెను. ముసలివాఁడయిన మాతండ్రి స్వర్గస్థుఁడు కాఁగా నేను దేవతలకు సాటివచ్చు తమ్ముఁడగు కుశధ్వజుని బ్రేమతో జూచుచు రాజ్యమును న్యాయముతోఁ బాలించుచుంటిని. అంతటఁ గొంత కాలము గడచిన పిమ్మట సాంకాశ్యపురమునుండి శూరుఁడయిన సుధన్వుఁడు మిథిలాపురమును ముట్టడింపఁగోరి, మిథిలపై కెత్తి వచ్చెను. ఆ సుధన్వుఁడు నాయొద్దనుండు శివునివింటిని, సీతను దన కిమ్మని చెప్పి పంపెను. నే నతనికి నా రెంటి నీయకపోవుటచే మాకు గొప్ప యుద్ధము జరిగినది.

ఓ బ్రహ్మర్షీ, యా సుధన్వుని నేను యుద్ధరంగమునఁ జంపితిని. మునీంద్రా, ఆ సుధన్వుని సంహరించి సాంకాశ్యపురమునకు శూరుఁడైన కుశధ్వజునికిఁ బట్టము గట్టితిని. మహామునీ, ఈ కుశధ్వజుఁడు చిన్నవాఁడు; నేను పెద్దవాఁడను. మిక్కిలి ప్రీతితో నా యిరువురు కూఁతుల నొసంగెదను. మహర్షీ, తమకు మేలయ్యెడు. సీతను రామునకు, నూర్మిళను లక్ష్మణునికి నొసఁగెదను. వీర్యమె సుంకముగాఁగలదియు, దేవకన్యంబోలునదియు నైన నా కూఁతురగు సీతను, రెండవదియగు నూర్మిళను ముమ్మాటికిఁ నొసఁగెదను. సంశయము లేదు." అని వసిష్ఠ మహామునితోఁ జెప్పి దశరథనృపాలునిం జూచి, "నృపాలా, నేను మిక్కిలి

సంతోషముతో నిండినవాఁడనై, నా యిద్దఱు కూఁతులను తమకుఁ గోడండ్రనుగా నొసఁగెదను. రామలక్ష్మణులచేత గోదానకర్మ నేయింపుఁడు. తమకు మేలయ్యెడుఁగాక. వివాహమున కే జేయవలసిన నాందీశ్రాద్ధమును జరపింపుఁడు. ఈ దినమున మఘానక్షత్రము. ఎల్లుండి శుభము లొసఁగు నుత్తరఫల్గునీనక్షత్రమున వివాహము నడపుదము. శ్రేయస్సుఁగోరి రామలక్ష్మణులచే గోదానాదులగు ననేక దానములను జేయింపుఁడు." అని జనకుఁడు వసిష్ఠ దశరథనృపాలురతోఁ దన వంశావళిని జెప్పి, నిశ్చితార్థమును జేసెను.

## 72 _ వ సర్గము.

### భరతశత్రుఘ్నులకుఁ బెండ్లి నిశ్చయించుట

జనకమహారాజిట్లు వివిధంబునఁ జెప్పి, ముగించినంతటనే, విశ్వామిత్ర మునీంద్రుఁడును వసిష్ఠమహామునియు నా శూరుఁడయిన జనకనృపాలునితో నిట్లనిరి. 'ఓ పురుష సింహుఁడా, ఇక్ష్వాకువంశమును, నిమివంశమును రెండును మిక్కిలి కీర్తిచెందిన వంశములు. అచింత్యమహిమములు. అప్రమేయములు. ఈ రెండువంశములకును సాటివచ్చు వంశము మఱియొకటి లేదు. రామునకు సీతయు, లక్ష్మణునికి నూర్మిళయుఁ దగిన కన్యకలు. అట్లే సీతకు రాముఁడును, ఊర్మిళకు లక్ష్మణుఁడును దగినవరులు. వీరు పరస్పరము రూప సౌందర్యములందు మిగులఁదగియున్నారు. ఈ వివాహసంబంధమును మిక్కిలి తగియున్నది. నరేంద్రా! మే మొక్క మాట చెప్పవలసియున్నది. దానిని వినుము. ఈ నీ తమ్ముఁడగు కుశధ్వజనృపుఁడు ధర్మములను బాగుగా నెఱింగినవాఁడు అట్టి ధర్మాత్ముఁడైన కుశధ్వజమహీంద్రునకు లోకమున సాటిలేని సౌందర్యముఁగల యిరువురు కన్య లున్నారుగదా. మహాసమర్థులయిన భరతశత్రుఘ్నుల నిమిత్త మా కుశధ్వజమహారాజుకూఁతుల నిరువురిని వరింపుచున్నాము. ఈ దశరథునియొక్క పుత్రులగు రామలక్ష్మణభరతశత్రుఘ్నులు నల్వురు సౌందర్యవంతులు. ప్రాయము వచ్చినవారు. దేవేంద్రుఁడు మున్నుగాఁగల లోకపాలురఁ బురుడించువారు. దేవతలతో సాటివచ్చు పరాక్రమము గలవారు. రాజేంద్రా!

నిష్కళంకము లయిన యిక్ష్వాకువంశమును, పుణ్యకర్మములఁ జేయు నీయొక్క వంశమును వియ్యంబు గలవగును గాక."

అని యివ్విధంబున విశ్వామిత్రుఁడును వసిష్ఠుఁడును జేరి చెప్పిన మాటలను విని, జనకమహారాజు చేతులు గట్టినవాఁడై, మునీంద్రులగు విశ్వామిత్రవసిష్ఠులం గూర్చి, "ఓ మునీంద్రులారా! మీ రిరువురు మా కులమునకుఁ దగిన సంబంధమును దామగానే చెప్పుటచే, మా వంశము పావనమయ్యెను. తమ యుత్తరువుచొప్పుననే కానిండు. మీకు మేలు గలుగుఁగాక. కుశధ్వజుని పుత్రికల నిద్దఱిని భరతుఁడును శత్రుఘ్నుఁడును నీ యిరువురును బెండ్లాడుదురుగాక. ఒకదినముననే మహాబలవంతులగు రాజపుత్రులు నల్వురు రాజపుత్రికలను నల్వురిని బెండ్లాడుదురుగాక! బ్రాహ్మణోత్తముఁడవగు విశ్వామిత్రుఁడా, సంతానాధిపతియగు సూర్యుఁ డధిదేవతగాఁగల యుత్తరఫల్గునీ నక్షత్రము నందుఁ బగటిపూఁట వివాహముచేయుట శుభప్రద మని పెద్దలు చెప్పుదురు. కావున నా దినమునందు మనము పెండ్లి జరుపవలయు" నని విశ్వామిత్రునితోఁ జెప్పెను.

ఇట్లు నెమ్మదియైన పలుకులు పలికి జనకమహీంద్రుఁ డాసనము నుండి లేచి, యమ్మునీంద్రుల నిరువురను జూచి, "మునీంద్రులారా! నాకుఁ గన్యాప్రదానరూపమైన యుత్తమధర్మమును జేకూర్చితిరి. మీ కిరువురకు శిష్యుఁడ నైతిని. మునీంద్రులగు మీ రిరువు రీ యాసనోత్తమములపైఁ గూర్చుండుఁడు. మీరే పరిపాలన సేయుఁడు. దశరథుని కీపట్టణ మెట్లో, నా కయోధ్యయు నట్లే. దాన నయోధ్యను నేను మీ కీయవచ్చును. ఇక మీ రీ రాజ్యముల నేలుటకే యభ్యంతరము లేదు. మీరు తగినట్లు చేయవలెను" అనెను.

ఇట్లు విదేహరాజగు జనకుఁడు సెప్పుచుండఁగా, రఘువంశమునకు వన్నెఁదెచ్చిన దశరథుఁడు సంతోషముతోఁ బులకలెత్తిన మేనుగలవాఁడై, జనకమహారాజుం జూచి, "రాజా! మీరిద్దఱు లెక్కపెట్టనలవి కాని సద్గుణంబులు గలసోదరులు. మిథిలాపురీశులు. మీ రిద్దఱును మహర్షుల ననేకులను, రాజసమూహమును జక్కఁగాఁ బూజించితిరి. మీకు మేలయ్యెడుఁగాక. నేను మా విడిది కేగి, నాందీశ్రాద్ధము మొదలగు



సీతావివాహము.—పుట. 179. బాల.

కర్మల నన్నింటిని బాగుగా జరిపెదను” అని చెప్పి, కీర్తిమంతులగు జనక కుశధ్వజుల వీడ్కొలిపి, వసిష్ఠవిశ్వామిత్రమునులను ముందిడికొని తన విడిదికిఁ బోయి సేరెను. అట్లు దశరథుఁడు విడిదిసేరి మఱునాఁటి యుదయమున లేచి, యాహ్నికములెల్లఁ దీర్చుకొని నాంది శ్రాద్ధమును యథావిధిగా జరపించి, సుత్తమమగు గోదానమును చేయించెను. దశరథనృపాలుఁడు గోదాన కాలమున, ఒక్కొక్కని నుద్దేశించి ప్రత్యేకము నొక్కలక్షవంతున పసిఁడి కొమ్ములును, పుష్టియు, లేఁదూడలును గలిగిన నాలుగు లక్షల గోవులను, పాలుపిదుకుటకుఁ గంచుపాత్రములతోఁ గూడ బ్రాహ్మణులకు నొసంగెను. ఇట్లు గోదానములుచేసిన నల్వురు కొడుకులతో నా దశరథనృపాలుఁడు దిక్పాలురకొఁగూడిన బ్రహ్మదేవునివలె శోభిల్లుచుండెను.

## 73-వ స ర్గ ము.

### సీ తా వి వా హ ము

ఏ దినమున దశరథమహారాజు గోదానమను గొప్ప కార్యమును జేసి ముగించెనో, యా దినముననే, వీరుఁడును, కేకయరాజు కొడుకును, భరతునిసొంత మేనమామయు నైన యుధాజిత్తు వచ్చి, దశరథమహారాజును గుశలమడిగి, యతనితో నిట్లనియె. “ఓ దశరథమహారాజా! కేకయమహారాజు మీ పైఁ బ్రేమముచేత నన్ను క్షేమ మడుగుమనెను. తమ రెవరి క్షేమ మెల్లప్పు డరయుచుందురో, ఆ కేకయులందఱు సుఖముగ నున్నారు. రాజేంద్రా, మాతండ్రిగారగు కేకయాధిపతి మా చెల్లెలి కొమరుఁడగు భరతునిఁ జూడఁగోరి, యతనిని బిల్చుకొని రమ్మని నా కానతి యిచ్చెను. అందుకై నే నయోధ్యకు వచ్చితిని. అయోధ్యకు వచ్చునప్పటికి తాము, తమ పుత్త్రులయొక్క వివాహము నిమిత్తమయి వారిని బిలిచికొని మిథిలకుఁ బోయి యున్నారని విని, చెల్లెలికొడుకగు భరతుని జూడఁగోరి కడు వేగముగా నిట కేతెంచితిని” అని చెప్పెను. అంత దశరథమహారాజు తమ విడిదికి విచ్చేసిన గౌరవార్హుఁడగు తమ యిష్టబంధువయిన యుధాజిత్తున కనేకవిధముల నుచితసత్కారము లొనరించి యుధాజిత్తుతోడను, మహాత్ములగు మునులతోడను, బుత్త్రులతోడను గూడి యా రేయి సంతసముతోఁ గడపెను.

మఱునాఁటిదినము తెల్లవాఱ లేచి దశరథుఁడు సంధ్యావందనము మొదలగు ననుష్ఠానములను ముగించుకొని ఋషుల నందఱిని ముందు పోనిచ్చి యజ్ఞశాలకుఁ బోయి చేరెను. అప్పుడు శ్రీరాముఁడును మంగళస్నానము చేసి, వివాహమునకుఁ దగు నలంకారముల నన్నింటిని జేయించుకొన్నవాఁడై, తనవలెనే మంగళస్నానముచేసి యలంకారములఁ దాల్చియున్న తమ్ములతోఁగూడి, వసిష్ఠుఁడు, మఱియు ననేకులు మహర్షులును ముందుఁ గూర్చుండియుండ వారికి వెనుకప్రక్కఁ దండ్రికిఁ జేరువను గూర్చుండెను.

అప్పుడు త్రికాలజ్ఞుఁడగు వసిష్ఠమునీంద్రుఁడు జనకునిపాలికిం బోయి, యతనితో "నరేంద్రా! దశరథమహారాజు పెండ్లికిఁ దగిన యలంకారములఁ జేసికొని కంకణము గట్టుకొన్నవారయిన తన కుమారులతోడఁగూడి వేదికకడకు వచ్చి, కన్యాదాతవయిన నీ రాక కెదురుచూచుచున్నాఁడు. ఇచ్చువారికిని, పుచ్చుకొనువారికిని గదా సకలార్థములు సమకూరుచున్నవి. మహారాజా, యీ శ్రేష్ఠమయిన వివాహకార్యమును నెఱవేర్చి, స్వధర్మమును జెల్లింపుము" అనెను. మహానుభావుఁడగు వసిష్ఠుఁడు చెప్పినమాటలు విని, యెక్కువకాంతిగలవాఁడును, ధర్మసూక్ష్మముల నెల్ల బాగుగా నెఱిఁగినవాఁడును నౌదార్యవంతుఁడు నైన జనకమహారాజు వసిష్ఠమునీంద్రుంగూర్చి యిట్లనియె.

ఓ మునీంద్రా! దశరథమహారాజు తానే రావచ్చునుగదా. ఆతనితో నామాటనుగాఁ దమరు దీనిం జెప్పుఁడు. "మహారాజా మానగరు వాఁకిట నెవ్వఁడు ద్వారపాలకుఁ డున్నాఁడు? ఎవరియాజ్ఞకై మీరు వేచియున్నారు? స్వగృహములో నొక్కరి నడుగవలసిన పని యేమి? ఈ రాజ్యము నా కెంతసొంతమో, తమకును నంత సొంతమే" యని చెప్పి మఱల నమ్మునీంద్రునిఁబిలిచి, "మునీంద్రా, బిడ్డలందఱును ముందే మంగళస్నానముచేసి, యలంకారములు ధరించి, యీ పడింటిలోనే పెండ్లివేదికకు దాపునఁ గూర్చుండి మండుచున్న యగ్నిహోత్రుని జ్వాలలవలె వెలుఁగుచున్నారు. నేనును సర్వము సిద్ధముచేసి యీ వేదికయందుఁ గూర్చుండి మీరాక కెదురుచూచుచున్నాఁడను. ఇఁక దశరథమహారాజు గావలసిన పనులను నిర్విఘ్నముగఁ జరుపుఁగాక. ఇంకను వారెందులకు

జాగుసేయుచున్నారు? ముహూర్తము మించకుండులాగున నన్నియు నడిపింపవలయును" అని యనెను.

ఇట్లు జనకుఁడు చెప్పినమాటను విని దశరథమహారాజు తన పుత్త్రులం దోడ్కొని, ఋషి సంఘముతోడ యాగశాలం బ్రవేశించెను. అప్పుడు జనకుఁడు వసిష్ఠమహామునిని జూచి, "మహామునీ, ఋషులందఱిని సహాయముగా నుంచుకొని లోకముల కొప్పినవాసయిన రాజపుత్త్రుల వివాహాంగములైన కార్యముల నన్నింటిని, జరగింపుఁడు" అని చెప్పెను. వెంటనే భగవానుఁడగు వసిష్ఠమహర్షియు 'అట్లే' యని చెప్పి, విశ్వామిత్రమునిని, ధర్మముల నెఱింగిన శతానందుని ముందుంచుకొని, యా కల్యాణమంటపమునఁ గూర్చుండెను. వారు ఆ వివాహ మంటపమునడుమ నెత్తయిన యొకతిన్నెను శాస్త్రప్రకారముగా నిర్మించి, దానిని గంధముచేతను, పూలచేతను నలంకరించి, పిండిముగ్గులు పెట్టించి, బంగారు పాలికలు పెట్టవలసినచోట్లఁ బెట్టిరి. మొలకలతోఁ గూడిన యడుగులేని కుండలను, మఱియు మొలకలతోఁ గూడినఁ మూఁకుళ్ళను, ధూపములతోఁగూడిన ధూపహారతులను, శంఖమువంటి పాత్రములను వేదికమీఁద నలుప్రక్కలను నిలిపిరి. ఒకప్రక్కను ధూపము, ఒకప్రక్కను దీపము, ఒకప్రక్కను పేలాలు, మఱొక ప్రక్కను నర్ఘ్యము, వేఱొక్కతట్టున నక్షతలు, స్రుక్కు, స్రువము మొదలగు సాధనములచే నా పెండ్లిమంటపము నలంకరించిరి. అంత మహాతేజస్సుగలవాఁడగు వసిష్ఠమునీంద్రుఁడు కల్యాణవేదికకుఁ జుట్టును నెచ్చుతక్కువలులేని దర్భలను శాస్త్రమునందుఁ జెప్పిన చొప్పున మంత్రములఁ జెప్పుచుఁ బఱచి, యగ్నిహోత్రముఁ దెప్పించి వేదియం దుంచి, శాస్త్రవిధానమందుఁ జెప్పఁబడిన మంత్రములతో నగ్నిహోత్రునియందు హోమములు చేసి, వివాహ మంత్రములను బఠించెను.

## సీతా వివాహ ఘట్టము

ఈ సమయముననే జనకమహారాజు సకల భూషణములచే నలంకరింపఁబడినదై వెలుఁగుచుండు తన ముద్దు కూఁతురగు సీతను అగ్ని

హోత్రుని సమక్షమున రామునెదుటికిఁ దీసికొనివచ్చి నిలువబెట్టి, కౌసల్యయొక్క సంతోషము మెసఁగఁజేయువాఁడగు రామునిఁ జూచి,

* శ్లో॥ "ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ।
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా॥"

"నా కూఁతురయిన యీ సీతను ప్రతిధర్మమునందుఁ గూడ నుండి నెరవేర్చుటకై నేను నీకు దానముచేయుచున్నాను. నీకు శుభమగును. ఈయమచేతిని నీచేతితోఁ బట్టుకొనుము. ఈయమ పతివ్రత. నిరంతర సౌభాగ్యవతి. ఎల్లప్పుడు నీడవలె ననుసరించునది." అని చెప్పి రామునిచేతిలో మంత్రముచెప్పుచు నీరు విడిచి, సీతచేతి నా రాముని చేతిలోనుంచి కన్యాదానము చేసెను. అట్లు కన్యాదానము చేయు సమయమున దేవతలును, మహర్షులును "బాగు! బాగు!" అని శ్లాఘించుచుండఁగా ఆకసంబునందు దేవదుందుభులు మ్రోఁగెను. గొప్ప పూల వాన గురిసెను.

ఇట్లు జనకమహారాజు మంత్రజలముతోఁగూడ సీతను రామునికిఁ గన్యాదానము చేసి, యా సంతోషముతోఁ బొంగినవాఁడై, లక్ష్మణుని జూచి, "లక్ష్మణా! రమ్ము. నీకు మంగళమయ్యెడుఁగాక! నే నిచ్చునట్టి నా కూఁతురగు నూర్మిళ చేతిని నీవు గ్రహింపుము. లగ్నవేళ మించఁ జనదు" అని పలికెను. ఆపై భరతునిఁజూచి, "రఘునందనా! నీ చేతితో మాండవిచేతిని గైకొనుము" అనిచెప్పెను. తర్వాత ధర్మాత్ముఁడగు జనక మహారాజు శత్రుఘ్నునిఁ బిలిచి, "శత్రుఘ్నా, శ్రుతకీర్తి హస్తమును నీ హస్తముతోధరింపుము" అనిచెప్పెను. వారికందఱకును గన్యాదానము చేసి, వారందఱితోడను మఱల "కకుత్థ్సవంశమునఁ బుట్టిన రాజపుత్రులారా, మీరందఱు శాంతులరు. మంచి నియమములు గలవారలు. లగ్నవేళ మించిపోకుండులాగున మీ పత్నులతోఁ గూడినవారు కండు.

---

* అర్థము:—మమ=నాయొక్క, సుతా=కూఁతురగు, ఇయం=ఈ, సీతా=సీత, తవ=నీకు, సహధర్మచరీ=కూడనుండి నీ ధర్మములను (నీవుచేయు కార్యములను) జేయునది. ఏనాం=ఈ సీతను, ప్రతీచ్ఛ (చ)=గ్రహింపుము, తే = నీకు, భద్రమ్=మేలు, (అస్తు = అగునుగాక.) (తే)=నీయొక్క, పాణినా = చేతితో, పాణిం=(సీతయొక్క) చేతిని, గృహ్ణీష్వ=పట్టుకొనుము.

ఇప్పుడు మీరు నల్వురికి వివాహము జరుగవలెను" అనెను. ఇట్లు జనక మహారాజు చెప్పినంతటనే, వసిష్ఠమహాముని యనుమతిని బొంది యా నల్వురు రాజపుత్రులును నా నల్వుర రాజపుత్రికల చేతులను దమచేతు లతోఁబట్టికొని, యగ్నికిని, వేదికకును, జనకమహారాజునకును, ఋషులంద ఱకును బ్రదక్షిణమునేసి, వివాహకార్యములను విధిప్రకారముగా నొక్కటియు విడువక చేసి, వివాహమంగళమును పూర్తిగావించిరి.

రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నల్వురు చిగురుటాకులవలె మెత్తనైన యారాజపుత్రికల చేతులఁ దమ చేతులతోఁ బట్టుకొని నపుడు, మిక్కిలి శోభాయమానమైన పుష్పవర్ష మాకసమునుండి గురి సెను. దివ్యములయిన దుందుభినాదములతోడను, నిరుపాటలతోడను, వీణె మొదలగు వాద్యముల ధ్వనులతోడను అప్సరలగుంపులు నాట్య మాడిరి. గంధర్వులు చెవుల కింపుగాఁ బాటలుపాడిరి. ఆ వివాహమున నిపియంతయుఁ జూచువారికి వింతఁ గొల్పుచుండెను.

ఇట్లు పలు తెఱఁగులయిన వాద్యములు మ్రోఁగుచుండ, నా రాజ పుత్రు లందఱు తమ పత్నుల చేతులం బట్టుకొని, మూఁడు మారు లగ్నికిఁ బ్రదక్షిణమునేసి, వివాహకలాపమును నిర్వర్తించిరి. అనంతర మా పెండ్లికొమరులు భార్యాసహితులై తమ విడిది కరిగిరి. దశరథమహా రాజు ఋషిసంఘములతోడను, జుట్టాలతోడను గూడి భార్యాసహితు లైన తనకుమారుల వైభవమును జూచుచు వారివెంటఁ జనెను.

## 74-వ సర్గము

### రాముఁడు పరశురాముని సంధించుట

అంతట నా రేయి గడచి తెల్లవారినంతనే, విశ్వామిత్రమునీంద్రు డా దశరథజనకమహీవల్లభులను వీడ్కొని, రాముఁడు మొదలగు రాజపుత్రులను దీవించి నిజనివాసమగు హిమవత్పర్వతమునకుఁ బోయెను. విశ్వామిత్రుఁడు తరలినంతటనే దశరథ నరేంద్రుఁడు జనక నృపాలుని వీడ్కొని, తన కొడుకులను గోడండ్రను దోడ్కొని యయోధ్యకుఁ బయనమయ్యెను. అప్పుడు జనకమహారాజు లక్ష గోవు లను, మేలైన సరిగబట్టలను, పట్టుంచు చీరలను, సొగసుగా నలంకరింపఁ బడిన శుభలక్షణములుగల గుఱ్ఱములను, ఏనుఁగులను, తేరులను,

కాల్బంటులను దాసదాసీజనులను, అనేకములగు బంగారు వెండి సొమ్ములను, ముత్యాలహారములను, పగడాలదండలను, విస్తారమగు ధనమును దన కూఁతులకు నరణముగానొసఁగి, యా దశరథునివెంటఁ గొంత దూరముపోయి, యతని సెలవుగైకొని మఱలి తన పురంబగు మిథిలకుఁ జేరెను.

అయోధ్యాధిపతియగు దశరథుఁడు ధీరులయిన తన పుత్త్రులతోడం గూడి ఋషులందఱు ముందునడచుచుండఁ బరివారములెల్ల వెంటరాఁ బ్రయాణము సాగించుచుండెను. అపు డచ్చటచ్చట నాకాశమందుఁ దిరుగు పక్షులు భయంకరముగా నశుభసూచనముగాఁ గూయుచుండినవి. భూమిఁ దిరుగు మృగములెల్లఁ బ్రదక్షిణముగా శుభసూచనముగాఁ బోవుచుండినవి. వానినిఁ జూచి రాజశ్రేష్ఠుఁడగు దశరథుఁడు తన గురువగు వసిష్ఠునితో "మహాత్మా! పక్షు లశుభసూచకములై భయమును గల్పించుచున్నవి. మృగములు శుభసూచకములై ప్రదక్షిణముగాఁ బోవుచున్నవి. హృదయమున కాందోళనఁ గలిగించునట్టి శుభాశుభసూచకమైన యీసన్నివేశ మేమైయుండును? కారణము తెలియక నామది మిగుల దిగులుగొనినది" అని యడిగిన దశరథమహారాజువాక్యములు విని వసిష్ఠమహాముని "దీనికిఁ గల ఫలము చెప్పెదను. వినుము. మహారాజా! దారుణమైన యాపద యొకటి రానున్నదని పక్షులు సూచించుచున్నవి. ఆయాపద తొలఁగిపోవుచున్నదని మృగములు సూచించుచున్నవి. కనుక నీవు దిగులును వదలుము." అని నెమ్మదిమాటలతోఁ జెప్పెను.

ఇట్లు వీరు మాట్లాడుచుండునప్పుడె, భూమినంతయు గడగడలాడించుచు గొప్పచెట్లనుగూల్చుచు నొక్క పెనుగాలివీచెను. సూర్యుని చీకట్లు గ్రమ్మెను. దిక్కులన్నియు వెలవెలఁబాఱెను. దశరథుని సైన్యమంతయు దుమ్ముగమ్మగా దిక్కుదోఁపకుండెను. వసిష్ఠుఁడును, తక్కిం గల మహర్షులును, దశరథుఁడును, ఆతనిపుత్త్రులును ఆ ప్రచండవాతములోఁ దెలివితప్పనివారుగా నుండిరే కాని తక్కినదంతయును జైతన్యరహితమైపోయెను. భయంకరమైన యాచిమ్మచీకటిలో సేనయంతయు ధూళిగప్పినదిగా నుండెను. ఆతరుణమున జడలను దాల్చి, ప్రలయకాల

రుద్రునివలెనుండువాఁడును, రాజాధిరాజులనెల్ల నిరువదియొక్క మాఱు భూమండలంబెల్ల జుట్టి వెదకివెదకి సంహారించినవాఁడును, కైలాసపర్వతమువలె మిగుల నలవికానివాఁడును, ప్రళయకాల మందలి యగ్నిహోత్రునివలెఁ దేజరిల్లుచుండువాఁడును, తన ప్రతాపకాంతులచే నెఱియుచున్నట్లు కనఁబడువాఁడును, సామాన్య జనులకుఁ జూడ నలవికానివాఁడును, మూఁపురముమీఁద గొడ్డలినుంచు కొని, ధనుస్సును, మెఱుపులగుంపువలె వెలుఁగుచున్న బాణశ్రేష్ఠమును పుచ్చుకొని త్రిపురంబులఁ గాల్పఁబూనిన యీశ్వరునివలెనున్న పరశు రాముఁడచటికి కేతెంచెను. మండుచున్న యగ్నిహోత్రునివలె వెలుఁ గుచు రుద్రునిఁబోలియున్న యా పరశురామునిఁ జూచి, జప హోమపరాయణులైన వసిష్ఠాదిమహాములు లందఱును గుమిగూడి వారిలో వారిట్లనుకొనిరి. "ఈ పరశురాముఁడు తనతండ్రిని జంపి రన్నకోపము కలవాఁడైనను నిప్పుడు క్షత్రియులను సంహరించువాఁడు కాఁడుగదా! ఇదివఱలో నాకోప ముండినది. దానికిఁ దగినట్లు క్షత్రసంహార మొనరించి యాకోప ముడిగి యాయుద్వేగము లేనివాఁడై యున్నవాఁడుగదా! కాఁబట్టి మరల నితఁడు చేయఁదలఁచినది క్షత్రియసంహారణమై యుండనోపదు గదా!" యని యను కొనుచు నర్ఘ్యపాద్యాదులు గైకొని భయంకరాకారముతోనున్న పరశురాముని కడకుఁ బోయి 'రామా! రామా! ఋషు లొసఁగు నీపూజను స్వీకరింపుము' అని మధురముగఁ బలికిరి. ప్రతాపవంతుఁడగు జమదగ్ని కుమారుఁడు రాముఁడు ఋషులు కావించెడు పూజను స్వీకరించి దశరథుని కుమారుఁడగు రామునిఁజూచి యిట్లు చెప్పఁ దొడఁగెను.

## 75-వ సర్గము.

### విష్ణుధనుస్సుయొక్క మహిమ

"రామా! దశరథనందనుఁడవగు ఓరామా! నీయొక్క పరాక్రమ మద్భుతముగా వినఁబడుచున్నది. నీవు శివునివిల్లు ద్రుంచుట, తాటకను సంహరించుట, సుబాహుఁవు మొదలగు రక్కసులను జంపుట మొదలగు నవి యెల్లను నేను వింటిని. శివునివిల్లు విఱుచుట యాశ్చర్యకరముగను,

మనంబున నైన నూహింపరానిదిగను నున్నది. అట్టి నీ శౌర్యమును విని, నేను మఱియొక్క ధనుస్సును గొని యిచ్చుటకి వచ్చితిని. ఓ రఘునందనా! శివునివిల్లుఁ ద్రుంచి నట్టుగాదు. భయంకర రూపముగల ఈ గొప్ప ధనుస్సు జమదగ్నిసంబంధమయినది. దీనిని వంచి బాణమును సంధించి, నీ బలమును జూపుము. రాఘువా, నీ వీ ధనుస్సును వంచి యెక్కు పెట్టుటయందు నీ బలమును జూపితివేని, వీర్యవంతుఁడ వని కొనియాడఁదగిన నీతో నపుడు ద్వంద్వయుద్ధంబు నేసెదను" అని రామునితోఁ జెప్పెను. అప్పుడు దశరథమహారాజు ఆ పరశురాముని యొక్క మోమోటములేని యా మాటను విని, దిగులుదోఁప, మోము వ్రేలవైచి, ధైర్యంబు విడచి, చేతులు జోడించుకొని పరశురామునితో నిట్లనియె.

"మహానుభావా! నీవు బ్రాహ్మణుఁడవు. నీ కెప్పుడును కోపము దగదు. అదియుఁగాక నీ పిరువదియొక్కమారులు భూమియెల్లఁ దిరిగి క్షత్రియుల నాశముచేసి క్షత్రియులపైని కోపము వదలి, శాంతము నొందితివి. నీవు మహావీరుఁడ వని కీర్తిఁబడసితివి. పసిబిడ్డలగు నా పుత్రుల కభయమొసఁగఁదగుదువు. నీవు సర్వదా వేదాధ్యయనము చేయుచు, చాంద్రాయణాది వ్రతములు సల్పుచుండెడి భార్గవులవంశమునఁ బుట్టితివి. మఱియు, దేవేంద్రునియెదుట "నిఁక శస్త్రముఁ బట్ట" నని ప్రతిజ్ఞచేసి, యస్త్రములను విడిచితివి. అంతియకాక, నీవు ధర్మపరుఁడవై, పుడమినెల్లఁ గాశ్యపునకొసఁగి, వనమునకుజని మహేంద్రపర్వతమున నివాసము నేర్పఱచుకొంటివి. మహామునీ! అట్టి నీవిప్పుడు మా సర్వస్వమును నాశనము చేయుటకై మఱల వచ్చితివా? రాముని నీవు జంపితివేని, మే మందఱ మిఁక జీవింపము" అని దశరథుఁడు చెప్పుచుండఁగనే యా మాటలను సరకుచేయక, ప్రతాపవంతుఁడగు పరశురాముఁడు రామునితోడనే యిట్లనియెను.

"ఓ రామా, శివునివిల్లును, ఈ నాచేతనుండు విల్లును ఈ రెండును మేలైనవి. ఇవి దేవలోకంబున నేర్పడినవి. లోకములం దెల్ల బ్రసిద్ధి చెందినవి. గట్టివి. బలిమి గలవి. ధనుస్సులలో శ్రేష్ఠములయినవి. దేవతల వడ్రంగియగు విశ్వకర్మ వీనిని జక్కఁగాఁ జేసెను. కకుత్థ్సవంశో

దృష్టుఁడవగు నరోత్తమా! నీవు విఱిచిన ధనుస్సును తొల్లి దేవత లీశ్వరునికిఁ ద్రిపురసంహారము నిమిత్తమై యిచ్చిరి. ఈ రెండవ ధనుస్సును వేల్పులు విష్ణువున కొసఁగిరి. ఇది యొరులకు వంప నలవి యైనది గాదు. కకుత్థ్సవంశమునఁ బుట్టిన యో రామా! విశేషముగ మెఱయుచుండెడి యీ విష్ణుధనుస్సు శివధనుస్సుతో సాటియగు బలముగలది. వేల్పులందఱీ ధనుస్సులను రెండింటిని శివకేశవుల కొసఁగినపుడా యిరువురి బలాబలముల నెఱుఁగుమని బ్రహ్మదేవునిఁ బ్రేరణ సేసిరి. సత్యవాదులలో మేటియైన బ్రహ్మదేవుఁడు దేవతలయొక్క తలంపెఱిఁగి, శివునికిని విష్ణువునకును కలహము పుట్టునట్లు చేసెను. అప్పుడొకరి నొకరు గెల్వవలె నని తలంచిన యా శివకేశవులకు మహాభయంకరమైన యుద్ధము నడిచెను. అప్పు డీశ్వరుని ధనుస్సు భయంకరమైన మగటిమిగలదైనను విష్ణుదేవుఁ డొనరించిన హుంకారముతో నిర్వీర్యమై పోయెను. అంత ముక్కంటియగు మహాదేవుఁడు నేమియుఁ జేయజాలని వాఁడై నిలిచిపోయెను. అప్పుడు దేవతలు, ఋషులతోడను, చారణుల తోడను వచ్చి ప్రార్థింపఁగా నా శివకేశవు లిరువురును యుద్ధము చాలించి, ప్రశాంతి నొందిరి. అప్పుడు వేల్పులును, ఋషిసమూహములును విష్ణువుయొక్క మగటిమికి శివునిధనుస్సు నిలఁబడి పోవుటంజూచి, శివునికంటె విష్ణు వధికునిగాఁ దలఁచిరి. అట్లు కీర్తిమంతు డయిన శివుఁడు తన్ను విష్ణువునకంటెఁ గొఱఁతగా నెంచుటచేతఁ గోపించి, తనధనుస్సును బాణములతోఁగూడ విదేహదేశము నేలెడి రాజర్షియగు దేవరాతుని చేతఁబెట్టి తనయొద్ద నుంచమని చెప్పెను. రామా! ఇదిగో యీధనుస్సో! వైష్ణవము. శత్రుపురధ్వంసకము. దీనిని విష్ణుమూర్తి భృగువంశజుఁడైన ఋచీకునికడ న్యాసముగా నుంచెను. మహాతేజస్వి యగు ఋచీకమహామునియు లోకోత్తరకర్ముఁడును, మహాత్ముఁడు, తనపుత్రుఁడు, మాతండ్రియునగు జమదగ్ని మునీంద్రునికి దివ్యధనువు నొసఁగెను. తపఃప్రభావసంపన్నుఁడగు మాతండ్రి శస్త్రమును విడిచిపెట్టియుండఁగా, ప్రాకృతబుద్ధి నూని కార్తవీర్యార్జునుఁ డాయనను వధించెను. ఎక్కడఁ జూడని మహాదారుణమైన మాతండ్రిచావును విని, నాఁపరాని కోపముతోఁ బుడమియందు మూలమూలనున్న క్షత్రియుల నందఱను

వెదకి వెదకి ముయ్యేడుమారులు సంహరించి, భూమండలము నెల్ల స్వాధీనపఱచుకొని, యాగముచేసి, యయ్యాగాంతమునఁ బుణ్యకర్ముఁడును, మహాత్ముడునగు కాశ్యపమహాముని కాభూమండల మెల్ల దక్షిణగా నొసఁగి, దేవతల కునికిపట్టయిన మహేంద్రపర్వతముఁజేరి యచ్చటఁ దపము చేయుచున్నాను. మహాపరాక్రమశాలివగు రామా! మగఁటిమిగల నీవు శివునివింటిని ద్రుంచిన వార్తవిని, వేగముగా నీ కడకు వచ్చితిని. ఓ రామా! యీ గొప్పధనుస్సు మాతండ్రి తాతల నాఁటిది. వారివలన నాకు లభించినది. నీవు క్షత్రియధర్మము నూని యీ మేటి వింటిని గ్రహింపుము. కాకుత్స్థా! శత్రుపట్టణంబులను ధ్వంసముచేయజాలిన బాణమును దీనియందు గూర్పుము. ఇంత మాత్రము చేయఁగల్గితివేని తర్వాత నీకు ద్వంద్వయుద్ధము నొసఁగె దను." అని దశరథరామునితో పరశురాముఁడు చెప్పెను.

## 76-వ సర్గము.

### రాముఁడు పరశురాముని విల్లెక్కు పెట్టుట

అప్పుడు దశరథరాముఁడు భార్గవరాముఁడు చెప్పిన మాటవిని, తండ్రియందలి గౌరవముచే మాటలను బెంచక పరశురామునితో ని ట్లనియె. "ఓ భార్గవరామా! నీవు చేసిన కార్యమును నే నిదివఱకే విని యున్నాఁడను. నీ వంటి పుత్త్రుఁడు తీర్చికొనవలసిన పితృఋణమును దీర్చుకొంటివి. దానిని మే మనుసరించుచున్నారము. ఓ పరశురామా, నన్నుఁ బరాక్రమము లేనివానినిగాఁ దలపోసి, యందుచే క్షాత్రధర్మ ప్రకారము ధనుర్బాణములను బట్టలేనంతటి క్షత్రియ యసమర్థునిఁగాఁ దలంచి నా తేజస్సును దిరస్కరించుచున్నాఁడవు. చూడు నా ప్రతాపము." అని చెప్పి మిక్కిలి కుపితుఁడై, పరశురాముని చేతనున్న ధనుర్బాణ ములను మిక్కిలి చులకనగాఁ గైకొని, వెంటనే దానిని వంచి యెక్కు పెట్టి బాణమును సంధించి, కోపముతోఁ బరశురామున కిట్లనియె. "నీవు బ్రాహ్మణుఁడవు. కావున నాకుఁ బూజ్యుఁడవు, విశేషించి విశ్వామిత్రునకుఁ గావలసిన వాఁడవు నని ప్రాణహారమైన బాణ మును నీపై విడువనైతిని. ఇపు డీ బాణముచే నీ కాలినడకనైనను, కాదేని, నీవు తపస్సుచే సంపాదించిన సాటిలేని లోకములనైనను బడఁ

గొట్టెదను. వీనిలో నీ కేది యిష్టమో చెప్పుము. శత్రుపురసంహారక మైన యీ దివ్యబాణము తన వీర్యముచే శత్రువుల బలమును, గర్వ మును నాశనముచేయక వృథాపోవునదిగాదు! కావున నీవు దేనికి సమ్మతింతువో, చెప్పు"మని యడిగెను. అప్పుడు దేవతలు, ఋషులు, గంధ ర్వులు, అప్సరసలు, సిద్ధులు, చారణులు, కిన్నరులు, యక్షరాక్షస పన్నగులు బ్రహ్మదేవుని ముందుంచుకొని, గుంపులుగుంపులుగాఁగూడి మేటికైదువు దాల్చిన రాముని, అతఁడు చేయఁబోవు మహాద్భుతమైన బాణప్రయోగమును జూడవచ్చిరి. అప్పుడు రాముఁడు వింటిని దాల్చి నంతటనే జనులు మ్రాన్పడి నిలిచిరి. పరశురాముఁడును నిర్గతవీర్యుఁడై రామునివైపుచూచి శ్రీరాముని తేజముచేఁ దన తేజ మపహృతమగుటచేఁ బరశురాముఁడు నిర్వీర్యుఁడై మ్రాన్పడి కమలములంబోలు కన్నులుగల శ్రీరామునితో మెల్లమెల్లఁగ నిట్లనియె. శ్రీరామా! నే నీభూమిని పూర్వము కాశ్యపునకు దానము చేసితిని. అప్పు డాకాశ్యపుఁడు "నీవు నాదేశములో నుండరా దని న న్ననెను. ఆయనచే నీమాట యనిపించు కొనిన నేను గురునిమాట చెల్లించువాఁడనై పగ లెచ్చటఁ దిరిగినను రాత్రికాలమున నీభూమిపై నివసింప నని ప్రతిజ్ఞ చేసితిని. రామా! యీభూమి కాశ్యపున కిచ్చినప్పు డిది యాయనదేగదా! కావున నాపాద గమనమును నీవు పడఁగొట్టఁ దగవు. ఏలయన సూర్యాస్తమయము లోపల మనోవేగముతో మహేంద్రపర్వతమున కరుగఁగలను కనుక నాపాదగమనమును బడఁగొట్టకుము. మఱియు నేను తపోబలముచే సంపాదించిన సాటిలేని యుత్తమలోకములుగలవు వానినిఁ బడగొట్టుము. ఆలస్యము చేయకుము. శత్రువుల నొంచునట్టి యో రామా! యీవిల్లు వంచి యెక్కుపెట్టుటచే నీ వొక్కరిచేతను గెల్వ నలవిగాని మధు సూదనుఁడయిన సాక్షాద్విష్ణుమూర్తివని తలఁచెదను. నీకు శుభము గలుఁగుగాక! సాటిలేని పనులఁ జేయువాఁడవును, యుద్ధమున నెవరి చేతను నెదిరింప నలవికానివాఁడవును నైన నిన్ను దేవతలందఱు గుమి గూడివచ్చి చూచుచున్నారు. కాకుత్స్థా, ముల్లోకములకు నాథుఁడ వయిన నీచే నేను బరాజితుఁడనైతి నగునిది నాకు లజ్జాకరము కాదు. నీవు త్రిలోకాధిపతివిగదా! సువ్రతా! రామా! యిఁక నీ సాటిలేని

బాణమును విడువుము. నీ బాణమోక్షణము కాగానే నేను పర్వత ములలో శ్రేష్ఠమైన మహేంద్రపర్వతమునకుఁ బయనింతును. అని పరశు రాముఁడు రఘురామునితోఁ జెప్పఁగాఁ బ్రతాపవంతుఁడైన దశరథ రాముఁడు శ్రేష్ఠమైన బాణమును బ్రయోగించెను. అప్పుడు పరశు రాముఁడు తాను తపస్సుచేఁ బడసిన లోకములన్నియు రాముని బాణ ముచేఁ గొట్టఁబడుటఁ జూచి వెంటనే మహేంద్రపర్వతమున కరిగెను. అప్పుడు దిశలును, విదిశలును జీకటి దొలఁగి మెఱసెను. దేవతలును, ఋషి సంఘములును నాయుధధారియై యున్న శ్రీరామునిఁ బలుతెఱఁ గులఁ బ్రశంసించిరి. సమర్థుఁడయిన పరశురాముఁడును దశరథ పుత్రు డైన రామునిఁ బొగడి, యా రామునికి బ్రదక్షిణముసేసి స్వస్థానము చేరుకొనెను.

## 77-వ సర్గము.

### దశరథుఁడు మఱల నయోధ్య సేరుట

పరశురాముఁడు మహేంద్రమునకుఁ జనిన వెంటనే, దశరథ రాముఁడు ప్రశాంతుఁడై యావిష్ణుధనుస్సును బాణములతోఁ గూడ నప్రమేయబలాఢ్యుఁడగు వరుణున కొసఁగి, వసిష్ఠుఁడు మొదలగు గురు వుల నందఱికి నమస్కరించి, మూర్ఛనొంది పడియున్న తండ్రిని జూచి "ఓ తండ్రీ, జమదగ్ని పుత్రుఁడగు పరశురాముఁడు మఱలిపోయెను. ఇఁక మన చతురంగ సేన నయోధ్యకుఁ బోనీయవచ్చును. మహారాజా! చాతకపక్షి వానీటికై మోరయెత్తి నిలఁబడియుండు చాడ్పున మన సేన తమ యుత్తరువు నెదురుచూచుచున్నది. తమ యాజ్ఞలోనున్న యీ సేన కదలిపోవుట కుత్తరవీయ వలయును" అని కోరెను. ఆరా ముని పలుకులు విని, దశరథుఁడు తన పుత్రుఁడగు రాముని రెండుచేతు లతోఁ గట్టిగఁ గౌఁగిలించుకొని శిరము మూర్కొని, పరశురాముఁడు వెడలెనన్న మాటవిన్నంతనే పరమానందభరితుఁడై, గద్గదపాటునొంది, తన్నును దన పుత్రుని మఱల జన్మమెత్తినవారినిగాఁ దలఁచి, తన సేన లకు మఱల ప్రయాణముసేయ నానతి యొసఁగి, వెంటనే యయోధ్యా పురమునకుఁ దరలెను. ఆ యయోధ్యాపురంబునందు టెక్కెములు

గట్టఁబడెను. అంతటను మంగళవాద్యంబులు మ్రోగుచుండెను. రాజ వీథులన్నియు నీరుచల్లఁబడి పుష్పములు చల్లఁబడియుండెను. పట్టణము లోని జనులందఱు రాజుగారి పురప్రవేశము నభిలషించుచు, నంతటను గుమికూడి క్రిక్కిఱిసి వీథుల నలంకరించి యుండఁగా దశరథమహారాజు పురప్రవేశము గావించెను.

దశరథనృపాలుఁడు వచ్చుచున్నాఁడని పట్టణములోని జనులును, బ్రాహ్మణోత్తములు జాలదూర మారాజున కెదురు వోయిరి. కీర్తియు, సంపదయుఁగల దశరథమహారాజు కాంతిమంతులైన తన పుత్రులతోఁ గూడి, హిమవంతముఁబోలు తన నగరు సొచ్చి యిష్టార్థముల ననుభవించుచు సంతోషము నొందియుండెను. కౌసల్యయుఁ, గైకయు, సుమిత్రయు మఱియు నంతఃపురమున నున్న రాజస్త్రీ లందఱును నూతన వధువుల నంతఃపురమునఁ బ్రవేశపెట్టుట కుత్సాహవతులై యుండిరి. తర్వాత రాజపత్నులు సీతను నూర్మిళను గుశధ్వజుని కూఁతులగు మాండవీశ్రుతకీర్తులను నంతఃపురములోఁ బ్రవేశపెట్టిరి.

ఆ నూతనవధువులు నల్వురు పట్టుచీరలు ధరించి, ముత్తైదువు లొసఁగు సకలభూషణ మంగళాశీర్వచనముతోడను మిక్కిలి శోభిల్లుచు దేవాలయములకుఁ బోయి యందలి దేవతలను బూజించి, నమస్కరింపఁ దగిన పెద్దలకెల్ల నమస్కరించి కుబేరుని నగరుంబోలెడు తమ తమ యిండ్లకుఁ జేరి, బ్రాహ్మణశ్రేష్ఠులకు గోవులు, ధనము, ధాన్యము సవారిగా నొసఁగి వారి నందఱిని సంతోషపెట్టి, యేకతంబునఁ దమ ప్రియులతోఁ గూడి మహానందముతో సుఖముగానుండిరి. మహాత్ములును, భూలోకమున సాటిలేని పరాక్రమముగలవారు నైన రాజపుత్రులగు రామాదు లందఱుఁ బెండ్లియై, యస్త్రములనెల్ల నేర్చి, విశేషధనము గడించి, తమ మేలుగోరెడి మిత్రులను దాపునఁ జేర్చుచు, నప్పుడప్పుడు గురువుల వలన నీతుల నెఱింగి, తమ మేటి గుణములచే గురువులను సంతోషపెట్టుచుఁ దండ్రికి శుశ్రూష సేయుచుఁ దండ్రి యిష్టప్రకారము నడచు కొనుచుండిరి.

ఇట్లుండఁ గొన్నినాళ్లైనపిదప దశరథుఁడు కైకేయీ పుత్రుఁడగు భరతునిఁ బిలిచి "నాయనా! నీ మేనమామ యుధాజిత్తు నిన్నుఁ బిలుచు

కొనిపోవుటకు వచ్చియున్నాఁడు. చాలదినములైనది. నేను మిథిలాపురియం దున్నపుడే, ఋషులందఱి సమక్షమున నిన్నుఁ దనవెంటఁ బిలుచుకొనిపోవ సమ్మతింపుమని నన్నీతఁడు వేఁడుకొనెను. కావున నీతనితోడఁ బోయి, యీతనికిఁ బ్రియమును జేకూర్పు" మని చెప్పెను. కైకేయీపుత్త్రుఁడగు భరతుఁడు తన తండ్రి యానతిచ్చిన మాటను విని, తండ్రికి రామునికి నమస్కరించి, లక్ష్మణునిఁ గౌఁగిలించుకొని, తన తండ్రిని, సకల జనులకు హితంబుఁగోరెడి రాముని, దల్లుల నందఱిని వీడ్కొని శత్రుఘ్నునితోఁ గూడఁ బయనమై పోయెను. భరతుఁడు వెళ్లినతర్వాత మహాబలులైన రామలక్ష్మణులు దేవతలకు సాటియగు తమ తండ్రిని గొలుచుచుండిరి. ధర్మాత్ముఁడగు రాముఁడు తండ్రియాజ్ఞను బురస్కరించుకొని సర్వవిధములఁ బ్రియములై హితములయిన పౌరకార్యములను నిర్వర్తించుచుండెను. మఱియు నాయాకాలములందుఁ దల్లులకుఁ దగిన శుశ్రూషలను దల్లులకును, గురువులకుఁ జేయఁదగిన శుశ్రూషాదికార్యములను గురువులకును వేదశాస్త్రమర్యాదల నతిక్రమింపకుండ నాచరించుచుండెను.

ఈ ప్రకారముగా నడుచుకొనుచున్న శ్రీరామచంద్రుని సత్ప్రవర్తనముచే దశరథుఁడును, బ్రాహ్మణులును, పౌరులును, తద్దేశవాసులగు జానపదులును అందఱును సంప్రీతాత్ములైరి. సత్యపరాక్రముఁడై లోకాతిశాయికీర్తిని బడసిన శ్రీరామచంద్రుఁ డాబ్రాహ్మణాదులనడుమ సమస్త భూతములనడుమ బ్రహ్మదేవునివలె గుణవర్తరుఁడై యుండెను.

ఇట్లు మంచి మనసుగల రాముఁడు రాజ్యపరిపాలనంబునఁ దండ్రికి దోడ్పడి జనుల యనురాగంబు వడయుచు, సీతయొక్క సౌందర్యాది గుణంబులచేతను, తనయెడఁగల ప్రేమచేతను నామెనే మనంబునఁ దలంచుచు నెల్లప్పు డామెనే మనస్సునందే యుంచుకొనుచు ననేక ఋతువులం దా యా ఋతువులకుఁ దగినట్లు సకల సౌఖ్యముల ననుభవింపుచుండెను.

తండ్రిచే విచారించి చేయఁబడినభార్య యగుటచేతనే సీతాదేవియు రామునికి మిక్కిలి ప్రియతమురాలుగా నుండెను. ఇంతియ

గాక భర్తృశుశ్రూషణాదిగుణము వలనను, దేహసౌందర్యమువలనను గూడ సీతయెడ రామునికి మఱిమఱి ప్రేమ వృద్ధినొందెను. రాముని హృదయములో సీత నిలిచి యున్నదానికంటె నినుమడిగా సీతహృదయములో రాముఁడు నిలిచి యుండెను. వారి పరస్పరానురాగ మట్టిదిగా నుండెను. సీతకు రామునియెడఁ గల యనురాగ మామె హృదయాంతర్గతమై గూఢముగా నున్నప్పటికిని నాయమ మనోవికారములను బట్టి రాముఁడు తనమనసుతో నూహించి తెలిసికొనుచుండెను. అట్లే సీతయును తనభర్తకుఁ దనపైఁ గలయనురాగము హృదయాంతర్గతమై గూఢముగా నున్నను నాయన మనోవికారములను బట్టి రామునికంటె మిక్కిలిగాఁ దెలిసికొనుచుండెను. రామునికంటెను విశేషముగాఁ దెలిసికొనఁ గల్గుట కాయమ పుట్టిన దేశస్వభావమునుబట్టియు వంశస్వభావమునుబట్టియు సీత అంతటి సూక్ష్మజ్ఞానురాలయ్యెను. మఱియు నాయమ దేవతలతో సమానురాలు. రూపములో సాక్షాత్తు దివ్యమంగళ విగ్రహురాలైన లక్ష్మీదేవివంటిది. అట్టి లోకైకసుందరియు, నతిప్రేమాస్పదురాలును, నుత్తమరాజకన్యకయునగు సీతతోఁ గూడి రాజర్షి కుమారుఁడును దివ్యశక్తి సంపన్నుఁడగు శ్రీరాముఁడు లక్ష్మీదేవితోఁ గూడిన దేవదేవుఁ డగు విష్ణుమూర్తివలె మిక్కిలి విరాజిల్లెను.

ఇది శ్రీమద్వాల్మీకి రామాయణానుసారియగు నాంధ్రవచన రామాయణమునందు బాలకాండము సంపూర్ణము.



# ఫలశ్రుతి

శ్లో॥ యః శృణోత్యాగిమం కాండం బాలాఖ్యాం రామజన్మకమ్,
పఠత్యాచంచలో భక్త్యా భుక్త్వా భోగా నిహేప్సితాన్,
అంతే శ్రీసూర్యసాయుజ్యం గచ్ఛత్యత్ర న సంశయః.

తా॥ ఎవఁడు శ్రీమద్రామాయణంబున మొదటిదియు, రాముని జననము మొదలగు కథలు గలిగినదియునైన బాలకాండమును జదువుచున్నాఁడో, ఎవఁడు నిలుకడగల మనస్సుతో వినుచున్నాఁడో, వాఁడిహలోకంబున సకల సౌఖ్యములం బొంది, యంతమున సూర్యలోకంబును బొందుచున్నాఁడు. సంశయము లేదు.

శ్లో॥ రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

శ్లో॥ యదక్షరపదభ్రష్టం మాత్రాహీనంతు యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తు తే.

ఓం తత్సత్; శ్రీకృష్ణార్పణమస్తు

---

చెన్నపురి : శ్రీ 'బ్రహ్మ' ప్రెస్సున ముద్రితము.—1956

# వచనగ్రంథములు

ప్రతి 1-కి రూ. అ.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకటే సంపుటము | | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | ... | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ,, ఆరణ్యపర్వము | ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 | 8 |
| ,, శాంతిపర్వము | ... | 7 | 8 |
| ,, ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకు | | 7 | 8 |

ఆంధ్రవచనవాల్మీకిరామాయణము

| | | | | | |
|---|---|---|---|---|---|
| బాలకాండము | 2 | 8 | సుందరకాండము | 3 | 0 |
| అయోధ్యాకాండము | 5 | 0 | యుద్ధకాండము | 7 | 8 |
| అరణ్యకాండము | 2 | 8 | ఉత్తరకాండము | 3 | 8 |
| కిష్కింధాకాండము | 2 | 8 | పూర్తి 1, 2 సంపుటములు | 24 | 0 |

| | | | |
|---|---|---|---|
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్రము | ... | 0 | 12 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 2 | 0 |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 8 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| ఆంధ్రకవిజీవితములు, శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారిది | ... | 6 | 0 |
| ఈసబునీతికథలు, 2-వ భాగము | ... | 0 | 12 |
| ఋషులచరిత్ర | ... | 1 | 0 |
| చార్ దర్వేషుకథలు | ... | 0 | 8 |
| చిత్రరత్నాకరము, గుర్జాడ శ్రీరామమూర్తిగారిది | ... | 1 | 0 |
| జగత్కథ, H. G. Well's History of the World, డా, శరకోపాచార్యులు | ... | 6 | 0 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 12 |
| తిలకుగారి సెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | ... | 0 | 14 |
| తులసీదాసురామాయణము, వచనము | ... | 12 | 8 |
| త్రిలిఙ్గకథలు | ... | 1 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 8 |
| ,, A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |
| దక్కనుపూర్వకథలు | ... | 2 | 8 |
| దశకుమారచరిత్రము, సంజీవరాయశాస్త్రిగారిది | ... | 3 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుగువచనము | ... | 5 | 0 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 6 |
| నీతిరత్నాకరము | ... | 0 | 8 |
| నీతిచంద్రిక, శ్రీచిన్నయసూరి గారిది | ... | 0 | 12 |
| ,, టీకతో | ... | 1 | 4 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 4 |
| పంజాబుఅల్లరి | ... | 0 | 8 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 12 |
| పురాణగాథలు I | ... | 1 | 0 |
| ,, II | ... | 1 | 0 |
| బాజీరాయని చరిత్ర | ... | 1 | 4 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| ,, రెండవభాగము | ... | 0 | 10 |
| ,, మూఁడవభాగము | ... | 0 | 8 |
| భాగవతకథ, ప్రభుదత్తబ్రహ్మచారి 2-వ భాగము | ... | 2 | 0 |
| భోజునికథలు | ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I-వ భాగము | ... | 1 | 4 |
| ,, II-వ భాగము | ... | 1 | 4 |
| శ్రీమహాభక్తవిజయము | ... | 12 | 0 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 8 |
| మైరావణచరిత్ర | ... | 0 | 2 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| శ్రీత్యాగరాజకీర్తనహారము | ... | 5 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.